శ్రీః

# విజ్ఞప్తి

శ్రీమదఖిలాండకోటి బ్రహ్మాండనాయకుడగు పరంధాముడు అనాది కాలముగ వేంకటాచలమందు నెలకొనియుండుట జగద్విదితము. ఈ పరంధాముని నిత్యము వేలాది భక్తులు దర్శించుచుందురు. ఈ వేంకటాచలమందు నెలకొనియున్న మూర్తి సాధారణమయిన మూర్తిగాదు. ఈ మూర్తి మహామహిమ సంపన్నము; కలియుగ ప్రత్యక్షదైవము. ఇట్టి మూర్తినిగూర్చి భక్తులకు వివరించి చెప్పజాలు గ్రంథము శ్రీవేంకటాచల మాహాత్మ్యమను పురాణ గ్రంథము. ఇది సంస్కృత శ్లోక మయము. ఈ గ్రంథము పామరజనులకు అవగతముకాదు. నిత్యము భారతదేశపు మూలమూలలనుండియువచ్చు భక్తులలో నధికసంఖ్యాకులు పామరజనులు. ఈభక్తులు వేంకటాచల మాహాత్మ్యమను పురాణ గ్రంథరాజములోనుండు తత్త్వములను దెలియజాలరు. కావున ఇట్టి భక్తుల ఉపయోగముకొఱకు శ్రీ వేంకటాచల మాహాత్మ్యమను పురాణమునందలి ముఖ్యాంశములను తేటతెల్లముగనుండు తెనుగుభాషలో వ్రాయించి ముద్రింపవలెనను కుతూహలము చిరకాలముగ నుండెడిది. శ్రీ వేంకటాచల మాహాత్మ్యమను పురాణగ్రంథములోని విషయములను తెనిగించుట; అద్దానిని ముద్రించుటయు కడు వ్యయప్రయాసలతో గూడియుండును. కావున సముద్రములోని తరంగములవలె మాబోంట్లకు కలిగిన పైకోరికలు మాహృదయము లందు అప్పుడప్పుడు ఉప్పతిల్లి వెనువెంట మాహృదయములందే లీనము లగుచుండెడివి.

ఇట్లుండ శ్రీ వేంకటేశ్వరానుగ్రహముచే నామధ్యనే శ్రీ వేంకటాచల మాహాత్మ్యమను పురాణగ్రంథములోని ముఖ్యాంశములను చదువరులకు సుబోధకమగునట్టి కథారూపమున " శ్రీ వేంకటేశ్వర వైభవము "

అను పేరిట నొక విద్వాంసులు రచించిరని విని మిక్కిలి యుత్సాహముతో వారిని దర్శించి అచ్చొత్తింతుమని వారికి నచ్చజెప్పి ఆగ్రంథమును స్వీకరించితిమి. ఈ చిన్ని పొత్తమును గ్రంథకర్త తమ నామధేయముతో నచ్చొత్తింప నిష్టపడనందున ఈ గ్రంథమును 'సోమదశా' విరచితమను పేరిట మా కొసగిరి. ఈ ద్వితీయ ముద్రణ సమయమున వారు దయతో తమ నామధేయ ప్రకటనమున కంగీకరించినందున ఏతద్రచయిత సోమ దీక్షితుల పుత్త్రులు కొంపెల్ల దక్షిణామూర్తి శాస్త్రులుగారు, ఎం.ఏ. అని పాఠకలోకమునకు ప్రకటించుచున్నాము. వారికి మేమెంతయు గృతజ్ఞులము. శ్రీ వేంకటేశ్వరుడు తన వైభవము పలువుర భక్తుల కందజేయ దగినరీతి మమ్మనుగ్రహించినందులకు ఆ యేడుకొండల యేలికకు తల నొగ్గి జీవితాంతము మ్రొక్కగలము.

తిరుపతి,
25-9-59

ఇట్లు,
ప్ర కా శ కు లు.

శ్రీః

# తొలి పలుకు

శ్లో॥ శ్రియఃకాన్తాయ కల్యాణ నిధయే నిధయేఽర్థినామ్ ।
శ్రీవేంకట నివాసాయ శ్రీనివాసాయ మంగళమ్ ॥
శ్రీవేంకటాచలాధీశం శ్రియాధ్యాసిత వక్షసమ్ ।
శ్రితచేతన మందారం శ్రీనివాసమహంభజే ॥

శ్రీమన్నారాయణుడు నిజభక్తులనుద్ధరించుటకై భూమండలమున పలు అవతారముల నెత్తుచుండును. అట్టి యవతారములను సేవించి ఆ పరమేశ్వరుని యనుగ్రహముచే నధ్యాత్మజ్ఞానమునొంది ముక్తివడయుట పుట్టిన మనుజుల ముఖ్యకర్తవ్యము. అనాదికాలముగ బ్రవర్తించుచున్న యీ సంసారపథమున పూర్వకర్మానుసారముగ బుట్టుచు జచ్చుచు తుది గానలేని మనము పూర్వమెన్నడు ముక్తినొందియుండలేదనుట తథ్యము. మనము మున్నెన్నడేని ముక్తినొందియుండిన నేడీ సంసారపథమున మరల బుట్టియుండము. ముక్తినొందినవారలీ సంసారపథమున మరలి రారని "నస పునరావర్తతే" అను మొదలగు వేదాంతములు నొక్కి వక్కాణించుచున్నవి. కావున మనము పరమేశ్వరానుగ్రహము వడసి జ్ఞానమును సంపాదించి పరమపదమునుజేరుతెఱగున సంచరింపవలయును. పరమపావనమగు పురాణములను జదువుట, వినిపించుట మున్నగుసత్కార్యములు పరమేశ్వరానుగ్రహము వడయుటకు ముఖ్యోపాయములు. సూతునివలన పురాణములను విన తాము తరించి, పరులను తరింపజేసిన మహనీయు లెందఱో కలరు. అట్టి పురాణగాథలను పలువురకు దెలుపు నుద్దేశ్యముతో తెనిగించుటయు పావనకార్యముగ నెంచవచ్చును. ఈ సందర్భమున నా యనుభవము నిందు పొందుపఱచెదను.

నేను రెండు సంవత్సరములుగ నొక వివాహ శుభకార్యమును నిశ్చయించు కార్యములో నిమగ్నుడనై యుంటిని. మొన్న వేసవిలో ఈ "శ్రీ వేంకటేశ్వర వైభవము"ను వ్రాయుచుంటిని. నాచేయబూనిన వివా

హమునకు సంబంధములు వచ్చుచున్నవి. అట్టి సంబంధములలో నొక సంబంధమును నేను చూడబోవుచుంటిని. అప్పట్టున నేను "శ్రీ వేంకటేశ్వర వైభవము"లో శ్రీవేంకటేశ్వరుడు ఆకాశరాజ పుత్రికయగు పద్మావతీదేవిని జేబట్ట నిశ్చయించుకొని సకల దేవతా బృందముతో నారాయణపురమునకు పెండ్లికి తరలిపోవు సందర్భమును వ్రాయుచుంటిని. నా చేయదలచిన శుభకార్యమునకు చక్కని పట్టులో సంబంధము వచ్చెనని మిక్కిలి సంతసించితిని. ఆ సంబంధము స్థిరపడెను. ఒక వారము రోజులలో శ్రీవేంకటేశ్వరస్వామి యనుగ్రహమున పాణిగ్రహణ మహోత్సవము నిర్విఘ్నముగ జరిగెను. "నహి కల్యాణకృత్కశ్చిద్దుర్గతింతాత గచ్ఛతి" అను భగవద్గీతావాక్యము జ్ఞాపకమువచ్చెను. మంచిపని చేయువారలకు చెడుపు యెన్నడు గలుగదు.

2-6-1955 గ్రంథకర్త.

శ్రీః

# ఉపోద్ఘాతము

శ్లో॥ కృతేతు నరసింహోఽభూత్త్రేతాయాం రఘునందనః ।
ద్వాపరే వాసుదేవశ్చ కలౌ వేంకటనాయకః ॥

శ్రీవేంకటేశ్వరస్వామి కలియుగమున ప్రత్యక్షదైవమని పలువురు భక్తు లెఱిగిన విషయమే. మహాప్రళయ సమయములో జలధారము నోపజాలక పాతాళమున గ్రుంకి హిరణ్యాక్షుని పాల్పడిన ధరామండలమును శ్రీమన్నారాయణుడు శ్వేత వరాహరూపముతో నుద్ధరించి యథాపూర్వముగ జీవకోటిని సృజింప చతుర్ముఖుని నియమించి తాను వైకుంఠమున కేగి లక్ష్మీదేవితో సుఖాన నివసించుచుండెననియు, అంత చతుర్ముఖుడు తాను సృజించు జీవకోటికి శ్రీమన్నారాయణుండు ధరామండలమునం దవతరించి భక్తిని బుట్టింపకున్న జీవులు భ్రష్టులయి ముక్తిని బడయజాలరని తలచి యెట్లయిన శ్రీమన్నారాయణుడు భూమండలమునం దవతరించు నుపాయమునుజూడుమని నారదుని నియమించెననియు, అంత నారదుడు గంగానదీతీరమున కశ్యపాదులాచరించు యజ్ఞమునకుజని త్రిమూర్తులలో సాత్త్వికుడగు మూర్తికి యాగఫలము నర్పింపుడని తెలుప భృగువు మువ్వురుమూర్తులను స్వయముగబరీక్షించి సాత్త్వికమూర్తిని నిశ్చయింపబోయి బ్రహ్మరుద్రులను రాజస తామసమూర్తులుగ నిశ్చయించి వైకుంఠమునకేగి అప్పట్టున లక్ష్మీసమేతుడయి శేషతల్పమున బరుండియున్న శ్రీహరి వక్షమును కాలదన్నెననియు, అయ్యును గోపింపని శ్రీహరిని సాత్త్వికమూర్తిగ భృగువు నిశ్చయించెననియు పురాణములు వెల్లడించుచున్నవి. ఇప్పట్టున తాను నివసించుచున్న వక్షము నొకవిప్రుడు కాలదన్నిననుగోపింపక వినయోక్తులతో నావిప్రు నాదరించిన శ్రీహరిపై లక్ష్మీదేవి యలిగి వైకుంఠమునుబాసి కొల్హాపురమునకు బోయెను. సర్వజ్ఞుడగు శ్రీహరి ఇట్టి భావికార్యములను ముందుగనే తలపోసి వైకుంఠములోనుండు తన క్రీడాపర్వతము (వేంకటాచలము)ను ఆదిశేషవాయువులకు కలహము

వెట్టి భూమండలమునకు దెప్పించెను. కావున లక్ష్మీదేవి వైకుంఠమును వీడి కొల్హాపురమునకేగినంత శ్రీహరి ఒంటిమై వైకుంఠమున నుండనేరక భూమండలమునకేతెంచి సువర్ణముఖరీనదీతీరమున నిలచి యుత్తరాభిముఖముగజూచి యీ వేంకటాచలమునుగాంచి దాని నధిష్ఠించి నాటనుండియు వేంకటాచలముపై నివసింప నారంభించెను. పైయంశములన్నియు చదువరులకు "శ్రీ వేంకటేశ్వర వైభవము"లో విశదముకాగలవు. జీవకోటికి భక్తినిబుట్టింప తానవతరించుటచే శ్రీ వేంకటేశ్వరుడు భక్తులతో స్వయముగ మాటాడుచుండెననియు పురాణములు ప్రకటించుచున్నవి. నేటికిని పలువురు భక్తులు శ్రీ వేంకటేశ్వరుని ప్రత్యక్షదైవముగ నెఱుగుదురు. కొంతకాలమునకుబూర్వము గవర్నరుగ చెన్నరాజధానిని బాలించిన శ్రీమన్రోదొర సయితము శ్రీ వేంకటేశ్వరస్వామిని బ్రత్యక్షముగ జూచెనను నిదర్శనములును గలవు. మఱియు శ్రీ వేంకటేశ్వరస్వామి కోర్టులో సాక్ష్యమిచ్చెననియు ప్రతీతికలదు. ఇట్టి నిదర్శనములను లెక్కించి జూపనేల? శ్రీ వేంకటేశ్వరస్వామి కలియుగములో ప్రత్యక్షదైవమని ప్రపంచము ఆబాలగోపాలము గుర్తెఱిగియున్నది.

ఇక్కథా సందర్భమునకు మూలమగు శ్రీ వేంకటాచల మాహాత్మ్యమను పురాణగ్రంథము పదునెనిమిది పురాణములలో బదిరెండు పురాణములందుగల కథాభాగము నుద్ధరించి "శ్రీ వేంకటాచల మాహాత్మ్యము" అను పురాణమును తొలుత దేవస్థానమువారు ముద్రించిరి. ఈ కథా సందర్భము వేఱువేఱు పురాణములలో ప్రస్తావింపబడియుండుటచే ఈ కథాభాగములోని తొలిభాగముమాత్రము మూలగ్రంథములో వేఱువేఱు కథాసంవిధాన సందర్భములతోడనే ఉపక్రమింపబడియున్నది.

అది ఎట్లన?

బ్రహ్మ విష్ణు మహేశ్వరులు మువ్వురు మాయాగుణములగు సత్త్వ రజస్తమస్సుల సంపర్కముచే జగముల జన్మస్థితిభంగములను గావింతురు. బ్రహ్మ రజోగుణ సంపర్కముచే జగములను బుట్టించును. శ్రీహరి సత్త్వగుణ సంపర్కముచే చతుర్ముఖుడు పుట్టించిన పదునాలుగు భువనములను బాలించును, శంకరుడు తమోగుణ సంపర్కముచే ప్రళయ

కాలములో సకల లోకములను సంహరించును. ఇవ్విధమున ముప్పూరు మూర్తులు దమతమ కార్యములను యధోచితకాలములలో సాగించుచు నుండ కాలచక్రము యుగరూపమున దిరుగుచుండును. ఇట్టి నాలుగువేల యుగములు తిరుగునంత బ్రహ్మకు ఒకరోజులో పగటికాలము పూర్ణ మగును. బ్రహ్మకు రాత్రివేళయు నాలుగువేలయుగముల పరిమితమయి యుండును. ఇట్టి పగటికాలముతీరి బ్రహ్మకు రాత్రివేళకానంత ద్వాద శాదిత్యులు నిప్పులుగ్రక్క నారంభింతురు. ఆ వేడిమికి చరాచర ప్రపంచ మంతయు మలమలమాడి భస్మమగును. అంతట ప్రళయమేఘములు కుండ పోతగురియ నారంభించును. ఈ బ్రహ్మాండమంతయు భస్మమయి యుండుటచే వానకుదడిసి విశీర్ణమయి నీటమునిగి పాతాళమున గ్రుంక నారంభించును. ఇట్టి తరుణమున శ్రీహరి శ్వేతవరాహరూపమునుదాల్చి తన కోరలతో ధరామండలము నుద్ధరించి నిలబెట్టి యధాపూర్వముగ సృజింపుమని బ్రహ్మ నాదేశించి తాను వైకుంఠమునకేగెనని యొక పురాణ గాధా సందర్భము.

శ్రీహరి ప్రళయజలములలో మునుగు ధరామండలము నుద్ధరించి శ్వేతవరాహరూపమును దాల్చి తన కోరలతో ధరామండలము నుద్ధరించి నిలబెట్టి యధాపూర్వముగ సృజింపుమని బ్రహ్మ నాదేశించెను. కాన తానా శ్వేతవరాహరూపముతో వైకుంఠమునకేగిన లక్ష్మీదేవి శ్వేతవరాహ రూపముతోనుండు తనను గారవింపదను నుద్దేశ్యముతో గొంతకాలమీ ధరామండలమందే నివసింపనెంచి గరుడునిచే వైకుంఠమునందలి తన క్రీడాద్రిని (వేంకటాచలమును) భూమండలమునకు దెప్పించెనని మఱి యొక పురాణగాధా సందర్భము.

తొలి పురాణగాధ ననుసరించి శ్రీహరి వైకుంఠమునకేగి రమా దేవితో సుఖాన నివసించుచు భావికార్యములను దలపోసి ఒకప్పుడు ఆది శేషుని ద్వారముకడ కాపుగడవెట్టెను. అప్పట్టున శ్రీహరినిజూడ నేతెం చిన వాయువుతో నాదిశేషునకు గలహమునుబెట్టి ఆ కలహమూలమున ఈ క్రీడాద్రిని (వేంకటాచలమును) శ్రీహరి భూలోకమునకు దెప్పించెను. ఈ క్రీడాద్రికి కృత త్రేతా ద్వాపర కలియుగములలో గ్రమముగ వృషభ

అంజన శేష వేంకటాచలములను నామభేదములు గలవు. వేంకటాచల మునకు ఈ నామధేయములలో శేషాచలమను పేరు వచ్చుటకు ఈ శేష వాయు సంవాదమే కారణము. పై యంశములు చదువరులకు గ్రంథ ములో విశదము కాగలవు.

వేంకటాచలముయొక్క గొప్పదనము.

ఈ వేంకటాచలము మహామేరువుయొక్క పుత్త్రుడని పురాణ ములలో ప్రసిద్ధము. ఆ యంశము చదువరులకు గ్రంథములో స్పష్టము కాగలదు. మహామేరువు దేవతలకు నివాసస్థానము. కనుక మహా మేరువుయొక్క పుత్త్రుడగు వేంకటాచలమందును దేవతలు నివసింతు రనుట స్పష్టము. కావున వేంకటాచల మాహాత్మ్యమను పురాణగ్రంథము సయితము యీ వేంకటాచలమందలి మృగపక్ష్యాదులను సయితము దేవతా స్వరూపులనియు, ఋషిస్వరూపులనియు వర్ణించుచున్నది. దేవతలు శ్రీ వేంకటేశ్వరుని సేవింపవచ్చి యందే నెలకొనియుండిరనియు వర్ణించును. మఱియు నీవేంకటాచలము అసంఖ్యాకములగుతీర్థములతో నిండియున్నది. ఇందలి తీర్థములసంఖ్య చెప్పనలవిగాదు. ఆకాశగంగ పాపవినాశనము మొదలగు కొన్ని ముఖ్యతీర్థములను, వాటి ప్రభావములను మాత్రము చదు వరులు గ్రంథమందు గ్రహింపగలరు. శ్రీ వేంకటాచల మాహాత్మ్య పురాణములో ప్రతి తీర్థమును కడు శ్రేష్ఠమయినదనియే వర్ణింపబడినది. కాని స్వామిపుష్కరిణియనుతీర్థము సకల తీర్థములలో మిక్కిలి శ్రేష్ఠము. ఆ తీర్థములో స్నానమాచరించుటచే రాజ్యభ్రష్టుడగు శంఖణుడు మరల తనరాజ్యమును బొందెను. ఈ తీర్థములో స్నానముజేసిన శంఖణునకు స్వామిత్వమును కలుగజేయుటచే నీ తీర్థమునకు స్వామితీర్థమను పేరు వచ్చెనని పురాణములో గలదు. మఱియు నీ తీర్థము సకల తీర్థములకు మొదలని. కనుక ఈ తీర్థము స్వామితీర్థమనబడుననియు పురాణములు ఘోషించును. కనుకనే వేంకటాచల మాహాత్మ్యములో ఈ తీర్థముయొక్క ప్రాశస్త్యమును యిట్లు వర్ణించిరి :—

సత్రతవ
ఫలు

"స్వామి పుష్కరిణీస్నానం సద్గురోః పాదసేవనమ్ ।
ఏకాదశీవ్రతంచాపి త్రయమ్యతంత దుర్లభమ్ ॥

ఇట్టి పరమపావనములగు ముక్కోటి తీర్థములతో నిండియుండు టయే ఈ కొండయందలి గొప్పదనము.

## క్షేత్ర పరిపాలన, ప్రాచీనత.

ఈ వేంకటాచల దివ్యక్షేత్రము కొంతకాలమునకు బూర్వము చోళ వంశపురాజుల పరిపాలనలోనుండెనని శ్రీ వేంకటాచల మాహాత్మ్య పురాణమందే కలదు. పిమ్మట విజయనగర రాజులకు ఈ వేంకటాచల క్షేత్రముతో సంబంధముగలదనియు నిరూపింపగల ఆధారములు కల వనియు జెప్పుదురు. శ్రీ కృష్ణదేవరాయలకు ఈ దివ్యక్షేత్రముతోగల సంబంధము స్పష్టము. కావున ఈ దివ్యక్షేత్రము వేలాది సంవత్సరము లుగాకున్న వందలాది సంవత్సరములుగనైనను ప్రాచీనమనుట యథా ర్థము. ఆంగ్లేయులు తొలుత వర్తకసరళితో మనదేశమునకువచ్చి మన దేశమును పాలింప మొదలిడిరి. కాని కొంతకాలమునకు బిమ్మట ఆంగ్లే యులు భారతీయుల మత సంప్రదాయములలో జోక్యము కలుగజేసుకొను తలంపులేక ఈ వేంకటాచల పరిపాలనమును ఆ కాలమున తిరుపతిలో స్థిరనివాసమేర్పఱచుకొనియున్న హథీరాంజీ మఠాధిపతులగు శ్రీ మహం తునకు అప్పగించిరి. ఈ మఠాధిపతులగు మహంతులు కొన్ని వందల సంవత్సరములుగ ఈ దివ్యక్షేత్రములో స్థిరనివాసమేర్పఱచుకొని శ్రీవేంక టేశ్వరస్వామిని దర్శింపవచ్చు భక్తులకు తగు సదుపాయములనుగల్పించు చుండిరి. నేటి కాలమునకు ఆంగ్లేయులు వేంకటాచలక్షేత్ర పరిపాలన మును మహంతునకు వప్పగించుటచే ఆ కాలపు మహంతు ఈ క్షేత్ర[illegible] పాలనాధికారియయ్యెను. శిష్యపరంపరా సంప్రదాయముతో నీ హథీ[illegible]జీ మఠాధిపతులగు మహంతులు దాదాపు నూఱు సంవత్సరములు[illegible] వేంకటాచలక్షేత్ర పరిపాలనమును సాగించిరి. పిమ్మట అనగా 19[illegible] సంవత్సర ప్రాంతమున చెన్నరాజధాని రాజకీయాధికారులు ఈ క్షేత్ర[illegible]మా పాలనకొఱకు ఒక సంఘము నేర్పాటుజేసి ఆ సంఘసభ్యులు గా[illegible] ఆది తీర్మానములను ఆచరణలోబెట్టుటకై ఒక కమీషనరును నియమి[illegible]తెం క్రమక్రమముగ ఆ కమీషనరును ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు అని వ్యవహ[illegible]మున మొదలిడిరి. ఈ పదవిని తొలుత అలంకరించినవారు శ్రీ చె[illegible]ను. అన్నారావుగారు.

రాజకీయాధికారులు ఈ క్షేత్రమును బాలించుటకు సంఘమును నియమించుపర్యంతముగల క్షేత్ర పరిపాలనా విధానమును మనమొక మొగ్గతో బోల్పనగును. ఈ సంఘము నియమింపబడినదాది ఆ మొగ్గ వికసింప మొదలిడెను; నలుదెసల తన దివ్యపరిమళమును వెదజల్ల నారంభించెను. ఈ దివ్య పరిమళముచే నాకర్షింపబడిన భక్త భృంగములు మూలమూలలనుండియు నసంఖ్యాకములుగ నెల్లకాలములందును రాజొచ్చినవి. ఈ క్షేత్ర పరిపాలకులు దినదినము తండోపతండములుగ వచ్చు భక్తులకు తగు వసతులను కల్పించుటలోజూపు శ్రద్ధయే యాత్రికులసంఖ్య పెఱుగుదలకు గారణము.

## యాత్రికుల సదుపాయములు.

భారతదేశపు తూరుపు కనుమలలో నెలకొని చూడముచ్చటగొలుపు నీ పర్వతపంక్తి (వేంకటాచలము) ఆంధ్రరాష్ట్రపు చిత్తూరు మండలములో గలదు.

రైలు సదుపాయములుగల యీ రోజులలో యాత్రికులు మిక్కిలి సౌకర్యముతో తిరుపతి పట్టణమునకు జేరగలరు. ఆ విధముగ దినదినము తండోప తండములుగ వచ్చు భక్తులకు తగు వసతులను తదితర సదుపాయములను కల్పించుటలో దేవస్థానాధికారులు కడు శ్రద్ధ వహింతురు. యాత్రికులు తిరుపతిచేరినవెంటనే తగిన సకల సదుపాయములతో నివసింపదగు విశాలమగు సత్రమును రైలుస్టేషనుకు సమీపములో గట్టించిరి. ఈ సత్రమును యింద్ర భవనమనవచ్చునేకాని సత్రమనరాదు. చూచి నివసించి తీరవలయునేకాని వర్ణింపనలవికాదు. ఈ సత్రము సకల సదుపాయములతో నిండియున్నది. వచ్చిన యాత్రికులు వంటజేసుకొనదలచిన యెడల పాత్రసామగ్రిని దేవస్థానమువారు ఉచితముగ నిత్తురు. కట్టెపుల్లలు మొదలు వంటకుగావలసిన సకల సామగ్రిని విక్రయించు అంగళ్లు యీ సత్రము ఆవరణమందే కలవు. యాత్రికులు బసచేయు గదులు తాము శుభకార్యములకు సాగించినను సరిపోవునంతటి విశాలముగ నుండును, సత్రములో స్నానముచేయుటకు వేడినీళ్లుసయితము దొఱకును. యాత్రికులు సిద్ధాన్నము నారగింపదలచినయెడల రుచ్యములగు పదార్థములతో

యాత్రికులను తృప్తిపఱచగల కాంటీను (హోటలు) సయితము సత్రము ఆవరణమందే కలదు.

పూర్వమువలె యాత్రికులిపుడు కాలినడకను పోనక్కరలేదు. త్రోవలో ముక్కుచు మూలుగుచు నరవాహనారూఢులు కానక్కఱలేదు. దేవస్థానాధికారులు బహు వ్యయ ప్రయాసలకోర్చి దిగువ తిరుపతినుండి ఎగువతిరుపతి శ్రీ వేంకటేశ్వరాలయ పర్యంతము మోటారుబండ్లు పోగల తారురోడ్డు నిర్మించిరి. అనేక బస్సులను నిత్యము రెండువేళల దిగువ తిరుపతినుండి ఎగువతిరుపతికి నడుపుచున్నారు. ఈ సదుపాయములతో ఎట్టి వయోవృద్ధులయినను అనాయాసముగ ఎగువ తిరుపతికి పోగలరు. కలియుగ ప్రత్యక్షదైవమగు శ్రీ వేంకటేశ్వరస్వామిని కన్నుల పండువుగ సేవింపగలరు. ఎగువ తిరుపతియందును యాత్రికులు సదుపాయములతో నివసింపదగిన వసతి సౌకర్యములు గలవు. శ్రీ వేంకటేశ్వర స్వామికి ప్రతి నిత్యము తెల్లవారుఝామున సుప్రభాతము (మేలుకొలుపు) మొదలు రాత్రి పవళింపుసేవ పర్యంతము సేవలు యథాక్రమముగ జరుగుచుండును. యాత్రికులకు ప్రతినిత్యము మూడువేళలందును ఉచితముగ దర్శనముచేసుకొనదగు సదుపాయములు గలవు. ఇవిగాక శ్రీ వేంకటేశ్వరస్వామికి నిత్యము జరుగు విశేష సేవలకు నిర్ణీతమైయుండు సొమ్ము చెల్లించి ఆయా విశేష సేవలను దర్శింపవచ్చును. స్వామికి కల్యాణోత్సవము మొదలగు సేవలకు నిర్ణీతమగు సొమ్మును చెల్లించి ఆయా సేవలను సయితము యాత్రికులు చేయించవచ్చును. ఈ స్వామికి నిత్యము కన్నులపండువుగ జరుగు సేవలను చూచితీరవలయునేకాని వర్ణింప నలవికాదు.

కం॥ కలియుగదేవుని విభవము
దెలుపఁగ నెవ్వరికి దరము తెలిసిన పూర్వుల్ ।
తెలిపిన జాడల గొన్నిఁటి
దెలిపితినో భక్తులార దీనిం గనుడీ !

కొంపెల్ల దక్షిణామూర్తి.

---

# ఆనందనిలయము



పరబ్రహ్మము సచ్చిదానంద స్వరూపము శ్రీవేంకటేశ్వర స్వామి భక్తకోటి ననుగ్రహించుటకై వేంకటాచలముపై నవతరించెను. ఈ వేంకటేశ్వరస్వామి నివసించు గర్భాలయమును ఆనందనిలయమందురు. అనఁగా ఆనందరూపుఁడయిన శ్రీ వేంకటేశ్వరస్వామి నెలకొనియుండు ప్రదేశమని యర్థము. ఈకొండపై శ్రీ వేంకటేశ్వరస్వామి అనాదికాలముగ నవతరించి యుండెనని మనకు పురాణములు చెప్పుచున్నవి. చరిత్రాత్మకముగ క్రీస్తునకు పిమ్మట 813-వ సంవత్సరమునుండి 1540-వ సంవత్సర పర్యంతము శ్రీ వేంకటేశ్వరస్వామి ఆయాకాలపు రాజుల భక్త్యాదరములకు పాత్రమయియున్నట్లు తెలుపగల వందలాది శాసనములు గలవు. ఈ గర్భాలయముపైనుండు గోపురమును ఆనందనిలయ విమానమని అందురు. దేవస్థానాధికారులు ప్రచురించిన శిలాశాసనములను పరిశీలింపగా ఈ ఆనందనిలయవిమానమును సుమారు 700 ల సంవత్సరముల నుండియు ఆయాకాలపు రాజులు మఱలమఱల సంస్కరించుచుండిరనుట స్పష్టపడుచున్నది. ఈ విమానసంస్కారమును తొలుత జాతవర్మన్ సుందరపాండ్యుడు 1262 వ సంవత్సర ప్రాంతములో జేయించెను. అప్పటినుండియు నేటి పర్యంతము గతించిన సుమారు 700 ల సంవత్సరములలో ఈ ఆనందనిలయ విమానమును పలువురు రాజభక్తులు సంస్కరింపజేసిరి. అట్టి ఈ ఆనందనిలయ విమానమును ఆగష్టునెల 1958 వ సంవత్సరములో దేవస్థానాధికారులు లక్షలకొలది ధనమును వెచ్చించి కడు ప్రయాసతో చూడ ముచ్చట గొలుపునట్లు సంస్కరింపజేసిరి. ఈ ముద్దు లొలుకు ఆనందనిలయ విమానమును భక్తజనులు తనివితీర జూచి తీరవలయునే కాని చెప్ప నలవి గాదు; వ్రాయ నలవి గాదు.



# విషయసూచిక.

విషయము. | పేజి.

విషయము. పేజి.

విషయము. పేజి.

శ్రీ వేంకటేశాయనమః.

# శ్రీ వేంకటేశ్వర వైభవము

## (తిరుపతి శ్రీ వేంకటేశ్వర మాహాత్మ్యము)

శ్రీమన్నారాయణుని నాభికమల సంభవుడగు చతుర్ముఖుండు జగములను బుట్టింప నారంభించెను. శ్రీమన్నారాయణుండు బాలింప మొదలిడెను. ఇట్లు గొంతకాలము గడువ నా చతుర్ముఖునకు బగటికాలము తీరెను. చతుర్ముఖుడు రాత్రివేళకానంత నిదురింపబోయెను. ఇట్టి తరుణంబున చండకిరణుడు తన తీవ్ర కిరణములను వెలుగొందజేయ చరాచరములు మలమల మాడజొచ్చెను. ప్రళయవాయువులు వీవసాగెను. సంవర్తకాది మేఘములు కుంభవృష్టిని గురియ మొదలిడెను. ధరామండలము జలభారము నోపజాలక పాతాళమున గ్రుంకజొచ్చెను. శ్రీమన్నారాయణుండు ఇట్టి ధరామండలము నుద్ధరింప చతుర్ముఖ మహాదేవుల వశముకాదని తలచి భీకరమగు శ్వేత వరాహరూపమునుదాల్చి పాతాళమునకేగి ధరామండలమును వెదక నారంభించెను. అంత హిరణ్యాక్షుడు ధరామండలమును గొంపోవ నేతెంచిన శ్వేత వరాహరూపియగు శ్రీహరినిజూచి యతనితో బోరాడ మొదలిడెను. శ్రీహరియు చిరకాలము హిరణ్యాక్షునితో పోరి తుదకు తన కోరలతో హిరణ్యాక్షుని చీల్చి చెండాడి ధరామండలమును తన కోరలతో నుద్ధరించెను. బ్రహ్మాది దేవతలు, సిద్ధులు, ఋషులు, మునులు మున్నగువారలు శ్వేత వరాహ రూపియగు శ్రీహరిని వేనోళ్ల బొగడిరి. పూల వర్షములను గురిపించిరి. యథాపూర్వముగ ధరామండలమును నెలకొల్ప వేడిరి; అనుగ్రహింపుమనిరి. సర్వయజ్ఞమయుడగు శ్రీహరియు నట్లుగావించి చతుర్ముఖునిబిలచి యథాపూర్వముగ సృష్టిని గావింప నియమించి యంతర్ధానము నొందెను. బ్రహ్మ విష్ణు మహేశ్వరులు జగములను బుట్టించి పాలించి సంహరించుచుండ కాలచక్రము దిన పక్ష ఋతు అయన వత్సర యుగరూపమున దిరుగుచుండును. అట్టి యుగ

ములు కృత త్రేతా ద్వాపర కలియుగములను పేర నాలుగు యుగములు. ఈ యుగము లొకటివెంట నొకటి తిరుగుచుండుటచే నీ యుగములకు బూర్వోత్తర నియమములేదు. కావున ముందు వెనుకటి యుగములలోని చరిత్రములను వెనుక ముందుగ వర్ణించినను విరోధమును శంకింప బనిలేదు.

శ్రీమదఖిలాండకోటి బ్రహ్మాండనాయకుండగు శ్రీమన్నారాయణుండు ధరామండలమును నెలకొల్పి చతుర్ముఖుని యధాపూర్వముగ జీవకోటిని సృజింప నియమించి యంతర్ధానమునొందినపిమ్మట లక్ష్మీసమేతుడై వైకుంఠ మున సుఖాన నివసించుచు సకల దేవతలను గాపాడుచు కాలము బుచ్చు చుండెను. ఈ వృత్తాంతమరసి నారదుడు తన తండ్రియగు పరమేష్ఠితో విన్నవించెను. అంత పరమేష్ఠియు జింతాక్రాంతుడై, శ్రీమన్నారాయ ణుడు ధరామండలమునం దవతరించి తన మహిమాదులనుజూపి మానవు లను భక్తిభరితులను గావింపకున్న సకల మానవులు భక్తిహీనులయి పాపాచరణ తత్పరులయి నరకకూపమున బడగలరని యోచించి, నారదు నితో నిట్లనియె. ఓ నారదా! నీవెట్లయినను శ్రీమన్నారాయణుడు ధరా మండలమునకుబోవు నుపాయమును జూడుము అనెను.

ఇక్కాలమున గశ్యపాది మునులు గంగానదీ తీరమున యజ్ఞమును జేయుచుండిరి. అట్టి తరుణమున నారదుడు వీణెమీటుచు నట కేతెంచెను. కశ్యపాదులు అతనింగాంచి యధోచితముగ రావించి సత్కరించిరి. అంత దేవముని వారినిజూచి మీరు యిపుడాచరించుచున్న యాగముయొక్క ఫలము నే దేవున కర్పింతురనెను. కశ్యపాదులు దేవర్షి పలుకు లాలకించి తమలో దాము వితర్కించి యాగఫల భోక్తను నిర్వచించి తెలుపనేరక తెల్లబోయిరి. నారదుడు వారినిజూచి ఓ మునిపుంగవులారా! మీరలు ప్రవృత్తిమార్గ నిరతులై లోక కల్యాణమునకు బాటుపడుచుండుటెంతయు ముదావహము. ముక్తిప్రదుండయిన దేవు డజుడో, పద్మాక్షుడో, హరుడో విమర్శించి అట్టి దేవునకే యాగఫలము నర్పించి సంతసింపుడని హితము బలికి వీణెమీటుచు తా వచ్చిన త్రోవంజనెను. పిమ్మట గశ్యపాది మహా మునులు నారదుని పలుకులను తలచి గుమిగూడి యోచించి త్రిమూర్తులలో నెవ్వండిట్టి మూర్తియైయుండునో పరీక్షించి నిశ్చయింప భృగుమహామునిని గోరిరి.

# భృగువు త్రిమూర్తులను బరీక్షింప బోవుట

అంత భృగుమహాముని త్రిమూర్తులను బరీక్షింపగోరి తొలుత సత్య లోకమునకు బోయెను. అందు తపోజన పరివృతుండై కొలువున్న చతు ర్ముఖునిజూచి మ్రొక్కెను. చతుర్ముఖుడు అనుమతింపక పూర్వమే సుఖా సీనుడయ్యెను. ఇట్టి యకార్యమునకు గోపించి చతుర్ముఖుడు కుపితు డయ్యును గోపమునుజూపక మాటాడక యూరకుండెను. మాటాడక యూరకున్న చతుర్ముఖునిజూచి భృగుమహాముని చతుర్ముఖుని రజోగుణ ప్రధానుడనియు,రజోగుణ ప్రధానుడు ముక్తిప్రదుడు కాజాలడనియు నిశ్చ యించి బ్రహ్మకు భూలోకములో నెందును ఆలయము లేకుండుగాక యని శపియించి సత్యలోకమునువీడి మహాదేవునిజూడ కైలాసమునకు బోయెను.

కైలాసమున మహాదేవుండు యేకాంతమున బార్వతీ సమేతుండై విలాసముగ నుండెను. అట్టి యేకాంత ప్రదేశమునకు భృగుమహాముని రాకనుగాంచి పార్వతీదేవి లజ్జతో మరలిపోవ జూచెను. మహాదేవుం డందులకు గోపించి భృగువును దండింప బోయెను. అంత భృగువు కమండులోదకమును చేతబూని శివుని తమోగుణ ప్రధానునిగా నెఱింగి శివునకు లింగాకారము ప్రాప్తించునట్లు శపియించి శ్రీమన్నారాయణునిజూడ వైకుంఠమున కేగెను.

వైకుంఠ నిలయుండగు శ్రీమన్నారాయణుండు లక్ష్మీసమేతుడై శేష తల్పమున బరుండియుండెను. భృగుమహాముని కోపోద్దీపిత మానసుండై లోనికింజని తన కాలితో శ్రీహరి వక్షమున దన్నెను. అంతట మహా విష్ణువు దిగ్గునలేచి సవినయంబుగ ఓ మునిపుంగవా ! మీ రాకచే నా మంది రము పావనమాయెను. నేను ధన్యుడనైతిని. వజ్రతుల్యమగు నా వక్ష మున దన్నుటచే గలిగిన బాధను మీ పాదపల్లవమెట్టులోర్చెనోకదా! నన్ను మన్నింపవలయును అని పలుకుచు మునిపుంగవుని పాదకమలముల నొత్త నారంభించెను. అంతట భృగువు శ్రీమన్నారాయణుని వినయాది గుణ ములకు మెచ్చి యితండు సత్త్వగుణోపేతుండని యెఱింగి ముక్తిప్రదంబగు దైవతంబుగా నిశ్చయించి కశ్యపాదులకు దెలిపెను. కశ్యపాదులు యాగ ఫలమును శ్రీమన్నారాయణున కర్పించి సంతసించిరి.

రమాదేవితో విలాసముగ నివాసముసలుపు శ్రీమన్నారాయణునకు వైకుంఠములో క్రీడాచలమను పర్వతమొండుగలదు. ఈ క్రీడాద్రి వందలాది సెలయేళ్ళతోడను, సెలయేళ్ల బాఱుటచే నిష్పన్నములగు వేలాది తటాకములతోడను, నానావిధములగు నోషధులతోడను, మఱియు వికసించిన పూలతోనిండిన జాజి, మల్లె, కొండమల్లె లేక బొడ్డుమల్లె మొదలగు తీగెలతోడను, తుమ్మి, కడిమి, ఏఱుమద్ది, చందనము, పనస, కంకేళి, పొగడ, తమాలము, సంపంగి, కేతకి మొదలగు వృక్షములతోడను, కనులపండువు జేయుచుండును. పలువిధములగు పక్షుల కలకలారావములతో శ్రవణానందము గలుగజేయుచుండును. తుష్టపుష్టములగు సింహ శార్దూలాది మృగముల యఱపులతోడను, మదపుటేనుగుల ఘీంకారములతోడను వ్యాకులము గలుగజేయుచుండును.

## క్రీడాద్రికి యుగయుగములలోగల నామభేదములు

ఇట్టి క్రీడాచలమునకు కృత త్రేతా ద్వాపర కలియుగములలో సార్థకములగు నామభేదములు గలవు. కృత త్రేతా ద్వాపర కలియుగములను నాలుగు యుగములు చక్రముపగిది నొకటివెంట మఱియొకటితిరుగుచుండునని ముందు తెలిపియుంటిమి. అవ్విధమున దిరుగు నీ యుగ చతుష్టయములో నొక కృతయుగమున నీ క్రీడాద్రికి వృషభాచలమనియు, మఱియొక త్రేతాయుగమున నంజనాద్రియనియు, వేఱొక ద్వాపరయుగమున శేషాచలమనియు, మఱియొక కలియుగమున వేంకటాచలమనియు సార్థకములగు నామధేయములు వెలయుచున్నవి. అది యెట్లన నొకప్పుడు జనకమహారాజు క్రీడాద్రి సార్థక నామములను దెలియగోరి శతానందుని దెలియజెప్ప గోరెను. శతానందుడంత జనకునకీ వృత్తాంతము నిట్లు జెప్పదొడగెను.

తొల్లి కృతయుగమున వృషభుడను రక్కసుడొక్కడుండెను. ఆ వృషభుడు శేషపర్వతమున సంచరించుచు నందందు తపమాచరించు మునిపుంగవులను బాధింపదొడగెను. ఈ రక్కసుని బాధల నోర్వజాలక తాపసులు శ్రీహరిని స్మరించి నుతింపసాగిరి. ఒకప్పుడు శ్రీహరి తపోధనులకు దర్శనము నొసగెను. దర్శనమునొసగిన శ్రీహరిని వేనోళ్ల బొగడుచు తపో

ధనులు రక్కసుని బాధలను దొలగింపవేడిరి. శ్రీహరి తాపసుల కభయము నొసగి వేంకటాచలమందు వృషభాసురుని వెదుక నారంభించెను. వృషభుడు తుంబురుతీర్థమున ముమ్మాఱు నిత్యము మునుగుచు, నధోముఖము కరాళదంష్ట్రాభాసితమునగు నారసింహ సాలగ్రామమును బూజించుచుండెను. నిశ్చల భక్తితో వృషభుడు పూజావసానమున తన శిరమును ఖడ్గముచేగోసి సాలగ్రామమున కర్పించుచుండెను. శిరము నర్పించునంత నతని కంఠనాళమున మఱియొక శిర మంకురించుచుండెను. వృషభు డివ్విధమున తన శిరఃకుసుమములచే సాలగ్రామమును బూజించుచు నయిదువేల వత్సరములను గడపెను. ఒకనాడు రక్కసు డివ్విధమున సాలగ్రామము నారాధించుచుండ సాలగ్రామ మధ్యమునుండి శ్రీహరి యావిర్భవించెను. ఆవిర్భవించిన శ్రీహరినిజూచి రక్కసుడు లేచి సాష్టాంగము నాచరించి భక్తిపరవశుడై మూర్ఛనొందెను. ముహూర్తకాలములో తెలివి నొంది ఓ అనంతా! ఓ గోవిందా! నేను ముక్తిని గోరను; స్వర్గమునుగాని, యింద్రపదమునుగాని నే నభిలషింపను. ఓ జగన్నాధా! నీ దశావతార చరితములలో నీ యమిత పరాక్రమమును వినియుంటిని. ఓ పురుషోత్తమా! నీ పరాక్రమము నిపుడు జూపుము. నాకు యుద్ధభిక్షము నొసగుమనెను. అంత శ్రీహరి యుద్ధ దుర్మదుడగు రక్కసుని పలుకు లాలించి వల్లెయనెను. అంత వారిరువు లొండొరులతో గలియబడి యుద్ధముచేయసాగిరి. రక్కసుడు శ్రీహరిచూపు కౌశలమునకు బ్రతి కౌశలమును జూపుచుండెను. శ్రీహరి గరుడు నధిష్టించి యుద్ధము సలుప రక్కసుడును తన మాయాబలముచే గరుడుని నిర్మించి యా గరుడు నధిష్టించి యుద్ధము సలుపుచుండెను. ఈ వింతను దేవత లాకసమునుండి తిలకించుచుండిరి. శ్రీహరి యే రూపమును దాల్చినను అట్టి ప్రతిరూపమును రక్కసుడు దాల్చి శ్రీహరితో పోరుచుండెను. శ్రీహరి రక్కసుని వంచింపజాలియు రక్కసుని బొగడ దొడగెను. తుదకు శ్రీహరి రక్కసునితో ఓ రాక్షసాధమా ! నా చక్రముతో నీ శిరమును చెట్టునుండి పండమారిన పండును ద్రుంచునట్లు ద్రుంతుననెను. ఈ మాట లాలించి నంత రక్కసుడు నేలవ్రాలి ఓ చక్రపాణీ! నీ చక్ర చరితమును వినియుంటిని. నీ చక్ర మమోఘము. నీ చక్రముచే జచ్చినవారలు ముక్తిపదమును బొందుదురు. నీ చక్రము నా శిరమున్ద్రుంప నేను నీ మంధి

రమునకు బోవుదును. ఓ జగన్నాయకా! యీ పర్వతము నా పేరుతో వెలయుగాకయని శ్రీహరి పాదములను బట్టెను. శ్రీహరియు నట్లు కానిమ్మని రక్కసు ననుగ్రహించెను. కావున నీ పర్వతము కృతయుగమున వృషభాచలమని పేరువడసెను.

త్రేతాయుగమున కేసరియను రక్కసుడుండెను. అతని కుమార్తె యగు నంజనాదేవి సంతానమును బడయుటకై వ్రతము నుపదేశింప మతంగమహాముినిని గోరెను. ఆ మతంగుడు చెప్పినచొప్పున వేంకటాచలమునకుబోయి యాకాశగంగాతీరమున తపము సలిపెను. ఇట్లు తపము సలుపు నంజనాదేవికి వాయుదేవుడు దినదినము నొక్కఫలము నాహారముగ నిచ్చుచుండెను. ఒక్కనాడు వాయువు తన వీర్యగర్భితమగు ఫలము నంజనాదేవి కొసగెను. ఆ ఫలమునుదిని యంజనాదేవి గర్భము దాల్చెను. పదియవమాసము నిండినపిమ్మట నాంజనేయుని గనెను. ఈ పర్వతమందు అంజనాదేవి తపమాచరించి యాంజనేయుని గనుటచే నీ పర్వత మంజనాద్రియని త్రేతాయుగమున బేరువడసెను.

## శ్రీహరి క్రీడాద్రిని భూలోకమునకు దెప్పించుట

ఒకప్పుడు శ్రీహరి వైకుంఠద్వారమున నాదిశేషుని కాపుగడవెట్టి రమాదేవితో విలాసముగ నంతఃపురమున శయనించెను. శ్రీహరి యంతరంగమునెఱిగిన ఆదిశేషుడు ధర్మదండముచేతబట్టి సింహద్వారమున గాపుగడజేయుచుండెను. అంతలో నకారణముగ వాయుదేవుడు రమారమణుని జూడ నేతెంచెను. సింహద్వారమున గాపుగడజేయుచున్న ఆదిశేషుడు వాయువును లోనికిబోనీయక ధర్మదండముతో నడ్డగించెను. అంత వాయుదేవుడు తన కత్యంతావసరమగు కార్యముగలదు కనుక లోనికిబోవుదు ననెను. ఆదిశేషుడు తాను ప్రభునాజ్ఞచే సింహద్వారమున గాపుగడ జేయుచుంటిననియు వాయువును లోనికిచొరనీయననియు జెప్పెను. అంత వాయువు నాదిశేషునిజూచి పూర్వము మునుల శాపముచే ద్వారపాలకులగు జయవిజయులు రావణ కుంభకర్ణులుగ జనించిరనుట మరచితివా యనెను. వాయువు పలుకు లాలించి యాదిశేషు డతి కుపితుడై విషానల

మును గ్రక్కు బుస్సలుకొట్టుచు వాయువును జూచి పెద్దమాటలాడెదవు! ప్రాణములమీద యాశలుదీరెనా యనెను. కాలముమూడిన లోకులు మంచిచెడ్డల నరయజాలరనెను. జ్ఞాన బల వైరాగ్యములలో విష్ణుభక్తు లెవ్వరును తనకు సాటికాజాలరనెను. తనకు మహావిష్ణు వంతఃపుర ములో నివాసమనెను. లక్ష్మీనారాయణులు లోకహితమునకై తన్ను సింహద్వారమున గాపుగడబెట్టిరనెను. ఈ మదోద్ధతుని పలుకు లాలించి వాయువు నాతనితో నిట్లనెను. రాజప్రాసాదములందు పిల్లులు సంచరింప వచ్చును. కరికలభము నూరిబయట గట్టింపవచ్చును. కాని పిల్లులకు కరికలభముతో పోలికరాదు. రాజు పట్టాభిషేక సమయములలో నూరి బయటి కరికలభము నలంకరింతురు. కాని పిల్లులను దరిజేరనీయరు.

ఇవ్విధమున శేష వాయువు లొండొరులతో గలహించుచుండ నంతఃపురిలో రమాదేవి యాలకించి శ్రీహరితో జెప్పెను. శ్రీహరి లేచి వెలుపలికివచ్చి యలవనేల? వచ్చినవారెవరు? అని శేషునడిగెను. అంత శేషుడు శ్రీహరికి నమస్కరించి శ్రీహరితో నిట్లనెను. మలయాచల నివాసియగు వాయువు గర్విష్ఠుడై వచ్చి యకాలములో నంతఃపురమున జొరబడ నుద్యమించెను. నేనా వాయువును ధర్మదండముతో నడ్డగింప నవాచ్యముల నాడజొచ్చెను. ఓ ప్రభూ! చిత్తగింపుడనెను. అంత శ్రీహరి తన తలంపుల నింగితములతో నాదిశేషునకుజెప్పి ద్వారముచెంత కేతెంచెను. వాయువు శ్రీహరినిజూచి సాష్టాంగమునాచరించి వేదైక గోచరుడగు పురాణపురుషుని నుతించెను. అంత శ్రీహరి వాయువును జూచి మిక్కిలి గర్విష్ఠుడగు శేషునితో నీకు వాదముతగదనెను. వాయువు శ్రీహరి .వాగమృతముగ్రోలి తృప్తిజెందెను. ఆదిశేషుడు శ్రీహరి పలుకు లాలించి జ్ఞాన బల వైరాగ్యములలో తనకు దుల్యుడీ బ్రహ్మాండ మున లేదని వాదులాడజొచ్చెను. వాదులాడు శేషునిజూచి శ్రీహరి యిట్లు పలికెను. పౌరుషమునకు మాటలతో బనిలేదు. కార్యమును జూపవలెను. ఈ దేవతాబృంద సమక్షమున మీ బలాబలములను బరీ క్షింపుడు. ఈ వైకుంఠమునకు ఉత్తర దిగ్భాగమున మహామేరువు పుత్రుడు క్రీడాద్రియను నాతడు గలడు. ఓ శేషా! నీవా పర్వతమును నీ దేహముతో జుట్టుముట్టి బంధింపుము. వాయుదేవుడద్దానిని గదల్ప

నుద్యమించుమనెను. ఆదిశేషుడీ పలుకులను విని మిక్కిలి యుత్సాహముతో నిజదేహమును మఱింతలంతలుగబెంచి విషానలములను గ్రక్కుచు బుస్సలుగొట్టుచు నిజ శరీరముతో నా కొండను జుట్టుముట్టియుండెను. మహావేగముగల వాయువును కొండను గదల్ప నాహ్వానించెను. అంత వాయువు మహవేగముతోబోయి కొండను గదల్ప నుద్యమించెను. దేవతలాకాశమునుండి యీ వింతను జూచుచుండిరి. వాయువు కొండను గదల్ప కడుచాతుర్యము జూపెను. కాని శేషుడు చుట్టుముట్టిన పర్వత మించుకైన గదలక మెదలక యుండెను. వాయువు మఱింత యుత్సాహము జూపెను. శేషుడు నయితము మఱింత యుత్సాహముతో బ్రాణవాయువును బిగియబట్టి శరీరమును బెంచి కొండను గదలనీయక గట్టిపట్టుబట్టెను. శేష వాయువుల కివ్విధమున పట్టుచలపెరిగి పరిపక్వదశనొందెను. లోకములకెట్టి ముప్పు వాటిల్లునోయను నాహాకారము మిన్నుముట్టెను. బ్రహ్మాదిదేవతలు వాయువును విరమింపవేడిరి. వాయువు పర్వతమును గదల్పక మాననను పట్టుబట్టెను. పిమ్మట దేవత లాదిశేషుని విరమింప వేడిరి. అంత నాదిశేషుడు దేవతల ప్రార్థనల నాలించి శ్రీహరి తలంపులను దలచి పడగల నొకింత సడలించెను. ఇట్టి యదను గనిపెట్టి వాయువు తన సకల శక్తుల నొక్కుమ్మడి గుప్పించి పర్వతము నొక్కపెట్టున లేవనెత్తి విసరెను. దేవతలాకాసమునుండి లిలకించు చుండిరి. మహామేరువు తనముద్దు బిడ్డను గాపుమనియు నసదు బుత్రభిక్షము బెట్టుమనియు వాయువును వేడనారంభించెను. అంతలో నీ పర్వతము కదలి లక్షలాది యోజనములను దాటిపోయెను. మహామేరువు వేడికోలు నాలించి వాయువు శేషపర్వతమగు క్రీడాద్రిని తా నావహించి సువర్ణముఖరీ నదీ తీరమున నుత్తరపుదెస క్రోశమాత్ర దూరములో నిలువబెట్టెను. అంతలో దేవతలాకాసమునుండి వాయువును బొగడి యిందలి తత్త్వము నీ క్రింది విధమున తెలియజెప్పిరి.

ఈ పర్వతమీ శేషాంశమున బుట్టెను. శ్రీహరి తాను ధరామండలమునకు రానెంచి యీవ్యాజమునుబన్ని యీ కొండనిటకు దెప్పించెను. నీవు శేషునితో వాదులాడి యపరాధము జేసితివి. కావున నాదిశేషుని క్షమింప వేడుకొమ్మనిరి. దేవతల పలుకు లాలించి వాయువు నాగాధిరాజును వేడుకొని తన తప్పిదమును గావుమనెను. ఆదిశేషుడు వాయు

దేవు ననుగ్రహించెను. ఇవ్విధమున శేషాంశమున బుట్టినట్టియు, శేషునిచే జుట్టుముట్టబడి ధరామండలమునకు గొనిరాబడినట్టియు పర్వతము శేషాచలమను సార్థకనామమును ద్వాపరయుగమున బడసెను.

కలియుగమున వేంకటాచలమను పేరువడయుటకు గారణమును చదువరులు ముందు దెలియగలరు.

## లక్ష్మీనారాయణుల ప్రణయ కలహము

ఒకానొకప్పుడు శ్రీహరి రమాదేవితో వైకుంఠమునం దేకాంతముగ నుండెను. రమయు శ్రీహరినిజూచి ఓనాథా! జగన్నాథుండవగు నిన్ను ఒకవిప్రుడు తన్నెను. ఇంతియకాక నేను వసించు వక్షమున దన్నెను. ఇట్టి పరాభవమును నేను సహింపజాలను. నేనీ వైకుంఠమున నివసింప నోర్వను. నేనిదే కరవీర (కొల్హా) పురమునకు బోవుచుంటిని. అనుచు ప్రణయ కలహమునుజూపి దిగ్గునలేచి వైకుంఠమునుబాసి వెడలిపోయెను. అంతట శ్రీహరియు చింతాక్రాంతుడై ఒంటిమై నుండనేరక పూర్వము తాను పాతాళమున హిరణ్యాక్షుని బారినుండి కాపాడిన ధరాదేవిందలచి ద్వాపరాంతమున కలియుగము రానంత ప్రణయ కలహము తీరగల విధము నాలోచించుచు పరమానంద దాయకమగు వైకుంఠమువదలి లక్ష్మీదేవిని వెదకుచు బయలుదేరెను. భూమండలమున కరుగుదెంచి గంగానదికి దక్షిణమున మూడువందల యోజనముల పర్యంతము లక్ష్మిని దలపోయుచు సాగిపోవుచుండెను.

అట్లు పోయిపోయి సువర్ణముఖీ నదీతీరమును జేరెను. ఆ నదికి ఉత్తరమున నిలిచిఅప్రాకృతము నమేయముసర్వరత్నమయము హిరణ్మయము మహాశృంగము సకలోపనిషన్మయమునయినట్టియు, పున్నాగచంపకాశోక హింతాలములచే శోభిల్లునట్టియు, శ్రవణానందమును గలుగజేయు మధురాలాప సంభ్రమములుగల శుక కోకిల హంసాది పక్షి సంఘములచే విలసిల్లునట్టియు, పూలగుత్తులతోనిండి దివ్య పరిమళముల వెదజల్లు మల్లి జాజి విరజాజి మొదలగు లతాకుంజములచే పరీతమయినట్టియు, సింహ శార్దూల మాతంగ శరభ క్రోడ వానరములచే వ్యాకులమయినట్టియు, నృత్త

గీతములను సలుపు కిన్నర కిన్నరీ సంఘములచే భాసిల్లునట్టియు, లెక్కకు మిక్కుటమగు సెలయేళ్లచే నిండినట్టియు, మానసాహ్లాదకరమయినట్టియు, నిత్యముక్తులచే సేవింపబడునట్టియు నారాయణా (వెంకటా) ద్రిని జూచెను. ఈ వేంకటాద్రి మూడుయోజనములు వెడల్పును, ముప్పది యోజనముల నిడివియు గలిగి శేషాకారమున భాసిల్లుచుండెను. దివ్యాకారముగల యీ వేంకటాద్రి దశదిశలయందును పవిత్రములగు పుణ్యతీర్థములతో నిండి యుండెను.

శ్రీ స్వామి పుష్కరిణి మిక్కిలి మనోహరమయినది. ఇందలి జలము దివ్య పరిమళభూయిష్ఠము. ఈ పుష్కరిణీ జలమును స్మరించినను, దర్శించినను, స్పృశించినను సకల పాపములు పటాపంచలు కాగలవు. సకల సిద్ధులు జేకూరగలవు. స్నానపానములను జేయువారల యభీష్టము లీడేరగలవని వేరుగ జెప్పనేల? ఈ పుష్కరిణి గంగాది సకల తీర్థములకు బుట్టినిల్లు. విరజానదివలె సకల దోషములను బాపును. స్వర్ణస్తేయము, సురాపానము మొదలగు సకల పాపములను తొలగించును. ఇందు స్నానమును జేయువారల యైహికార్థములు సిద్ధించును. ఈ స్వామి పుష్కరిణీ మాహాత్మ్యమును జెప్ప నే దేవుండును శక్తుడుగాడు. ఈ పుష్కరిణీ సాన్నిధ్యమున నివసించు మనుజులు సయితము దేవతలకన్న భాగ్యశాలురు. అయ్యును, సామాన్య మానవులు ఈ వేంకటాచల మాహాత్మ్యమునుగాని, స్వామి పుష్కరిణీ మాహాత్యమునుగాని తెలియజాలరు. వారలు ఈ వేంకటాచలమును సామాన్య పర్వతముగ దలంతురు. వారి వారి భక్తికి తగిన ఫలసిద్ధిని బొందుదురు.

శ్లో. స్వామిపుష్కరిణీస్నానం సద్గురోః పాదసేవనమ్ ।
ఏకాదశీవ్రతంచాపి త్రయమత్యంత దుర్లభమ్ ॥
దుర్లభం మానుషంజన్మ దుర్లభం తత్రజీవనమ్ ।
స్వామిపుష్కరిణీస్నానం త్రయ మత్యంత దుర్లభమ్ ॥

వేయేల! నీ పుష్కరిణీ మాహాత్మ్యము నాదిశేషుడేని జెప్పజాలడు. ఈ పుష్కరిణీ స్నానము పలువిధములగు పాతకములను బోగొట్టుటయు ముందుముందు విశదముగ జదువరులకు దెలియనగును.

# స్వామి పుష్కరిణీ తీర్థము

పూర్వము చంద్రవంశమున బుట్టిన నందుడను మహారాజు చతుస్సాగరపర్యంతముగల భూమండలమును న్యాయముగ బాలించుచుండెను. నందునకు ధర్మగుప్తుడను పుత్త్రుడుదయించెను. ధర్మగుప్తుడు పెరిగి శస్త్రాస్త్రవిద్యలలో గుశలుడుకానంత నందుడు సుతుని పట్టాభిషిక్తునిజేసి కులసంప్రదాయమును బాటించి తపముజేయ తపోవనములకు జనెను. ధర్మగుప్తుడు నీతికుశలుడై రాజ్యమును బాలించుచుండెను. బహు యజ్ఞములను జేసెను; భూదానాది దానములను జేసెను. ఇతడు రాజ్యమును బాలించుచుండ సకల ప్రజలు ధర్మతత్పరులై యుండిరి. సకాలమున తగురీతిని వానలు గురియుచుండెడివి. కేదారములు సకల సస్యశ్యామలములై యుండెడివి. చోరాది భయము లెందును గానరాకుండెడివి; వినరాకుండెడివి. ఒకప్పుడీ ధర్మగుప్తుడు తురగారూఢుడై వేటాడబోయెను. తాడి గిలకతాడి ఉలిమిరి లేక చీకటిమ్రాను మొదలగు చెట్లతో నిండినట్టియు, సింహ వ్యాఘ్రాది జంతు సముదాయములతో భయానకమయినట్టియు, పద్మ కల్హార కుముద నీలోత్పలములతో నిండి కనులపండువుజేయు తటాకములు, తపోజనులచే భూషితమగు తటాక తీరములుగల వనమున వేటాడుచు విహరింప జొచ్చెను. ఇంతలో సూర్యుడస్తమింప ధర్మగుప్తుడొక తటాకము దరికేగి సంధ్యాది కాల్యకృత్యములను దీర్చుకొనెను. అంతలో దట్టమగు చీకటి నలుదిక్కుల నావరింప సింహ వ్యాఘ్రాదుల భయంకరారావములతో దిక్కులు పిక్కటిల్లసాగెను. ధర్మగుప్తుడు సింహ వ్యాఘ్రాదుల భీతిచే నొక్కవృక్షముచెంతకేగి దాని నధిష్ఠించెను. అంత నొక ఎలుగుగొడ్డు సింహము తఱుముచుండ పరువెత్తుచువచ్చి ధర్మనందను డధిష్ఠించినచెట్టు నెక్కెను. చెట్టుకొమ్మపై యాసీనుడై యున్న రాజునుజూచి భయపడవలదనియు, ఒకరికి నొకరు తోడుగ నా చెట్టుపై రేయి నివసింతమనియు జెప్పెను. రాత్రిలో తొలి యర్థభాగము ధర్మగుప్తుని నిదురింపుమనెను. తాను ధర్మగుప్తుని గాపాడుదుననెను. రాత్రిలో తుది యర్థభాగము తాను నిదురింతుననియు, ధర్మగుప్తుని గాపాడుమనియు జెప్పెను. ఎలుగుజెప్పిన పలుకులాలించి ధర్మగుప్తుడు మిక్కిలి సంతసించి చెటుకొమ్మపై గూర్చుండి

యున్న ఎలుగు తొడమీద శిరమునువాల్చి నిదురించెను. అంతలో ఎలుగును వెంటాడుచువచ్చిన సింహమేతెంచి నిదురించు రాజును తన కాహారముగ నిమ్మని ఎలుగును బ్రతిమాలెను. ఎలుగు సింహముపలుకు లాలించి సింహముతో గ్రిందివిధమున జెప్పెను. విశ్వాస ఘాతుకులకు లోకములో మిక్కిలి కష్టములు ప్రాప్తించును. పదివేల యజ్ఞముల నాచరించినను విశ్వాసఘాతుకుల పాప మంతరింపనేరదు. బ్రహ్మహత్యాది పాతకముల కేని యంతము కలదు. కావున నేను ధర్మగుప్తుని గ్రిందికి బడద్రోయ జాలను పొమ్మనెను. అంతలో నర్ధరాత్రమగుటచే ధర్మగుప్తుడు మేల్కాంచెను. ఎలుగు ధర్మగుప్తుని తొడపై వ్రాలి నిదురింపసాగెను. సింహము ముందువలె ఎలుగును తన కాహారముగనిమ్మని ధర్మగుప్తుని వేడెను. సింహముకోరినరీతి ధర్మగుప్తుడు ఎలుగును తన తొడనుండి క్రిందికి బడ ద్రోసెను. దైవవశమున నా ఎలుగు కొమ్మలమధ్య జిక్కుకొనెను. ఇవ్విధమున మృత్యుముఖమునుదాటి ఎలుగు ధర్మగుప్తునితో నిట్లనెను. ఓ రాజా ! నేను భృగువంశమున బుట్టితిని. లోకులు నన్ను ధ్యానకాష్ఠుడందురు. నేను కామరూపుడనై ఎలుగురూపమును ధరించితిని. నిరపరాధినగు నన్ను నీవేల క్రిందికి బడద్రోసితివి ? ఈ పాపమునకు నీవు నా శాపమున బిచ్చివాడవై తిరుగుదువనెను. ఇట్లు ధర్మగుప్తుని శపించి సింహముతో నిట్లనెను.

ఓ సింహమా ! నీవు పూర్వము కుబేరుని మంత్రివి. నీపేరు భద్రుడు. ఒకప్పుడు నీవు వధూజనముతో హిమవత్పర్వమునకేగి గౌతముని యాశ్రమముచెంత దిరుగుచుంటివి. గౌతముడు సమిధలకై బయలువెడలి వస్త్రాచ్ఛాదనములేని నిన్నుజూచి కోపించి నీకు సింహరూపము ప్రాప్తించునట్లు శపించెను. కుబేరుడు ధర్మశీలుడు. అతని భృత్యులును ధర్మశీలురు. తపస్వినగు నన్ను నీవేల హింసించెదవు ? అనెను. ఎలుగురూపముతోనున్న ధ్యానకాష్ఠుని పలుకు లాలించునంత సింహము యక్షుడుగా మాఱెను. కుబేర సచివుడగు నా యక్షుడు ధ్యానకాష్ఠునకు నమస్కరించి యతనితో నిట్లనెను. ఓ మునిపుంగవా ! యిపుడు నాకు స్మృతి కలిగినది. గౌతమమహాముని నన్ను శపించి కాష్ఠమునితో నాకు సంవాదము జరుగునంత శాపము దీరుననియు జెప్పెను. ఓ మహాత్మా ! కామ

రూపుడవగు ధ్యానకాష్ఠునిగా నిన్ను గుర్తించితిని. అనుజ్ఞనిమ్మని వేడి విమానారూఢుండై యలకాపురికి బోయెను.

ధర్మగుప్తుడు మతిభ్రంశమునొంది దేశములను దిరుగుచుండెను. ఒకప్పుడు ధర్మగుప్తుని మంత్రు లతని జాడలను గనుగొని రేవానదీ తీరమున తపమాచరించుచున్న నందునకు దెలిపిరి. నందుడు తన సుతుని వృత్తాంతమరసి మిక్కిలి చింతించెను. పుత్త్రుని తోడుకొని జైమిని మహాముని చెంతకేగి ధర్మగుప్తుని యున్మాదమును బాప వేడెను. జైమిని మహాముని జ్ఞానదృష్టితో నొకింత యోచించి ధర్మగుప్తునకు ధ్యానకాష్ఠుని శాపముచే మతిభ్రంశము సంభవించెననియు, యీ మతిభ్రంశము తొలగు నుపాయము నాలకింపుమనియు నిట్లు చెప్పదొడగెను.

సువర్ణముఖరీనదీ తీరమందు సకల పాపహరమగు వేంకటాచలము గలదు. ఆ వేంకటాచలమందు స్వామి పుష్కరిణియను తీర్థమొండు గలదు. ఈ స్వామి పుష్కరిణి పావన తీర్థములలో మిక్కిలి శుభప్రదము మహత్తరము, శ్రుతి ప్రసిద్ధమునగు నీ తీర్థము బ్రహ్మహత్యాది సకల పాపముల నపహరించును. నీ పుత్త్రుడగు ధర్మగుప్తుని తోడుకొని చని స్వామి పుష్కరిణిలో స్నానమును జేయింపుము. దాన ధర్మగుప్తు డున్మాద విముక్తుడు కాగలడనెను. నందుడు జైమిని మహామునికి నమస్కరించి పుత్త్రుని తోడుకొని శ్రీ వేంకటాచలమునకు బోయెను. వేంకటాచలమందలి స్వామిపుష్కరిణిలో బుత్త్రుని స్నానము చేయించెను. స్వామి పుష్కరిణిలో మునిగి లేచునంత ధర్మగుప్త డున్మాదవిముక్తుడాయెను. నందుడు సయితము స్వామి పుష్కరిణిలో మునిగి శ్రీ వేంకటేశుని సేవించి తపోవనములకు బోయెను. ధర్మగుప్తుడు మంత్రులతో శ్రీ వేంకటేశ్వర స్వామిని పరమభక్తితో సేవించి యగ్రహారాది బహుద్రవ్యముల నొసగెను. విప్రులకు ధనధాన్య క్షేత్రాదుల నొసగెను. పిమ్మట మంత్రులతో నిజ నగరమునకుబోయి చిరకాలము నిష్కంటకమగు రాజ్యమును న్యాయసమ్మతముగ బాలించెను.

స్వామి పుష్కరిణిలో మునిగిన నున్మాదము, అపస్మారము, దుష్ట గ్రహావేశము మున్నగు సకల బాధలు నశించును. ఇట్టి స్వామిపుష్కరిణీ తీర్థమును వదలి తీర్థాంతరములకుబోవువారలు గోక్షీరమును వదలి చెముడు

పాల నాశించువారలగుదురు. స్వామి పుష్కరిణీ తీర్థమనుచు ముమ్మాఱు పఠించుచు నే తీర్థమున మునిగినను స్వామితీర్థములో మునిగిన ఫలము సిద్ధించును. ఈ ధర్మగుప్తుని చరితము వినుటచే బ్రహ్మహత్యాది సకల పాపములు నశించును.

## శంఖణుడు

పూర్వము చంద్రవంశజుడగు శంఖణుడు పితృపరంపరాగతమగు కాంభోజ దేశమును బాలించుచుండెను. ఒకప్పుడు దురదృష్టవశమున సామంతరాజులు శంఖణుని రాజ్యభ్రష్టుం గావించి రాజ్యము నపహరించిరి. భార్యాసమేతుడగు శంఖణుడు దుఃఖాక్రాంతుడై రాజ్యమును విడచి బయలు దేరిదక్షిణదేశములకుబోయి రామసేతువునుజూచిఅందుస్నానమునుజేసెను. అంతట కొంత పశ్చిమదిశ కరుదెంచి మెల్లమెల్లన స్వర్ణ ముఖీ తీర మును జేరెను. అందు స్నానమునుజేసి స్వర్ణముఖీనదికి నుత్తరతీరమున పద్మసరోవరమును జూచెను. పద్మసరోవరమున నిత్యము స్నానమాచ రించుచు దుఃఖాక్రాంతుడై నివసించుచుండెను. ఒకనాడు రాజ్యభ్రష్టుడ నైతిని; వనమున నివసించుచుంటిని; ప్రభుత్వము చేయిజాఱెను. పార తంత్ర్యము మరణమునకన్న మిక్కిలి దుఃఖావహము. జీవనమెట్లు చేయు దును? ఎందుబోవుదును? ఏమి గతియని విలపించుచు నిదురించెను. అంత నాకాశవాణి "ఓ మహాబాహో! దుఃఖింపకుము. ధైర్యము నవలంబించుము. ఇట కుత్తరమున క్రోశదూరమున వేంకటాచలమను పర్వతమొండుగలదు. ఆ పర్వతము ఆపన్నులకు కామధేనువు. శోకార్తులకు కల్పవృక్షము. ఆర్తులపాలిటి చింతామణివలె శ్రీవేంకటేశ్వరు డందుగలడు. అతడు నిర్హే తుక దయాపూర్ణుడు. ఆశ్రితులకు సకలేష్టముల నిచ్చును. ఆ పర్వత మందు విచ్చినతామరపూవులతో విలసిల్లుసరోవరమొండుకలదు. లే;లెమ్ము!! అందుబోయి నివసింపుము. త్రికాలములయందును స్వామి పుష్కరిణిలో మునుగుచు అందున్న వేంకటేశుని నిశ్చలమతివై భావించి భజింపుము. శ్రద్ధాభక్తులతోగూడి ఆరుమాసములు సేవింప నీకు రాజ్యప్రాప్తి కలుగును. ఇది సత్యము. నమ్ముము" అనెను. అంతట శంఖణుడు మేల్కాంచి విగతశోకుడై ప్రసన్నచిత్తుడై చంపకాశోక పున్నాగ చూత చందనాగరు

హింతాల రక్తచందనములచే భాసిల్లునట్టియు, చమరీకస్తూరీమున్నగు మృగములచే సంకులమయినట్టియు, శుక కోకిల మయూరముల మధురస్వనములచే మనోహరమయినట్టియు, మేరువునుబోలు వేంకటాచలము నధిష్ఠించెను. శ్రీ వేంకటాచలమున దిరుగుచు స్వామి పుష్కరిణికై వెదకివెదకి తుదకొక్కచో రమ్యములగు ఉపవనములచే భాసిల్లునట్టియు, పూచిన సంపెంగ మొగలి తెల్లగన్నేరు ఎఱ్ఱగన్నేరు పూలగురివెంద పొన్న సురపొన్న పొట్లి జామి కంకేళి ఉసిరిక మామిడి గిలకతాడి మఱ్ఱి చందనము మొదలగు తీరమందలి నానావృక్షములచే విరాజిల్లునట్టియు, మత్స్య కచ్ఛపములచే ముచ్చటగొలుపునట్టి పుష్కరిణింజూచి పరమానందభరితుడై యా తీరమందొక గుడిసెను నిర్మించుకొని నివసించుచుండెను. త్రిషవణస్నానముల నాచరించుచు, నియతాహారుడై శ్రీవేంకటేశుని సేవింపుచు నారుమాసములు గడపెను. అంత నొకనాడు స్వామి పుష్కరిణీ మధ్యము నుండి యనేక సూర్యసంకాశమగు దివ్యకాంతితో దశదిశలను భాసింపజేయుచు దివ్య విమానమొక్కటి యావిర్భవించెను. విమానమధ్యంబున శంఖ చక్ర గదా పాణియగు లక్ష్మీపతి సుఖాసీనుడై యుండెను. సిద్ధ సాధ్య విద్యాధర గంధర్వ కిన్నర కింపురుషులతో బ్రహ్మాది సకల దేవతలును, అష్టదిక్పాలకులును, సప్తర్షులును, ఏకాదశ రుద్రులు నేతెంచిరి. ఆకసమున భేరీమురజవాద్యములు మ్రోగెను. దేవతలు నృత్త గీతములను జేసిరి. శ్రీ వేంకటేశుని వేదమంత్రములచే బొగడిరి. శంఖణుడు సంభ్రమముతో లేచి సాష్టాంగముగ బ్రణమిల్లి దేవదేవుని స్తుతించి "ఓ దేవదేవ! ఓ జగన్నాథ! ఓ జగద్రక్షణ తత్పర! నీ యనుగ్రహమున బడసిన వంశక్రమాగతమగు ప్రాజాపత్యము తుదముట్టెను. సామంతరాజులు నన్ను రాజ్యభ్రష్టుంజేసి నా రాజ్యము నపహరించిరి. నేను వ్రతశీలముల నెఱుగను. జప నియమముల నెఱుగను. భాగ్యవశమున నిన్నుం జూడగలిగితిని. నీ దర్శనము నిష్ఫలముకాదు. ఓ దయాసముద్రా! నన్ను గావుము." అని విన్నవించెను. శ్రీ వేంకటేశ్వరుడాతని మొఱనాలకించి "దుఃఖింపకుము. స్వామి పుష్కరిణియందలి నీ భక్తిచే నీ రాజ్యము నీకు మరల బ్రాప్తించెను. ఎవ్వరేని స్వామిపుష్కరిణిలో భక్తితో మునుగ నిష్టార్థములను బడయుదురు. ఓ మహీపాల! నీవు పొమ్ము. నిష్కంటకముగ నీ రాజ్యము నేలుము." అని పలుకుచు శ్రీ వేంకటేశ్వరు డంతర్ధానము

నొందెను. సకల తీర్థములకును స్వామినియగుటచే నీ పుష్కరిణి స్వామి పుష్కరిణి యనబడుచున్నది. అట్టి పుష్కరిణిలో మునుగుటచే శంఖణు నకు నేడు భగవానుడు స్వామిత్వప్రాప్తి నొసగెను. కావున నాటినుండియు నీ పుష్కరిణి స్వామి పుష్కరిణి యను సార్థకనామమునుబొందెను.

అంతట శంఖణమహారాజు భార్యాసమేతుడై వేంకటాచలమును దిగి నిజదేశమునకు బోయెను. ఇంతలో కాంభోజదేశపు సామంతరాజు లొక్క రొక్కరును రాజ్యకాంక్షులయి ఒండొరులతో పోరాటమునలుప నారంభిం చిరి. ఆ పోరాటములో గొందఱు నశించిరి. మఱిగొందఱు తమకీ రాజ్యము వలదని నిశ్చయించి, శంఖణ మహారాజు వచ్చుచుండెనని విని ప్రజా సమే తులై శంఖణునకు ఎదురేగి గోదావరీ తీరమున శంఖణునిజూచి వృత్తము దెలిపి శంఖణుని దోడ్కొని చని సింహాసనాధిష్ఠితుంజేసిరి. శంఖణుడు ఆచంద్రార్కము న్యాయసమ్మతముగ రాజ్యమును బాలించెను.

# కుమారధారా మాహాత్మ్యము.

పాపనాశమునకు వాయవ్యదిగ్భాగమున కుమారధారయను తీర్థము గలదు. పూర్వము ద్విజోత్తముడొకడు వేంకటాచలమున తపమాచ రించుచుండెను. కొంతకాలమునకావిప్రుడు మిక్కిలి వృద్ధుడాయెను. శరీర మంతయు సంధిబంధములు సడలి శిథిలప్రాయములాయెను. దృష్టిపాటవ మును సన్నగిల్లెను. కౌండిన్యుడను శిష్యునితో నీ శతవృద్ధుం డొకనాడు నిత్యనైమిత్తికముల కందందు దిరుగుచు మార్గభ్రష్టుడై "ఓ కౌండిన్యా! శత వృద్ధుని నన్ను విడచి ఎందుబోయితివి" అనుచు, మాటిమాటికి బిలచుచు గొంతుక పెదవులు తడియాఱునట్లఱచుచుండెను. అప్పట్టున శ్రీ వేంకటే శ్వరస్వామి విశాలమగు కన్నులు, కోమలము మనోహరమునగు దేహము గల కుమారాకారముతో వేంకటాచలమున సంచరించుచు నచట కేతెంచెను. శ్రీ వేంకటేశ్వరుడీ వృద్ధుంజూచి "ఇందు మానవ సంచారమే లేదు. కౌండిన్యుడెందుకలడు" అనెను. అంత నా శతవృద్ధుడు "దూరమందున్న నాయాశ్రమమున కెట్లుపోవుదును? శౌచాచారాదులను జేయజాలని శతవృద్ధు డను; రిక్తుడను; బంధు వివర్జితుడను. విధి నన్నింకను జీవింపజేయనేల" అనుచు నణగ నారంభించెను. ఇట్టి శతవృద్ధుంజూచి శ్రీ వేంకటేశ్వరుడు

"ఓ విప్రోత్తమా ! నీ శరీరమంతయు పండబారెను. వడలి సడలెను. చర్మము వ్రేలాడజొచ్చెను. కనురెప్పలు దిగజారెను. చూపు సన్నగిల్లెను. నీవింక జీవింప నాశింతువే" అని పరిహాసించుచు బల్కెను. అంత నా వృద్ధుడు తనకు జీవింపనాశలేదనియు నిత్యనైమిత్తికాదులను జ్యోతిష్టోమా దులనుజేసి దేవఋణమును దీర్చక యీ తనువునెట్లు విడుతునను విచారము మాత్రము కలదనియు బల్కెను. శ్రీ వేంకటేశ్వరుడు యుక్తియుక్తము లగు నాతని పలుకులనువిని తనచేయినిజాచి కరావలంబమునిచ్చి తనవెంట రమ్మని తోడ్కొనిపోయెను. కొంతదూరముపోయి కుమారధారను జూపి స్నానమునుజేయుము నీయాశ్రమమునకుబోవుదమనెను. అంత నావృద్ధుడు కుమారధారలో మునుగ పదునారు వత్సరములు ప్రాయముగల కుమారు డుగ మారెను. ఆకసమునుండి చూచు సకల దేవతలును విస్మితులైరి. పూలవర్షములను గురిపించిరి. దేవదుందుభులను మ్రోయించిరి. శ్రీవేంక టేశ్వరుని బొగడిరి. శ్రీవేంకటేశ్వరుడు ఆ విప్రకుమారునకు కర్మాను ష్ఠానమునకు వలయు సకలైశ్వర్యములనొసగి యంతర్ధానము నొందెను. శతవృద్ధుడు స్నానముజేసినంత కౌమారమును గలుగజేయుటచే నీ తీర్థము కుమారధారయని సార్థకనామముతో విఖ్యాతిని గాంచెను. ఈ తీర్థ మందు మూడుమాసములు ముమ్మాఱు స్నానమాచరించు శతవృద్ధులును వజ్రదేహులగుదురు. మఱియు నిహలోకమున సకల సుఖముల నను భవించి పరమున పరమపదమును జేరుదురు.

## కపిల తీర్థము

పూర్వమొకానొకప్పుడు చతుర్ముఖుడు వేంకటాచలమున నివసించు చున్న శ్రీవేంకటేశ్వరస్వామికి ఉత్సవమునుజేయ సమకట్టెను. ఈ మహో త్సవమునకు సకల దేవతలును విచ్చేసిరి. అవబృధస్నానముతో బ్రహ్మో త్సవము పూర్తికానంత బ్రహ్మాదిదేవతలు తమతమ నెలవులకు బోవుటకు శ్రీ వేంకటేశ్వరస్వామి యనుజ్ఞను వేడిరి. అంత శ్రీ వేంకటేశ్వరస్వామి తగురీతిని వారినాదరించి వీడ్కొలిపెను. బ్రహ్మాదులు తమతమ వాహన ములగు హంసాదుల నధిష్ఠించి తమతమ నివాసములకు జనిరి. పార్వతీ నాధు డివ్విధమున బయలుదేరి వేంకటాచలమునకు ప్రదక్షిణము సలుపుచు

వేంకటాద్రికి ఆగ్నేయ దిగ్భాగమునందు శుభప్రదమగు కపిలతీర్థమును గాంచెను. ఉమాసహితుడై యందు నివసింపనెంచి నివసించుచుండెను.

## ఫల్గునీ తీర్థము

సనకసనందనాదులు పాపనాశన తీరమందలి వనములలో నివసించుచుండిరి. పాపనాశనమున కీశాన్యదిక్కునందు ఈ ఫల్గునీ తీర్థము బాలుచుండును. ఈ ఫల్గునీతీర్థ తీరమందు సప్తఋషులు నివసించుచుండిరి. ఈ ఫల్గునీతీర్థ తీరమందు నివసించుచు తపమాచరించుచున్న అరుంధతీదేవి ననుగ్రహింప లక్ష్మీదేవి ఫాల్గుణ శుద్ధ పౌర్ణమినాడు ఆవిర్భవించెను. అరుంధతీదేవి ప్రార్థింప నీ తీర్థమునకు ఫల్గునీతీర్థమును నామధేయము నను గ్రహించెను. ఇంతియకాక ఫల్గునీనక్షత్ర యుక్త ఫాల్గుణ శుద్ధ పౌర్ణమినాడు ఇందు స్నానమును జేయువారల సకలాభీష్టములను దీర్చెదననియు, వారింట తాను నివసింతుననియు వరములనిచ్చి యంతర్ధానము నొందెను.

## జాబాలి తీర్థము

అరుంధతీదేవికి లక్ష్మీదేవి సాక్షాత్కరించి వరములనొసగిన మహాద్భుతమును దేవతలు గగనతలమునుండి చూచిరి. శ్రీవేంకటేశ్వరస్వామిని సేవింపదలచి స్వామి తీర్థమునకుత్తరమున బ్రవహించు దేవనదికి నుత్తర తీరమున నివాసముల నేర్పఱచుకొని సుఖముగ నివసింప మొదలిడిరి. అగస్త్యుడు పూలతోట నొకదానిని నిర్మించుకొని అందుపూయు నానావిధములగు పూలతో శ్రీ వేంకటేశ్వరస్వామిని నిత్యము సేవించుచు శిష్యవర్గముతో నివసింప నారంభించెను. ఇట్లు స్థిరనివాసముల నేర్పఱచుకొని కొందఱు శ్రీ వేంకటేశ్వరుని నిత్యము సేవించుచుండిరి. మఱికొందరు పర్వత పరిసర ప్రాంతములందు నివసించుచుండిరి. మఱికొందరు మరల రాగలమని తమతమ నివాసములకు జనిరి.

ఇట్టి వేంకటాచలమందు శ్రీవేంకటేశ్వరస్వామి కృతాది యుగములలో దేవతలును, ధనవంతులగు భూపాలురును తనకుజేయు పరమాద్భుతములగు నిత్యోత్సవములతో పూజితుడగుచు అర్థి జనముల యభీష్టములను

దీర్చుచు నెలకొనియుండెను. జాబాలి మహర్షియు శ్రీవేంకటేశ్వరస్వామి యాలయమునకు బశ్చిమోత్తర దిగ్భాగమున (లేకసరస్సునకు, దేవనదికి ఉత్తరమున) పశ్చిమ తీరమందు నివసింప నారంభించెను. ఇతడు నివసింప మొదలిడిన తీరమందలి తీర్థమునకు జాబాలి తీర్థమని పేరు. ఈతీర్థము యొక్క మహాత్మ్య మెవ్వరికిని జెప్పదరముగాదు. ఇందు మునిగినంత నుహా పాతకములు సయితము పటాపంచలు కాగలవు.

పూర్వముకావేరీతీరమందొక విప్రుడు కాపురము చేయుచుండెను. ఆ కావేరీతీరమందు బ్రహ్మహత్య, సురాపానము, స్వర్ణస్తేయము, గురుదారాభిగమనము మొదలగు మహాపాతకములనుజేయు పాపులును, మఱిగొందఱు నివసించుచుండిరి. అట్టి మహాపాపుల సంపర్క వశమున నీ విప్రుడు దురాచార రతుడై కొంతకాలమునకు దురాచారుడను సార్థకనామమును బడ నెను. ఈ దురాచారుడను విప్రుడు కాలక్రమమున పిశాచగ్రస్తుడై దేశదేశములను దిరుగుచుండెను. పూర్వపుణ్య పరిపాక వశమున ఈ దురాచారుని బట్టిన పిశాచము ఈ విప్రుని మిక్కిలి పావనమగు వేంకటాచలమునకు గొనివచ్చెను; జాబాలి తీర్థమున ముంచెను. మహా పావనమగు జాబాలితీర్థమున మునిగిలేచిన విప్రుడుపిశాచ విముక్తుడాయెను; మహాపాతకములితనిని స్పృశింపవెఱచి తొలగిపోయెను. అంత నీ విప్రుడు స్వస్థచిత్తుడై కావేరితీరమునుండి నేనిట కెందుల కేతెంచితినని చింతింపమొదలిడి అంతుపొంతుల నెఱుగజాలక ఆ తీరమందు తపమాచరించు భూసురోత్తముడగు జాబాలి మహర్షిని తెలుపవేడెను. అంత జాబాలిమహర్షి ముహూర్తమాత్రమున విప్రుని చరితమును దివ్యదృష్టి నాలోచించి మహాపాతకముల సంపర్కముచే నీవిప్రుడు పిశాచగ్రస్తుడాయెననియు, అందున మతిభ్రమింప దేశాటనము సలుపుచు పూర్వపుణ్యవశమున నిటకేతెంచెననియు, జాబాలి తీర్థ స్నానమహిమచే మహాపాతకములు పిశాచముతోబాటు వైదొలగెననియు దెలిపెను.

## సనక సనందన తీర్థము

ముక్తినిగోరువారలు అష్టాంగ యోగము నారంభింపవలయును. ఈ యోగము నాచరించు వారలు వజ్రతుల్య దేహులై కాలమృత్యువును

దాటి ఆచంద్రతారార్కము జీవింతురు. కాని 'శ్రేయాంసి బహువిఘ్నాని' అనికదా పెద్దల నానుడి. ఇట్టి యోగము నాచరించి మృత్యువును జయింప గోరువారలకు బహువిఘ్నములు సంభవించుటయు సహజము. ఈ యోగమును నిర్విఘ్నముగ సాధించుటకు వేంకటాచలమందు పుణ్యమగు సనకసనందన తీర్థమొండుకలదు. ఇది పాపనాశనమున కుత్తరమున అర్ధక్రోశ దూరమున గలదు. సిద్ధులెల్లప్పుడును దీనిని సేవించుచుందురు. మార్గశిర శుద్ధ ద్వాదశినాడరుణోదయ కాలమున శ్రీస్వామిపుష్కరిణిలో మునిగి నియత మనస్కుడై త్రయోదశి ఘడియలలో సనకసనందన తీర్థమందు స్నానముజేసి పదివేలు శ్రీవేంకటేశాష్టాక్షరిని జపించి యోగము నుపక్రమింప యోగసిద్ధుడు కాగలడు.

## కాయరసాయన తీర్థము

సనకసనందనతీర్థ సమీపమున కాయరసాయనమను తీర్థముకలదు. ఈతీర్థమును త్రాగువారల దేహము పటిష్ఠము, పరిశుద్ధముకాగలదు. ఇందలి మాహాత్మ్యమును జూడగోరువార లెవ్వరేని పండమారిన యాకును ఇందు బడవైచిన క్షణకాలములో నా పండమారిన యాకు పసిరిరంగుతో నిగనిగలాడుచు మాఱును. సాధారణ జనులకీ తీర్థము కానరాకుండునట్లు సనకసనందనాదియోగు లిద్దానిని శిలచే గప్పిపుచ్చిరి. పుణ్యశాలుర కీతీర్థము గోచరించును. ముక్తినిగోరువార లేయుపాయముచేనైనను దేహపాటవమును సంపాదించి శ్రీవేంకటేశ్వరుని సేవింపవలయును. శ్రీవేంకటేశ్వరుడు సకల జీవులకును స్వస్వరూపుడై యుండును. కావున నాతని కైంకర్యము నాచరింపని జీవుడు ఆత్మద్రోహి యనబడును. కావున మనకుగల ధన ధాన్య గృహ క్షేత్రాదులను శ్రీ వేంకటేశ్వరస్వామి యధీనముచేసి ఈ సకల జగములు వినశ్వరములని నమ్మి శ్రీవేంకటేశ్వరుని చిత్తమందు సేవించుచుండవలయును. ధర్మాధర్మములను విచారించుచుండ వలయును. గురుశుశ్రూషలను సలుపవలయును. గృహస్థులు తమతమ దారలయందే రతులై యుండవలయును. యోగులు విజితేంద్రియులు కావలయును. సాధువుల నడిగి తమతమ హితములను దెలియవలయును. వేదార్థములను విచారింపవలయును. వేదాంతముల నభ్యసింపవలయును. వేయేల నిషిద్ధముల

నాచరింపరాదు అని పూర్వము వరాహస్వామి ధరణీదేవికి దెలియ జెప్పెను.

## తుంబురు తీర్థము

ఉత్తరఫల్గున నక్షత్రయుక్త ఫాల్గున శుద్ధపౌర్ణమినాడిందు స్నానము జేయువారలు మరల గర్భనరకము ననుభవింపరు. అనగా పునర్జన్మ రహితమగు శాశ్వత బ్రహ్మలోక వాసప్రాప్తిని బొందుదురు.

పూర్వము తుంబురుడను గంధర్వుడు ఈ తీర్థమందు స్నానము నాచరించుచు, భక్తవత్సలుడగు శ్రీవేంకటేశ్వరుని గొలుచుచు పునరావృత్తి రహితమగు వైకుంఠమును బొందెను. ఇతడొకప్పుడు మాఘస్నానములను జేయుచు పతివ్రతా తిలకమగు తన భార్యను తనకన్నముందు తెల్లవారుఝామున సర్వపాపహరమగు నీ తీర్థములో స్నానము నాచరింప నాజ్ఞాపించెను. తాను స్నానమునుజేసి దేవతా పూజను గావించుటకు గోమయముతో పూజచేయదగిన తావును పరిశుద్ధముచేసి పద్మ స్వస్తికాదులతో రంగవల్లిని గానింప నియమించెను. వత్తితో భగవత్ప్రీతికై దీపారాధనమును జేయుమనెను. శుచిర్భూతురాలవై పరమేశ్వరునికి నివేదింప రుచిగల వంటలను సిద్ధముచేయుమనెను. తనతోబాటు ప్రదక్షిణ నమస్కారములను జేయుచు భక్తితో దేవదేవుని కైంకర్యమును సాగింపుమనెను. శ్రీహరి చరితములను శ్రద్ధతో వినుమనెను. కృష్ణా! ముకుందా! విష్ణో! నారాయణ! జనార్దన! అచ్యుత! అనంత! యనుచు నిత్యము పరమాత్మను దలచుచు కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యములను వీడి మాఘవ్రతమును నియమ నిష్ఠలతో గావింపుమనెను. గంధర్వసతీమణి గంధర్వుని పలుకు లాలించి మిక్కిలి కోపముతో ఈచలికాలములో తెల్లవారుఝామున లేచి తాను స్నానమును చేయజాలననెను. ఇంతియకాక జలుబుచేసి రోగముతో చాపుపూడిన దిక్కెవ్వరనెను. ఇవ్విధముగ నప్రియమును బలుకు సతీమణినిజూచి గంధర్వుడొకింత యోచించెను. ధర్మవిముఖుడగు పుత్త్రుని, అప్రియమును బలుకు భార్యను, బ్రాహ్మణభక్తిలేని నృపాలుని శాపముతో దండింప వలయునని నిశ్చయించెను. శ్రీవేంకటాచలమందలి ఘోణతీర్థ

మునకు సమీపమునగల పిప్పల వృక్షముయొక్క తొఱటలో కప్పగా పడి యుండుమని తన భార్యను శపించెను.

అంత గంధర్వపత్నియు మిక్కిలి దుఃఖించి పతిపాదముల్లపైబడి శాపమును మఱలింపవేడెను. అంత తుంబురుడు భార్యననుగ్రహించి "కప్పరూపముతో నీవు కాలము గడుపుచుండుము. కొంతకాలమున కగస్త్యుడు శిష్యులతో నేతెంచి ఘోణతీర్థములో మునిగి ఘోణతీర్థమాహాత్మ్యమును తన శిష్యులకు వెల్లడించును. నీవు పిప్పల వృక్షముయొక్క తొఱటతోనుండి యగస్త్యుడు శిష్యులకు వివరించు ఘోణతీర్థ ప్రభావమును విని శాప విముక్తురాలవు కాగలవు" అనెను.

కొంతకాలమున కగస్త్యుడు శిష్యులతో నేతెంచి ఘోణతీర్థము సకల పాపహరమనియు, సర్వసంపత్ప్రదమనియు శిష్యుల కెఱిగించెను. దానిని విని గంధర్వ సతీమణి శాపవిముక్తురాలాయెను. అగస్త్యునకు మ్రొక్కి తనపూర్వ వృత్తాంతమును విన్నవించెను. అగస్త్యుడామెకు బతివ్రతా ధర్మములను జెప్పి,

"పతిరాత్మా పతిర్విష్ణుః పతిద్బ్రహ్మా పతిశ్శివః ।
పతిర్గురుః పతిస్తీర్థ మితిస్త్రీణాం విదుర్బుధాః ॥

అనుచు పతివ్రతాధర్మసారమును బోధించెను. పైజెప్పిన తీర్థములో తుంబురుడు మాఘస్నానవిధి నాచరించి పరమేశ్వరుని గొలిచి ముక్తిని బొందెను. కావున నీతీర్థము తుంబురుతీర్థమనబడును.

## ఘోణ తీర్థము

దీనిని తుంబురుతీర్థముకన్నను మిక్కిలి పావనమని మునిపుంగవులు వర్ణింతురు. ఉద్యానవనములను భగ్నము గావించువారల పాతకమిందు స్నానమాచరింప నశించును. కన్యా విక్రయపాపము నశించును. దేవుని యాస్తి నపహరించుట వలనను, యిచ్చిపుచ్చుకొను దానివలనను గలుగు పాతకములిందు మునుగుటచే నశించును. చెఱువులగట్టును దెగగొట్టుట వలనను, పరస్త్రీ సంగమాసక్తి వలనను గలుగు దోషము లిందలి స్నానముచే మటుమాయమగును. ఇచ్చెదనని వాగ్దానముజేసి ఈయకుండుట

వలన గలిగిన దోషమంతరించును. సురాపానము, గురు విప్రద్వేషము, ఆత్మస్తుతి మున్నగువానివలన గలుగు పాతకములు ఇందలి స్నానమాత్ర ముచే పటాపంచలు కాగలవు. వేయేల నిందు స్నానమును జేయువారల సకల పాపములును నశించును; మహాపుణ్యములు సంభవించును.

పౌర్ణమాసినాడిందు స్నానమును జేయువారలు దినదినమందును వేలాది కపిలగోవులను దానముచేయు వారల ఫలితమును బొందుదురు. ఇందు స్నానమును జేయువారలు కోటానుకోట్ల కన్యాదానములను జేయు వారల ఫలితమును బొందుదురు. కురుక్షేత్రములో విలువగల వస్త్రములను దానముచేయువారల ఫలితములను బడయుదురు. వేయేల గంగా నర్మదా సరయూ చంద్రభాగా మొదలగు నదులలో మునిగిన వారల ఫలితములను ఇందుమునిగిన వారలు బడయగలరు.

## ఆకాశ గంగ

పూర్వము గోదావరీ తీరమందొక విప్రుడు కాపురముచేయుచుండెను. ఇతడు మిక్కిలి ధర్మపరుడు; సత్యవాది; జితేంద్రియుడు. సకల భూతము లందును దయగలవాడు. నిత్యాగ్నిహోత్రి. దేవ, బ్రాహ్మణ పూజాతత్ప రుడు. తలిదండ్రులయెడ భయభక్తులతో మెలగెడువాడు, గురుభక్తి భరితుడు. వేయేల! సకల సాధుసమ్మతుడు. ఒకానొకప్పుడీ పుణ్యశీలు నింటికి వేదవేదాంగ పారగుడగు విప్రుడొకడేతెంచెను. ఆనాడు గృహ యజమానునింట పితృశ్రాద్ధమగుటచే వచ్చిన యభ్యాగతుని పితృశ్రాద్ధమున నిమంత్రితుని జేసెను. శ్రాద్ధాది కృత్యములను మిక్కిలి శ్రద్ధతో చక్కగ సాగించెను. అటుపిమ్మట గొంతకాలమునకు పుణ్యశీలుడగు గృహయజ మానుని ముఖమున వికృతాకార ముదయింప నారంభించెను. కొంతకాల మునకా వికృతరూపము గర్దభ ముఖరూపమున బరిణమించెను. గృహ యజమానుడు మిక్కిలి దుఃఖించి నిట్టూర్పులుపుచ్చి సువర్ణముఖరీ తీరము నందలి యగస్త్యాశ్రమమునకు బోయెను. ఈ యాశ్రమము సకల కామ ములను దీర్పగలదు. ఈ యాశ్రమమునందు మునిపుంగవులచే గొలువ బడు అగస్త్యమహామునినిజూచి మ్రొక్కి తనకు గాడిదముఖము ప్రాప్తిం చెననియు, దానిరూపుమాపి తన్ను గాపాడుమనియు వేడెను. అగస్త్య

డంత దివ్యదృష్టితోజూచి పుత్త్రహీనుని శ్రాద్ధమునకు నిమంత్రణచేయుటచే నీ గాడిదముఖము ప్రాప్తించెననియు, ఈ గాడిదముఖముయొక్క రూపు మాపుటకు తానుపాయమును జూపుదుననియు జెప్పి యిట్లు జెప్పసాగెను.

సువర్ణముఖరీ నదీతీరమున దేవతలచే నిత్యము గొలువబడు వేంకటాచలముగలదు. ఈ వేంకటాచలము మేరువుయొక్క కుమారుడు. దీనిని సేవించువారల సకలవాంఛితములు సిద్ధించును. ఆ వేంకటాచలమందు మహత్తరమగు నాకాశగంగయను తీర్థమొండు కలదు. ఇందలి స్నానము సకల పాపములను బాఱదోలును. ఆయురారోగ్యములను పెంపొందించును. కనుక నీవు వేంకటాచలమునకుబోయి సంకల్ప విధానపూర్వకముగ స్వామిపుష్కరిణిలో మునిగి పిమ్మట నాకాశగంగలో మునుగుము. నీముఖమునగల వైరూప్య మంతరించును. ఇందు సంశయములేదు. పొమ్ము అనెను. ఆ పుణ్యశీలు డగస్త్యునకు మ్రొక్కి అగస్త్యుడు చెప్పిన చొప్పున శ్రీవేంకటాచలమునకుబోయి నియత మనస్కుడై స్వామి పుష్కరణిలో మునిగి యాకాశగంగలో మునిగినంత గాడిదముఖము రూపు మాసెను; దివ్య తేజముతో కళకళలాడు ముఖము ప్రాప్తించెను.

పూర్వము కేసరియను శివభక్తుడగు రక్కసుడొక్కడుండెను. అతనికి సంతతిలేదు. అతడు పుత్త్రుని బడయగోరి శివుని మెప్పింప మిక్కిలి ఘోరమగు తపము నారంభించెను. కొంతకాలమునకు శంకరు డుమాసమేతుడై వృషభవాహనమున గోచరించెను. రక్కసుడు శంకరునిజూచి తనకు పుత్త్రుని ప్రసాదింపవేడెను. శంకరుడు రక్కసునిజూచి యతనికీజన్మమున పుత్త్రులు కలుగరనియు, అయ్యును రక్కసుని తపముచే ప్రీతుడగు తాను పుత్త్రిక ననుగ్రహింతుననియు, ఆమె పుత్త్రుడు లోకవిఖ్యాతుడు కాగలడనియు వరమొసగెను. పిమ్మట గొంతకాలమున కారక్కసుడు అంజనాదేవియను పుత్త్రిని బడసెను. ఆమె పెరిగి పెద్దది కానంత కేసరియను గొప్పవానరుడామెనుమోహించి అంజనాదేవిని తనకిచ్చి పెండ్లిచేయుమని కేసరిని వేడెను. ఆహా! పూర్వకాలమందలి కన్యాదాత లెంతటి పుణ్యశాలురు. రక్కసుడు మిక్కిలి సంతసించి యంజనాదేవిని వానరునకిచ్చి పెండ్లిచేసి సారెచీరెలతో నత్తింటికిసాగబంపెను. అంజనాదేవియు కిష్కింధాపురిలో చిరకాలము వ్రతశీల పరాయణురాలై మగనితో నత్తింట గాపు

రము చేయుచుండెను. చిరకాలమయ్యును పుత్త్రునిబడయక తపించుచు మతంగమహాముని చెంతకేగి పుత్త్రుని బడయదగిన వ్రతము నుపదేశింప ప్రార్థించెను. అంత మతంగు డామె కిట్లనెను.

సువర్ణముఖరీతీరమున వేంకటాచలము గలదు. ఆ వేంకటాచల మందు స్వామి పుష్కరిణి కలదు. అందుబోయి స్వామి పుష్కరిణిలో మునిగిన చిత్తము పరిశుద్ధమగును. ఈ స్వామి పుష్కరిణిలో మునిగి వరాహస్వామిని సేవించవలయును. స్వామిపుష్కరిణికి ఉత్తరదిగ్భాగ మున సింహశార్దూలాది మృగములచే సంకులమయినట్టియు, చందనాగరు నింబములు తాళ హింతాల కింశుకములు కపిత్థాశ్వత్థ బిల్వములు చూత పున్నాగ పనసలు వకుళామలకములు ఇంగుదీ మున్నగు చక్కని చెట్లతో నిండి కనులపండువుచేయు దివ్యప్రదేశమొండు గలదు. అట్టియెడ నాకాశ గంగయను పవిత్ర తీర్థము గలదు. ఆ తీర్థమున సంకల్పవిధానపూర్వక ముగ మునిగి తీర్థమున కభిముఖముగ గూర్చుండి వాయుదేవుని తృప్తికై తపమాచరింపుమనెను. ఇట్లు తపముచేయ సురాసుర విప్ర మునిపుంగ వులచేతను, మృగపక్ష్యాదులచేతను, వివిధ శస్త్రాస్త్రములచేతను వధింప రాని పుత్త్రుని బడయగలవనెను.

మతంగునిమాటలాలించి యంజనాదేవి వేంకటాచలమున కేగెను. స్వామిపుష్కరిణిలో మునిగి వరాహస్వామిని సేవించి శ్రీ వేంకటేశుని భజించి యాకాశగంగకు బోయెను. ఆకాశగంగయందలి శుభోదక ములలో మునిగి యా పావనతీర్థమునుద్రావి యా తీరమున వాయుదేవు నకై తపముచేయ నారంభించెను. తొలుత ఫలాహారమును, పిమ్మట జలా హారమును, తుదకు నిరాహారమునుజేయుచు వేయి సంవత్సరములు గడ పెను. ఇట్టులుండ చిత్తనక్షత్రముతో గూడిన చైత్ర శుద్ధ పౌర్ణమినాడు వాయుదేవుడు ప్రత్యక్షముగ గోచరించి యంజనాదేవిని వరమును వేడు కొమ్మనెను. అంజనాదేవియు తనకు పుత్త్రుని ప్రసాదింప గోరెను. అంజనాదేవి తపముచే సంతుష్టుడైన వాయుదేవుడు తాను అంజనాదేవి గర్భమున యశోవంతుడగు పుత్త్రుడుగా బుట్టెదనని వరమునిచ్చెను.

ఇప్పట్టున బ్రహ్మాది దేవతలును, ఇంద్రాది లోకపాలకులును, వసి ష్ఠాది మహాత్ములును, సనకాది యోగులును, వ్యాసాది విప్రపుంగవులును,

లక్ష్మీసమేతుడగు జగత్పతియు తమతమ భార్యలతో పుణ్యశీలురాలగు అంజనాదేవినిజూడ నేతెంచిరి. అంత బ్రహ్మయాజ్ఞనుగైకొని వేదవేదాంత వేత్తలలో నగ్రగణ్యుడగు వేదవ్యాసుడు ఆకాశగంగా ప్రాభవమును క్రిందివిధమున వెల్లడించెను. వేంకటాద్రితో తుల్యమగు పుణ్యక్షేత్రమీ బ్రహ్మాండమున గానరాదు. ఈ పుణ్యక్షేత్రములో స్వామిపుష్కరిణి మిక్కిలి పావనమయినది. ఆకాశగంగ స్వామిపుష్కరిణికన్నను మిక్కిలి పావనము. గంగాది సకల తీర్థములు నీ యాకాశగంగలో నిమిడియున్నవి. చిత్తనక్షత్రముతో గూడిన చైత్ర శుద్ధ పౌర్ణమినాడీ యాకాశగంగలో మునిగినవార లిహపర సుఖములను బడయుదురు.

## పాండవ తీర్థము

స్వామిపుష్కరిణికి తూర్పుదెస నీ తీర్థము గలదు. పూర్వము పాండవులు జ్ఞాతివధచే గలిగిన దుఃఖముచే బీడితులయియుండ శ్రీకృష్ణ భగవానుడు పాండవులను పాపవిముక్తులగుటకు వేంకటాచలమునకు బొమ్మనెను. పాండవులు వేంకటాచలమునకు వచ్చి యీ తీర్థములో మునిగి పాపములను బాసిరి. వైశాఖ శుద్ధ ద్వాదశి ఆదివారమునాడుకాని, వైశాఖ బహుళ భౌమవారమునాడుకాని పాండవతీర్థమున మునిగిన వారలు ఇహపర సుఖములను బొందుదురు.

## దేవ తీర్థము

ఈ వేంకటాచలమందలి మహిమయొక్క విశేషమేమన శ్రీ వేంకటేశ్వరాలయమునకు వాయవ్య దిగ్భాగమున దేవతీర్థమొండు గలదు. ఈ తీర్థము మిక్కిలి పావనమయినది. శోభనమయినది. పుష్యమి నక్షత్రముతోగూడిన గురువారముగాని, శ్రవణ నక్షత్రముగూడిన సోమవారమునగాని లేక వ్యతీపాతయోగకాలమునగాని దేవతీర్థములో మునుగుట ముఖ్యము. పైనజెప్పిన కాలములలో దేవతీర్థమందు స్నానముచేయు వారల జానాజ్ఞానకృతములగు సకల పాపములు పటాపంచలు కాగలవు. ఈ దేవతీర్థమున మునిగినవారల పుణ్యములు వృద్ధినిజెందును. దీర్ఘాయువు

చేకూరును. పుత్రపౌత్రాదులతో వంశము విస్తరిల్లును. ఈ దేవతీర్థమున మునుగు పుణ్యశీలురు ఇహపర సుఖమును అనుభవింతురు. పై జెప్పిన దినములలో దేవతీర్థ తీరమునందన్నదానము చేయువారలు యావజ్జీవము అన్నదానముజేయువారలతో తుల్యులగుదురు.

# పాపనాశన తీర్థము

పూర్వము వేదవేదాంతపారగుడు, మిక్కిలి దరిద్రుడు, వృత్తిహీనుడు నగు భద్రమతియను విప్రుడుండెడివాడు. ఇతనికి కృత, సింధు, యశోవతి, కామిని, మాలిని, శోభ యను నాలుగురు భార్యలు కలరు. కాలక్రమమున భద్రమతి యీ భార్యలతో గాపురముచేయుచు రెండువందల పరిమితమగు సంతతిని గాంచెను. భద్రమతి మిక్కిలి దరిద్రుడగుటచే కుటుంబమును భరింపనేరక క్షుధార్తులగు దారాపుత్రాదులనుజూచి క్రింది విధమున విలపింపసాగెను. ధనధాన్యాది సంపదలేనివాని జన్మము వ్యర్థము. ఐశ్వర్యములేని బహుపత్నీకుని జన్మము వ్యర్థము. దారిద్ర్యమను మహాసముద్రముల మునిగి తేలుచున్నవాని సద్గుణములుకాని, పాండిత్యముకాని, సత్కుల ప్రసూతికాని రాణింపవు. పుత్త్రులు, పౌత్త్రులు, బంధువులు, తోబుట్టువులు, శిష్యులు నైశ్వర్యహీనునిచెంత జేరరు. చండాలుడయ్యును భాగ్యవంతుడే పూజింపబడును. లోకులు దరిద్రుని శవమును జూచురీతిని జూతురు, నిందింతురు. ధనికుడు కఠోరుడయ్యును, గుణహీనుడయ్యును, మూర్ఖుడయ్యును, ధర్మవిముఖుడయ్యు నాదరింపబడును. దారిద్ర్యము దుఃఖము. అందును ఆశ మఱియు మిక్కిలి దుఃఖము. ఆశకు దాసులయినవారలు సకలలోకదాసులు గావలయును. ఆశను దాసినిగా గైకొన్నవారికి సకలలోకము దాస్యము చేయును. సకలశాస్త్ర పారంగతుడయ్యును దరిద్రుడు మూర్ఖునివలె రాణింపడు. దారిద్ర్యమను మహామకరముచే బట్టుపడినవారికి విమోచనములేదు. అహో! దారిద్ర్యమెంత దుఃఖము. అందును దారాపుత్త్రాదుల బాహుళ్యము మఱింత దుఃఖహేతువు. అనుచు విలపించుచు సంపదలురాగల త్రోవల నాలోచించుచుండెను.

అంతలో భద్రమతి భార్యలలో మిక్కిలి గుణవంతురాలగు కామిని భర్తనుజూచి మధురమధురములగు పలుకులతో క్రిందివిధమున ముచ్చటించెను. నాథా! సువర్ణముఖరీ నదీతీరమున దేవతలును, మునిపుంగవులును సేవించు వేంకటాచలమొండుగలదు. ఆ వేంకటాచలమందు సకల పాపములను పటాపంచలుచేయగల పావనమగు తీర్థమొండుగలదు. ఈ తీర్థములోమునిగి భూదానమునుచేయనంత సకలైశ్వర్యములు సిద్ధించునని మా తండ్రికి నారదుడు చెప్పుచుండుట నా పిన్నతనమున వినియుంటిని. నా జనకు డవ్విధమునజేసి ఇహమున సకల సుఖములను అనుభవించి పరమున విష్ణుపదమును జేరెను. వేంకటాచలమందలి పాపనాశనమందు మునిగి పదియడుగుల భూమిని దానముచేయ సకలపాప వినిర్ముక్తుడగును. భూదానమునకు తుల్యమగు దానములేదు. వృత్తిలేని విప్రునకుజేసిన భూదాన ఫలమును వర్ణింప నాదిశేషునకు సయితము శక్యముగాదు. కావున దారాపుత్రాదులతో బయలు వెడలుము. వేంకటాచలమునకు బోవుదమనెను.

భద్రమతి కామిని పలుకు లాలకించెను. భార్యాపుత్రాదులతో బయలువెడలి సుశాలి యను నగరమునకు బోయెను. ఆ నగరమున సకలైశ్వర్యసంపన్నుడగు సుఘోషుడను విప్రుడొకడు గలడు. అతనిని జూచి తనకు పంచహస్త పరిమితమగు భూమిని దానముచేయ వేడెను. సుఘోషుడు వేదవేదాంత పారగుడు, దరిద్రుడు, కుటుంబియునగు భద్రమతినిజూచి తన జన్మము సఫలముకాజాలెనని మిక్కిలి సంతసించెను. భద్రమతిని తగు మర్యాదతో నాదరించి సత్కరించి, పంచహస్త పరిమితమగు భూమిని దానముచేసెను. భద్రమతియు నా భూమిని ప్రతిగ్రహించి సంతసించి వేంకటాచలమునకు బోయెను. వేంకటాచలమందలి స్వామి పుష్కరిణిలో మునిగి వరాహస్వామిని సేవించి, శ్రీ వేంకటేశుని భావించి పాపనాశన తీర్థమునకు బోయెను. దారాపుత్రాదులతో సంకల్ప పూర్వకముగ పాపనాశనమందు మునిగి శ్రోత్రియుడు, కుటుంబియునగు విప్రునకు తాను సుఘోషునినుండి గ్రహించిన భూమిని దానముచేసెను. పాపనాశనమందుజేసిన భూదానమునకు సంతసించి పరమేశ్వరుడు ప్రత్యక్షమాయెను. భద్రమతి పరమానందభరితుడై క్రిందివిధముగా బరమేశ్వరుని నుతింపసాగెను.

ఓ సకల లోకములను బుట్టించు దేవదేవా! నమస్తే. అఖిల బ్రహ్మాండపాలకా! నమస్తే. ఓ దేవాధిదేవా! నమస్తే. ఓ దైత్యమర్దనా! నమస్తే. ఓ భక్తజనప్రియా! నమస్తే. ఓ పాపవిదారణా! నమస్తే. ఓ దుర్జనాంతకా! నమస్తే. ఓ జగదీశ్వరా! నమస్తే. ఓ లక్ష్మీపతే! నమస్తే. ఓ అవ్యయా! నమస్తే. ఓ అమితప్రభా: నమస్తే. ఓ సూర్యచంద్ర లోచనా! నమస్తే. ఓ యజ్ఞఫలప్రదాతా! నమస్తే. ఓ సజ్జనవల్లభా! నమస్తే. ఓ అభీష్ట సుఖప్రదాతా! నమస్తే. ఓ భక్తమనోరమా! నమస్తే. ఓ అఖిలకారణా! నమస్తే. ఓ మంధరధారణా! నమస్తే. ఓ హిరణ్యాక్ష విదారణా! నమస్తే. ఓ వామనరూపా! నమస్తే. ఓ క్షత్రకులాంతకా! నమస్తే. ఓ రావణమర్దనా! నమస్తే. ఓ నందసుతాగ్రజా! నమస్తే. ఓ కమలాకాంతా! ఓ ఆశ్రితార్తి విభంజనా ! నమోనమః. అని నుతించు విప్రోత్తమునకు బరమేశ్వరుడు సకలైశ్వర్యముల ననుగ్రహించి యంతర్ధానమును బొందెను.

పూర్వము దృఢమతియను శూద్రుడును, సుమతియను విప్రుడును యీ పాపనాశనమందు మునిగి తమతమ పాపములను బాసిరి.

పుష్యమి నక్షత్రముతోగాని, హస్తనక్షత్రముతోగాని కూడిన సప్తమి ఆదివారమునాడు ఈ పర్వతేంద్ర శిఖరమునగల యీ పాపనాశనమందు మునిగినవారల సకల పాపములు నంతరించును.

## చక్ర తీర్థము

పూర్వము శ్రీవత్సగోత్రమున బుట్టిన పద్మనాభుడను విప్రుడుండెడివాడు. ఇతడు జితేంద్రియుడు. సకలభూత దయాపరుడు. సుఖ దుఃఖాది ద్వంద్వముల నతిక్రమించినవాడు. ఇతడు వేంకటాచలమునకు బోయి జీర్ణపర్ణములను భక్షించుచు చక్రతీర్థతీరమందు తపముచేయ నారంభించెను. మఱికొంతకాలమునకు జీర్ణపర్ణములను సయితము వీడి జలాహారముతోడను, మఱియు గొంతకాలమునకు వాయుభక్షణముతోడను తపమును సాగించుచుండెను. ఇట్లు పదిరెండు వత్సరములు ఘోరతపమునుజేయునంత నొక్కనాడు కమలాపతి యతని తపమునకు బ్రీతుడై

దర్శనమునొసగెను. పద్మనాభుడు కోటిసూర్య సమప్రభుడు, వికచాంబుజ లోచనుడునగు వేంకటేశ్వరునిజూచి, ఓ దేవదేవా! ఓ వాసుదేవా! ఓ శేషాచలనివాసా! ఓ త్రైలోక్యనాథా! ఓ విశ్వరూపా! ఓ జగత్సాక్షీ! ఓ కమలనేత్రా! ఓ క్షీరాబ్ధిశయనా! ఓ భక్తప్రియా! ఓ ప్రణతార్తిహరా! నమోనమః యని స్తుతింప నారంభించెను. ఇట్లు నుతించు పద్మనాభుని జూచి శ్రీ వేంకటేశ్వరస్వామి ఆచంద్రతారార్కము చక్రతీర్థ తీరమున తపముచేయుచు నివసింప ననుగ్రహించి యంతర్ధానుడాయెను.

పద్మనాభుడు చక్రతీర్థ తీరమున తపమును సాగించుచుండ గొంత కాలమునకు రక్కసుడొక్కడు మిక్కిలి క్షుధార్తుడై చక్రతీర్థ సమీపమున దిరుగుచు పద్మనాభుని మ్రింగబోయెను. అంత పద్మనాభుడు ఆపన్న పరాయణుడగు నారాయణుని రక్షింప మొఱపెట్టెను. ఓ శ్రీ వేంకటేశా! ఓ దయాసింధో! ఓ శరణాగతపాలకా! ఈ రక్కసుని బాఱినుండి నన్ను గావుము. నాకు వేఱొండు దిక్కులేదు. ఓ దామోదర! ఓ జగన్నాధ! ఓ లక్ష్మీకాంత! ఓ గరుడధ్వజ! పూర్వము మకరిదాఱినుండి గజేంద్రుని గాచినపగిది నన్ను ఈ రక్కసునిబాఱినుండి గావుము; ప్రహ్లాదునిరీతి నన్ననుగ్రహింపుము అనుచు మొఱపెట్టు పద్మనాభుని మొఱనాలించి దయానిధియు భక్తవత్సలుడునగు పరమేశ్వరుడు పద్మనాభునిగావ విష్ణు చక్రమును బంపెను. ఆ విష్ణుచక్రము కాలాగ్ని ప్రభలతో నేతెంచెను. విష్ణుచక్రముయొక్క రాకనుగాంచి రక్కసుడు పలాయనమును చిత్తగింప నారంభించెను. విష్ణుచక్రము అతనిని విడువక వెంటాడి రక్కసుని శిరమును ద్రుంచెను. కావున నీ తీర్థము చక్రతీర్థమను సార్థకనామమును బడసెను.

## రామకృష్ణ తీర్థము

పూర్వము రామకృష్ణుడను బ్రాహ్మణుడుండెడివాడు. ఇతడు సత్యశీలుడు; సర్వభూత దయారతుడు; శత్రుమిత్ర తుల్యుడు; విజితేంద్రియుడు; వేయేల పరబ్రహ్మ నిష్ణాతుడు. ఇతడు వేంకటాచలమందొక తీర్థతీరమందు నివాసమేర్పఱచుకొని తపముచేయ నారంభించెను. ఇమ్మహ

నీయుడు వందలాది సంవత్సరములు కదలక మెదలక తపముచేయు చుండెను. కొంతకాలమునకు రామకృష్ణుని దేహము నావరించి యొక పుట్ట పెరుగ నారంభించెను. రామకృష్ణుడు తన దేహమునుగప్పి పుట్ట పెరుగుచుండెననియు దెలియక తపమును కొనసాగించుచునేయుండెను. ఒకప్పుడు దేవేంద్రుడు రేయింబవళ్లు కుంభవృష్టితో వర్షింప మొదలిడెను. ఆఱునొక్కదినములు సంతత ధారతో వర్షము గురియుచున్నను రామ కృష్ణుడు నిశ్చలముగ తపముచేయుచుండెను. తుదకు దేవేంద్రుడు పిడు గులను వర్షింప నారంభించెను. ఆ పిడుగులతో పుట్ట బీటలువాఱి పగిలెను. అయ్యును నిశ్చలముగ తపముచేయుచున్న రామకృష్ణుని భక్తికి మెచ్చి పరమేశ్వరుడు పుష్యమీ నక్షత్రముతోగూడిన పుష్య శుద్ధ పౌర్ణమినాడు ఆవిర్భవించెను. రామకృష్ణునకు పరిపూర్ణానుగ్రహమును జూపెను. తానావిర్భవించిన పుష్యమి నక్షత్రముతోగూడిన పుష్య శుద్ధి పౌర్ణిమనాడు రామకృష్ణ తీర్థములో మునిగినవారలు సకలపాప వినిర్ముక్తులగుదురనెను. ఆ తీర్థమునకు రామకృష్ణతీర్థమను సార్థకనామము ననుగ్రహించెను.

## కటాహ తీర్థము

పూర్వము తుంగభద్రాతీరమందు మహావైభవముతో చూడ ముచ్చట గొలుపు వేదపురమను అగ్రహారముండెడిది. ఈ యగ్రహారమందు గాపు రముచేయువారలందఱును వేదవేదాంత పారగులు, ధర్మశాస్త్ర నిరతులు, అన్నదానపరులు, పశుపుత్రాది సకల సంపదలుగలవారు. ఈ యగ్రహార మందు పద్మనాభుడను పండితుడుండెడివాడు. ఇతనికి కేశవుడను పుత్త్రు డొక్కడు కలడు. ఒకప్పుడు కేశవుడు తల్లితండ్రులను పతివ్రతాతిలకమగు భార్యనువదలి వేశ్యాలోలుడై యిలువీడిచనెను. కొంతకాలమునకు కేశవుడు ధనహీనుడాయెను. పిదప వేశ్యాంగనయు కేశవుని తనయింటినుండి వెడల గొట్టెను. కేశవుడా వేశ్యయందలి యనురాగముచే వేశ్యను విడనాడనేరక అందందు చోరవృత్తిచే దిరుగుచు ద్రవ్యమును గొనివచ్చి వేశ్యకు నిచ్చు చుండెను. ఆ వేశ్యతో నేకపాత్రమున భుజించుచు నేకపాత్రమున సురా పానమును జేయుచు కాలము వెళ్ళబుచ్చుచుండెను. ఒకనాటిరేయి కేశ వుడు కిరాతులతోజేరి చౌర్యమునకు బోయెను. కిరాతులతో కేశవుడొక

విప్రునింట జొరబడెను. ఇంటి యజమానుని జంపి బహు ద్రవ్యములను అపహరించెను. అపహరించిన ద్రవ్యములతో వేశ్యానిలయమునకు బోవు కేశవుని బ్రహ్మహత్యా పాతకము వెంటాడెను. నల్లని వస్త్రములనుగట్టి భూమ్యాకాశములు దద్దరిల్లి మాఱుమ్రోయుచు కంపించునట్టి యట్టహాస ముతో గర్జించుచు తన్ను వెంటాడు బ్రహ్మహత్యను కేశవుడు గాంచెను. తానెందుబోవ నందందే వెంటాడు భయంకరమగు బ్రహ్యాహత్యనుజూచి తుదకు కేశవుడు వేదపురమునకు బరువెత్తి తనయింట దూఱెను. ఇంట తన తండ్రియగు పద్మనాభునిజూచి పాదములపై వ్రాలి త్రాహిత్రాహియని శరణుజొచ్చెను. పద్మనాభుడు పుత్త్రవాత్సల్యముచే పుత్త్రున కభయమిచ్చి భయపడకు మనెను. అంతలో కేశవుని వెన్నంటియున్న బ్రహ్మహత్య పద్మనాభునిజూచి యిట్లు జెప్పనారంభించెను.

ఈ కేశవుడు సురాపానము చేయువాడు; చౌర్యవృత్తి కలవాడు; బ్రహ్మఘ్నుడు ; మహాపాపి. ఇతడు మాతృద్రోహి; పితృద్రోహి. ఇతడు తన భార్యను వదలిన దుర్బుద్ధి; వేశ్యాలంపటుడు. ఈ దురాత్ముని వద లుము. విడువనొల్లక పరిగ్రహింతువేని నీ సకల కులమును నశింప జేయుదును. నీ వంశమును గాపాడుకొనుట కీ పుత్త్రుని విడువుమనెను. అయ్యును పుత్త్ర వాత్సల్యముచే పద్మనాభుడు సుతుని విడనాడకుండెను. అంత బ్రహ్మహత్య కేశవుడు పతితుడు కావున నిందితుడనియు, ఇట్టి సుతునియందు వాత్సల్యము చూపవలదనియు నొక్కి-వక్కాణించి పద్మనా భుడు చూచుచుండ గేశవునిచేయిబట్టి యీడ్వనారంభించెను. కేశవుని తలి దండ్రులును భార్యయు చేయునదిలేక భోరున నేడ్వసాగిరి. అప్పట్టున భరద్వాజ మహాముని యచటికేతెంచెను. పద్మనాభు డతనినిజూచి తల వంచి మ్రొక్కి-నుతించి పుత్త్ర భిక్షమును బెట్టుమని వేడుకొనెను. తన కేకైక పుత్త్రుడనియు నీ పుత్త్రుడు బ్రహ్మహత్యచే మృతినొంద తన వంశ మంతరించుననియుజెప్పి తన సుతుని బ్రహ్మహత్యా విముక్తుని గావింప పరిపరివిధముల బ్రార్థించెను. అంత భరద్వాజుడు పద్మనాభుని ప్రార్థనల నాలించి ముహూర్తమాత్రము దివ్యదృష్టితో నాలోచించి పద్మనాభునితో నిట్లనెను.

కేశవుడుచేసిన పాపములు ప్రాయశ్చిత్తములతో అంతరింపజాలవు. అయ్యును నీ పూర్వపుణ్య విభవములతో నేనొక ప్రాయశ్చిత్తమును

జెప్పెద నాలకింపుము. గంగానదికి దక్షిణపుదెస రెండువందల యోజనముల దూరమున, తూరుపు సముద్రమున కైదుయోజనముల దూరమున సువర్ణ ముఖరియను నది కలదు. ఆ నదికి నుత్తరపుదెస క్రోశ దూరములో వేంకటాచలము కలదు. ఆ పర్వతము సకలలోకైక పూజ్యము. ఆ పర్వతమందు ముక్తిప్రదుడగు శ్రీ వేంకటేశ్వరస్వామి నివసించుచుండును. శ్రీ వేంకటేశ్వరాలయమునకు ఉత్తర దిగ్భాగమున మంగళప్రదమగు కటాహతీర్థమొండు కలదు. ఆ తీర్థస్నానము బ్రహ్మహత్యాది సకల పాపములను బాఱదోలును. సకల వాంఛితముల నొసగును. ఈ కేశవుడు మనోహరమగు కటాహ తీర్థములో మునిగిన బ్రహ్మహత్యా విముక్తుడు కాగలడనెను.

అంత పద్మనాభుడు భరద్వాజుని యుపదేశము నాలించి సుతునితో బయలుదేరి శ్రీ వేంకటాచలమునకు బోయెను. స్వామి పుష్కరిణిలో మునిగి వరాహస్వామిని సేవించెను. శ్రీ వేంకటేశ్వర విమానమునకు బ్రదక్షిణ నమస్కారములనుజేసి శ్రీ వేంకటేశ్వరుని సేవించి కటాహ తీర్థమునకు బోయెను. కేశవుడు కటాహతీర్థములో మునుగునంత బ్రహ్మహత్యా పాతక మంతరించెను. పద్మనాభుడు కటాహ తీర్థమున మునిగి లేచునంత శ్రీ వేంకటేశ్వరస్వామి యావిర్భవించి కేశవ పద్మనాభులను సకలపాప వినిర్ముక్తులనుజేసి సకలైశ్వర్యములతో ననుగ్రహించి యంతర్ధానము నొందెను.

## కపిల తీర్థ వేంకటాచలముల మాహాత్మ్యము

పూర్వము కాళహస్తి యను నగరములో బురందర సోమయాజి యను పండితుడుండెను. ఇతనికి చిరకాలము సంతతి లేకుండెను. కాని పూర్వపుణ్యవశమున వృద్ధాప్యములో బురందరసోమయాజికి బుత్త్రుడొక్కడుదయించెను. పురందరుడా పుత్త్రునకు మాధవుడను నామకరణముజేసెను. ఈ బాలుడు శుక్లపక్ష జంద్రునివలె గాలక్రమమున బెఱిగి కులక్రమాగతమగు వేదవేదాంగ విద్యలలో నారితేరెను. కొంతకాలమునకు బురందరుడు పుత్త్రునకు బెండ్లిజేయ సమకట్టి చంద్రలేఖ యను పాండ్యదేశపు

రాజు పుత్రిని విధి విహితముగ బరిణయము గావించెను. ఇరువదియొక్క సంవత్సరముల ప్రాయముగల మాధవుడు చంద్రలేఖతో గాపురము జేయు చుండెను. పంచమహా యజ్ఞాది నిత్యకృత్యములను చక్కగా నాచరించు చుండెను. చంద్రలేఖయు బతివ్రతా తిలకము. పతి భుజించిననే భుజించును; శయనించిన శయనించును.

ఇట్లుండ నొక్కనాడు మాధవుడు దివా సంగమతత్పరుడై సతీమణిని బిలచి తన కోరికను దెలిపెను. పతివాక్యముల నాలించి చంద్రలేఖ భర్తతో నిట్లనెను. శరీరము అస్థిమాంసాది సమూహము. ఇట్టి శరీరముల సమాగమము గ్రామ్యము. ఇద్దానిని సాధువులు సమ్మతింపరు. అందును దివా సంగమమును బొత్తిగ నిరసింతురు. ఇంట నత్తమామలు గలరు. దేవతా గృహమున నిత్యాగ్నిహోత్రుడు వెలుగొందుచుండెను. దివాకరుని కాంతిపుంజములు నలుదెసల నిండియుండెను; కనుము; దివా సంగమ వాంఛను బరిత్యజింపుము అనెను. మాధవుడు భార్య పల్కులు విని యిట్లనెను. ఓ భామిని! నా కోరికను దీర్పుము. నీకు చక్కని పుత్త్రుడు కలుగును. పరలోకమున నీకు బతిలోకము ప్రాప్తించును. ఆలసింపక రారమ్మ అనెను. అంత చంద్రలేఖయు భర్త పలుకులు విని చేయునదిలేక తాను మంచినీటికై బిందెనెత్తుకొని తటాకమునకు బోవుదుననియు, సమిధలకై ముందుగబోయి యందు వేచియుండుమనియు భర్తకు జెప్పెను. అంత మాధవుడు బయలుదేరిపోయి సువర్ణముఖరీ నదీతీరమునగల మఱ్ఱిచెట్లగుంపులో చంద్రలేఖకై వేచియుండెను. అంతలో నా వట వనమున నొక చక్కని యువతిని గాంచెను. ఈమె తెల్లని చీరను గట్టెను; దట్టమగు రవికెను దొడగెను; కనులకు కాటుకబెట్టెను; నడుమున వడ్డాణమును దాల్చెను. ఈమెకు తీర్చిదిద్దినపగిది కనుబొమలు తీరియుండెను. నాసికాపుటము తిలపుష్పమునుబోలి యుండెను. చక్కని రూపుతో తారుణ్యమును వెల్లడించు వక్షోజములతో తుమ్మెదలనుబోలి మీగాలుపర్యంతము వ్రేలాడు శిరోజములతో నొప్పి మఱ్ఱిచెట్టునీడను గూర్చున్న యీ భామినీ తిలకమునుగాంచి మాధవుడు మోహపరవశుడయ్యెను. అంతలో చంద్రలేఖ బిందె చంకబెట్టుకొని భర్తచెంతకు వచ్చెను. మాధవుడామెనుజూచి ప్రేయసీ! నీ పతిభక్తిని బరీక్షింప నట్లం

టిని; నిన్నిటకు రావించితిని. అంతియకాని దివాసంగమమును గోరు నంతటి మూర్ఖుడనే! నీ పతిభక్తికి నేనెంతయు సంతసించితిని. నా వాంఛితము దీరెను. నీ వింటికిబొమ్మ. సమిధల నించుక సేకరించి నేను మరలివత్తును. పోపొమ్మ అనెను. అంత చంద్రలేఖయు నీటిబిందెతో నింటికిబోయెను.

ఇవ్విధమున మాధవుడు తన సతీమణి నింటికి సాగనంపి మదనాతురుడై మెల్లమెల్లన మఱ్ఱిచెట్టుచెంతకు బోవసాగెను. మఱ్ఱిచెట్టు నీడలో నొయ్యారముగ నేదదీర్చుకొనుచున్న కుంతల తనజెంత కేతెంచు విప్రయువకుని జూచెను; చెంతకు రావలదనెను. మాధవుడామె పలుకులాలించి యామెతో నివ్విధమున బలుక దొడగెను. నీవెవ్వతెవు? నీదేయూరు? నీ తల్లితండ్రులెవ్వరు? చెప్పుము అనెను. ఆ పల్కులను విని ఆమె తాను మధ్యదేశమున నివసించుదాననినియు, తాను జారకులమున బుట్టితిననియు, చండాలురాలననియు జెప్పి, వేదవేదాంగవేత్తవగు నీవు నన్ను జూడరాదనియు, నంటరాదనియు జెప్ప నారంభించెను. మాధవుడామె పలుకు లాలించెను. ఇట్టి రమణీలలామను చండాలకులమున బుట్టించిన విధిని వేనోళ్ళదూఱసాగెను. ఆ రమణీలలామయందు తనకుగల వ్యామోహమును వెల్లడించెను. తన మనోభీష్టమునుదీర్పుమని కుంతలను పలువిధముల బ్రతిమాలెను. కుంతలయు నాతని పలుకులు విని కులటలతో దిరుగువారల కులము నూఱుతరములపర్యంతము పాపభూయిష్ఠము కాగలదనియు గావున నట్టి తలంపుల విడనాడుమనియు నానారీతుల బోధించెను. అయ్యును మాధవుడామె యంగసౌష్ఠవమునకు విమోహితుడై చండాలీ సంగమముచే గలుగు నరకమును సయితము సరకుగొనక కుంతలను బలాత్కరింపసాగెను; కాని కుంతల తన సంపర్కముచే విప్రయువకునకు రాబోవు నధోగతిని జింతించి సూర్యచంద్రులను, దిక్పాలకులను దలచి ప్రార్థించి విలపింపసాగెను; తన్ను ముట్టరాదని మాధవు నొకవంక వేడుచుండెను. కామాంధుడై కుంతల మాటలను పెడచెవినిబెట్టి మాధవుడు మీదిమీదికి వచ్చుచుండ కుంతలయు గొంతకొంత వెనకకుబోవుచు మాధవునితో నిట్లు పలుకజొచ్చెను. ఓ మాధవా! ప్రపంచమున బురుషులు తమతమ వర్ణములలో బుట్టిన యువతులతో రమింపనగును. ఇట్టి యనాది

సిద్ధమగు ధర్మమును విడనాడరాదు. నీవు వేదపూతుడవు. నీ తల్లి తండ్రులు ఋతుకాలమందలి సాంగత్యముచే నిన్ను గనియుందురు. వేద మంత్రములతో సీమంతము నాచరించియుందురు. పదియవమాసమున నీ జనని నిన్ను బ్రసవించియుండును. నీ జనకుడు నీకు వేదమంత్ర ములతో నామకరణమును గావించియుండును. పిమ్మట చౌళాన్నప్రాశా దులనుజేసియుండును. అగ్నిసాక్షిగ బెండ్లిజేసియుండును. వేదశాస్త్రము లను జదివి యాహితాగ్నివైయుంటివి. ఇట్టి నీ దేహమునకు నా దేహ ముతో సంగమమెట్లు సంభవించును. నీ కరములు దేవుని బూజించుటచే బావనములు. నీ నాసికాపుటము దేవున కర్పించిన చందనాది సుగంధ ద్రవ్యముల నాఘ్రాణించుటచే బావనము. నీ జఠరము వాసుదేవునకు నివేదించిన యన్నము నారగించుటచే బావనము. శ్రీహరినామ కీర్తన ముచే నీ జిహ్వాయు బావనము. పుణ్యక్షేత్ర సంచారముచే నీ పాదములు పావనములు. అమిత దోషములతోనిండిన నా దేహమునకు యిట్టి పావన మగు నీ దేహముతో నెట్టి పోలికయు గానరాదు. చూడుము! నా నాలుక యెల్లప్పుడును గఠోరములగు దుర్భాషలతో నిండియుండును. సురాపాన మాంసాశనముచే నా జఠరమున గుల్మములు బుట్టియుండును. వ్యభిచార కథాలాపములచే నా చెవులు చిల్లులువడెను; విటులయిండ్లకు దిరిగితిరిగి నా పాదములు పాషాణసదృశములాయెను. నిత్యము గోవధల నాచరిం చుటచే నా కరములు యమదండతుల్యములాయెను. ఇట్టి నా దేహముతో నీవు రమింపగోఅనేల? ఉత్తముడు నీచకృత్యములచే నైచ్యమునుబొంది స్వర్గమునకెట్లు పోగలడు? పరస్త్రీ సంగమ దోషమువలన బలువురు మర ణించిరి. కావున బొమ్ము! నన్నంటబోకు మనెను. ఈ పలుకు లాలించి మాధవుడు చండాలితో నిట్లనెను.

ఓ కుంతలా! అనంతజన్మ సుకృతములచే నీవు నాకంటబడితివి. నీ సాంగత్యము అట్టి యనంతసుకృతముల ఫలము కాగలదు. నీ సాంగ త్యము సకల పురుషార్థ హేతువు. ఇట్టి నీ సాంగత్యము దైవయోగముచే నాకు బ్రాప్తించెను. లజ్జనువీడి నా యభిమతమును దీర్పుము. నిన్ను విడిచిన నా ప్రాణములు బోవును. నా ప్రాణములను గాపాడుము. నిరాక రింపకుమనెను. ఇవ్విధమున బ్రతిమాలుచు చెంతకేతెంచు నాతని

మనోగతమునెఱింగి కుంతల పరువెత్తసాగెను. మాధవుడు పరువెత్తు చున్న కుంతలను వెంటాడి పట్టుకొనెను. మాధవుని పితృదేవతలకు రౌర వాది నరకములుప్రాప్తించునని యెలుగెత్తి యఱచుచున్న కుంతలనుమాధ వుడు బిగియార గౌగలించి బలాత్కారమున తనివితీర రమించెను. భోగాంతమున కుంతల మాధవునిజూచి యిట్లనెను. నేటినుండియు నీవు నాకు భర్తవైతివి. నీ యజ్ఞోపవీతమును త్యజింపుము. కేశములను దీయిం పుము. నాతోడ గోమాంసాదులను భక్షింపుము. సురాపానము చేయుము. చండాలుడవైతివి అనెను. విధిచోదితుడై మాధవుడు కుంతలతో కృష్ణవేణీ నదీతీరమున బదిరెండు వత్సరములు గడపెను. కాలమొక్కరీతి సేరికిని గడువబోదు. శరీరములు నీటిబుడగలవలె నశాశ్వతములు. దైవయోగ ముచే నాయుష్యముతీరి యొకప్పుడు కుంతల కాలధర్మము నొందెను. మాధవుడు మాత్రము కుంతలయందలి వ్యామోహము దీరమి కుంతలా వియోగభారమును భరింపనేరక మతిచెడి అందందు దిరుగ నారంభించెను.

ఒకప్పుడు ఉత్తరదేశపురాజులు కొందఱు వేంకటాచలయాత్రకు బోవుచుండిరి. ఉన్మత్తుడైన మాధవుడు దైవవశమున వారిని వెంబ డించి, వారి యుచ్ఛిష్టములను దినుచు వారితోబాటు తిరుపతికి వచ్చెను. ఆ యాత్రికులు కపిలతీర్థమునకు బోయిరి. కపిలతీర్థ తీరము నందు ఆయుష్కర్మముల నాచరించి పితృదేవతలకు బిండప్రదానములను జేసిరి. వారిని వెంబడించియున్న మాధవుడు సయితము వారితోబాటు కపిల తీర్థములో మునిగి పితృదేవతలకు మట్టితో బిండములను బెట్టెను. ఈ పిండములతో నాతని పూర్వులు స్వర్గలోకములకు బోయిరి. కపిల తీర్థములో మునిగి పితృదేవతలకు బిండప్రదానములను చేయునాతని పూర్వులు స్వర్గమునకు బోవుదురు.

శ్లో॥ కింవర్ణయామః పురుషోత్తమస్య
క్షేత్రస్యతీర్థస్యచపుణ్యశక్తిమ్ ।
మృత్పిండదానాత్పితరశ్చతస్య
ముక్తింప్రపన్నా మురవైరిశాసనాత్ ॥

ఆనాటి తెల్లవారుఝామున నా రాజులు బంధుమిత్రులతో శ్రీ వేంకటాచలము నధిష్ఠింపసాగిరి. మాధవుడు వారిని వెంబడించిపోవు చుండెను. కొంతదూరముసాగిపోవుచు వారందందు విశ్రమింప మాధవుడును విశ్రమించుచు క్రమక్రమమున శ్రీ వేంకటాచలము నధిష్ఠించెను. మాధవుడు పర్వతమునధిష్ఠింప నారంభించినదాది మాధవుని శరీరములోని పాపములు కంపింప నారంభించెను. వేంకటాద్రి మాహాత్మ్యముచే మాధవుని దేహమందలి పాపములను దహింప నొక యగ్ని బయలుదేఱెను. మాధవుని పాపములు దగ్ధములగుచుండ దుర్గంధభూయిష్ఠమగు ధూమము ఊర్ధ్వలోకముల నావరించెను. బ్రహ్మరుద్రాదులీ విచిత్రమును దెలియుటకై విమానములతో నాకసమార్గమునకేతెంచిరి. పాపవినిర్ముక్తుడగు మాధవునిపై బూలను గురిపించిరి. అంత చతుర్ముఖుడు పాపవినిర్ముక్తుడగు మాధవునిజూచి విమానమునుండి పర్వత శిఖరమున కవతరించి నాతని గౌగిలించి శిరమును మూర్కొనుచు నాదరించి యిట్లనెను. ఓ మాధవా! నీ పాపములు తొలగెను. స్వామిపుష్కరిణిలో మునిగి వరాహస్వామిని సేవింపుము. ఈ దేహము తొలగిన పిమ్మట పాండవ దౌహిత్రుని కులమునందు ఆకాశరాజు అను పేర సుధర్ముని సుతుడవై పుట్టి తొండమండలమును బాలింపుము. జగన్మాతయగు లక్ష్మీదేవి నీకు బుత్రి కాగలదు. శ్రీ వేంకటేశ్వరుడు నీకు అల్లుడు కాగలడు. చిరకాలము రాజ్యమును బాలించి దేహావసానమున పరమపదమును జేరెదవు అనెను. మఱియు జతుర్ముఖుడు సకల పాపహారమగుటచే నీ పర్వతమునకు వేంకటాచలమను సార్థకమగు నామధేయము నొసగెను.

శ్లో॥ సర్వపాపాని వేంప్రాహుః కటస్తద్దాహ ఉచ్యతే ।
తస్మాద్వేంకటశైలోఽయం లోకేవిఖ్యాతకీర్తిమాన్ ॥

ఈ వేంకటాచలమును సేవించువారలకు వేలాది గంగాయాత్రలను జేయువారలకు గలుగు ఫలములు గలుగును. ఈ కథను వినువారలు సకల శ్రేయములను బడయుదురు. ఇవ్విధమున నీ పర్వతము కలియుగములో వేంకటాచలమను సార్థక నామమును బడసెను.

# వైకుంఠమును వదలి శ్రీమన్నారాయణుడు వేంకటాచలమున కేతెంచుట

ఇట్టి పవిత్రమగు వేంకటాచలమును కనులార కనులపండువోయన గాంచి శ్రీమన్నారాయణుడు వేంకటాచలము నధిష్ఠింప నారంభించెను. ఈ కొండపై నందందు దిరుగుచు వైకుంఠములోని యానందమును మించిన పరమానందమును బొందెను. శ్రీమన్నారాయణుడు వేంకటాచలమున గలయదిరిగియు నెందును నిలువ నీడ దొరకమి తుదకు శ్రీ స్వామిపుష్కరిణికిచెంత జేరెను. ఈ పుష్కరిణీ తీరమున విశ్రమించు నెడ నీ పుష్కరిణికి దక్షిణపుదెస నొక చింతచెట్టును జూచెను. ఆ చెట్టు నీడలో నొక పుట్టను గనుగొనెను. శ్రీ వేంకటేశ్వరుడు ఆ పుట్టనుజూచి యీ పుట్టలో నుండదగునని యెంచి యందు ప్రవేశించెను. ఇవ్విధమున శ్రీ వేంకటేశ్వరుడు పుట్టలో లీనుడై యుండ కాలము మాత్రము సాగిపోవు చుండెను. ఇట్లు కాలచక్రము విధి విరామములేక సాగిపోవుచుండ పదివేల సంవత్సరములు గడచెను.

# వసునామక నిషాద చరితము

వసువను కిరాతుడొకడు చిత్రవతియను భార్యతో వేంకటాచలమున నివసించుచుండెను. ఆతడు నిత్యము శ్యామాక ధాన్యమును సేకరించి దంచి తన భార్యకిచ్చుచుండెను. ఆమె ఆ బియ్యమును వంటజేయ కిరాతుడు తానడవికిబోయి పట్టుదేనెను దెచ్చి ఆ యన్నమును తేనెతో మిశ్రితముజేసి దేవదేవునకు నివేదించి యారగించుచుండెను. పతి భుక్తాన్నమును చిత్రవతి భుజించుచుండెను. ఇట్లుండ గొంతకాలమునకు చిత్రవతి గర్భమునుదాల్చి పదియవమాసమున సువీరుడను సుతుని గనెను. కొంత కాలమునకీ సుతుడు పెరిగి పెద్దవాడాయెను. ఒకనాడు కిరాతుడు చిత్రవతిని వంటజేయ నియమించి పట్టుదేనెకై తా నడవికి బోయెను. వసువు తిరిగివచ్చునంతలో సువీరుడు పక్వాన్నమును తాము నివసించు చెట్టుక్రింద నున్న దేవదేవునకు నివేదించి యారగించెను. అంతలో వసువు తేనెను

గొనివచ్చి పక్వాన్నమును సుతుడు భక్షించెనని తెలిసి క్రుద్ధుడై సుతునిపై గర్జించి కోపతాపము నాపజాలక సుతునిశిరము ద్రుంతునని ఖడ్గమును చేత బట్టెను. అంత దేవదేవుడును సువీరునిగావ నాచెట్టుచెంత నావిర్భవించెను. సుతుని శిరమును ద్రుంప కరవాలమును చేబూనిన కిరాతుని కరమును మెదలనీయక పట్టుబట్టెను. కిరాతుడు చేయిబట్టినవాని జాడలరయ వెను దిరిగి భగవల్లక్షణ లక్షితుడగు దేవదేవునిజూచి తెల్లబోయెను. దేవదేవుడు ఆ కిరాతునిజూచి సువీరుడు తన కత్యంత భక్తుడనియు గావున నతనిని గావ నేతెంచితిననియు జెప్పెను.

# రంగదాస చరితము

పూర్వము ఒకప్పుడు పాండ్యదేశములో రంగదాసుడను శూద్రు డొక్కడుండెను. ఇతడు బాల్యమునుండియు దైవభక్తుడు. ఇతడు పది రెండుసంవత్సరముల ప్రాయమువాడయ్యుసు భక్తిభరితుడై తీర్థయాత్రలను జేయుచు నారాయణపురమునకు వచ్చెను. సువర్ణముఖరీ నదిలో మునిగి చుట్టుప్రక్కల తీర్థములను సేవించుచు దేవదేవుడు వేంకటాచలమునగల డని విని గోపీనాధుడను వైఖానసునితో వేంకటాచలమునకు బోయెను. వేంకటాచలమందలి స్వామిపుష్కరిణిలో మునిగి లేచునంత దేవదేవుడు గరుడాకారమున ప్రత్యక్షమయ్యెను. రంగదాసుడు ఇట్టి దేవదేవుని బూజింప నొక్క పూదోటనుబెంప నుద్దేశించెను. అంతలో దేవదేవుడు స్వామిపుష్కరిణీ తీరమందలి చింత సంపంగి చెట్లను రెంటినిమాత్రము విడిచి చుట్టుప్రక్కలగల వనమును ఛేదించి పూదోటను నిర్మింప రంగ దాసున కాజ్ఞాపించెను. ఈచింతచెట్టు దేవదేవు నాలయమనియు సంపంగి చెట్టు రమాలయమనియు దేవదేవుడు బలికెను. రంగదాసుడు దేవుని యానతిచొప్పున స్వామి పుష్కరిణీ తీరమందలి చింతచెట్టును సంపంగి చెట్టునుమాత్రము విడచి స్వామి పుష్కరిణీ పరిసరమునగల వనమును ఛేదించి రమ్యమగు పూదోటనొక్కదానిని బెంప నారంభించెను. పూదోట చుట్టును శిలాప్రాకారమును నిర్మించెను. పూదోటను బెంచుటకై విశాల మగు నూతి నొక్కదానిని త్రవ్వించెను. దీనిని పూలబావి యందురు. దేవాలయముయొక్క ప్రథమప్రాకారములోని ధ్వజస్తంభమునకు ఉత్తరపు

దెస నీ బావి గలదు. దీని నిపుడు గప్పివుచ్చిరి. రంగదాసుడీ పూదోట లోని పూలతో స్వయముగ మాలలనుగ్రుచ్చి గోపీనాధున కిచ్చుచుండెను. గోపీనాధుడు రంగదాసుడు గూర్చితెచ్చిన పూలమాలలను స్వామి కలంకారము గావించుచుండెను. ఇవ్విధమున స్వామిసేవలు సలుపుచుండ రంగదాసునకు డెబ్బది సంవత్సరములు నిండెను. రంగదాసుడొక్కనాడు పూదోటలో బూలను గోయుచుండెను. అట్టి తరుణమున గంధర్వుడొక్కడాకసమున తరుణులతోవచ్చి విమానము నాకసమున విడిచి స్వామి తీర్థములో తరుణులతో జలక్రీడలు సలుప నారంభించెను. మనోహరములగు రూప లావణ్యములతో గనులు మిఱుమిట్లుగొలుపజాలు తరుణులతో జలక్రీడలు సలుపు ముచ్చటనుజూచి రంగదాసుడు పూలనుగోయుట మఱచెను. జితేంద్రియుడయ్యును చపలచిత్తుడాయెను. రంగదాసుడట్లు మైమఱచి చూచుచుండ గంధర్వుడు కాంతలతో తీరమునకువచ్చి వలువలనుదాల్చి విమానారూఢుడై నిజ నగరమునకుబోయెను. గంధర్వుడు వెడలినపిమ్మట రంగదాసుడు లజ్జితుడై తన చేతులలోని పూలను బరిత్యజించి సరోవరమున మునిగి మఱల పరిశుభ్రముగా బూలనుగోసి గోపీనాధుని చెంతకేగెను. గోపీనాధుడు రంగదాసునిజూచి కాలాతిక్రమణమేల గావించితివని యడిగెను. రంగదాసుడు నిజ వృత్తాంతమును జెప్పనేరక తలవంచి యుండెను. అంతలో దేవదేవుడు రంగదాసునిజూచి యిట్లనెను. ఓ రంగదాసా! లజ్జింపనేల? నా మాయచే నీవు మోహితుడవైతివి. నీవింకను కామములను జయింపలేదు. నీవు సరోవరమున జలక్రీడలు సలిపిన గంధర్వునివలె ముందుముందు మహారాజువై రాజ్యమును బాలింపుచు చిరకాలము దివ్యభోగముల ననుభవింతువు; నీతనివిదీర నాకు గోపుర ప్రాకార మంటపాదులను గట్టింతువు; పిమ్మట నా పరమపదమును జేరుదువు అని పలుకుచు దేవదేవుడు అంతర్ధానము నొందెను. రంగదాసుడివ్విధమున దేవదేవు నాశీర్వచనములనుబొంది నూఱు సంవత్సరములు దేవదేవుని సేవించుచు జీవించెను.

ఇప్పట్టున శ్రీమన్నారాయణుడు లక్ష్మీ వియోగమును భరింపలేక భూమండలమునకుబోయి వేంకటాచలమందలి చింతచెట్టు నీడలోగల పుట్టలో డాగి నిరాహారుడై యుండెనని చతుర్ముఖుడు కనుగొనెను. చతు

ర్ముఖుడు రమాదేవిని, మహాదేవుని రప్పించి వారలకు శ్రీమన్నారాయ ణుని స్థితిగతుల నెఱింగించి శ్రీమన్నారాయణుని శ్రీ వేంకటాచలముపై సేవింప దాను ధేనురూపమును దాల్చెదననెను. మహాదేవుని వత్సరూప మును దాల్పమనెను. అంతలో రమాదేవి తాను గొల్లపడుచు వేసమును దాల్చి ఆ యావును దూడను దక్షిణాపథమున రాజ్యమును బాలించు చోళ రాజునకు విక్రయము గావింతుననెను. అంత చతుర్ముఖ మహాదేవు లిరు వురు గో రూపమును, గోవత్స రూపమును దాల్చిరి. రమాదేవియు గొల్ల భామ వేసముతో నా రెంటిని దోలుకొనిపోయి చోళరాజునకు అమ్మ జూపెను. ఆవు దూడల రూపురేఖల కచ్చెరువొంది చోళరాజు గొల్లభామ చెప్పిన మూల్యమునిచ్చి ఆవును దూడను గొనెను. ఈ యావు పాలతో తన పసిబిడ్డను బెంప నాజ్ఞాపించెను. చోళరాజ సంస్థానములోని గోపా లురు యీ క్రొత్త యావునుగూడ వేలాది యావులతో మందలో గలిపి నిత్యము వేంకటాచలమున మేతకు దోలుకొని పోవుచుండిరి. ఈ యావు మాత్రము మందతోబాటు నిలబడి మేత మేయక ధరాతలమును ముట్టెతో పసిగట్టిచూచుచు రమానాధుని జాడల నందందు వెదకజొచ్చెను. ఇట్లు కొంతకాలము వెదకివెదకి వేసారి తుదకొక్కనాడు స్వామి పుష్కరిణీ తీరమునకు దక్షిణపుదెసగల చింతచెట్టు నీడలో వల్మీక గర్భమున డాగి యున్న రమానాధుని జాడలను పసిగట్టి పరమానందమును బొందెను. ఈ వల్మీకమునకు పాలధారలతో నభిషేకమును గావించెను. ఈనాటి నుండియు నిత్యము నీ యావు వేంకటాచలమున మేతకై వచ్చి శ్రీ వేంక టేశ్వరునకు క్షీరముతో నభిషేకమును గావించుచుండెను. నాటినుండియు నృపాలుని గోశాలలో నీ యావు పాలను బిదుకుటలేదు. ఒకప్పుడు చోళరాజ సతీమణి గోపాలుని బిలచి యావుపాల నేమిచేయుచుంటివి? నీవు త్రాగుచుంటివా? అమ్ముకొనుచుంటివా? యని మందలించెను. గోపా లుడు భయపడి తానీ విషయము నెంతమాత్రము నెఱుగననెను. అంత చోళరాజ సతీమణి మిక్కిలి క్రుద్ధురాలై గోపాలుని కొరడాలతో గొట్టిం చెను. గోపాలుడిందులకు కడు విసువుజెంది యానాడు యథాప్రకారము ఆలమందను వేంకటాచలమునకు దోలికొనిపోయి యీయావునుమాత్రము ఒక కంట గనిపెట్టియుండెను. ముందువలె నీ యావు ఆలమంద నొక వంక విడచి స్వామి పుష్కరిణీ తీరమందలి చింతచెట్టు నీడకు బోయెను.

గోపాలుడు కడుజాగరూకతతో గనుపెట్టి యుండెను. ఆవు తన పొదుగును పుట్టపై నమర్చి పాలధారలనుగార్చ నారంభించెను. ఈ విచిత్రమును కనులారగాంచిన గోపాలునకు బట్టరాని కోపము బుట్టెను. క్రోధవశమున మానవులు చేయరాని పనులుండవు. ఈ యావు తన పాలను ఈ తీరున బుట్టపై బోయుచుండుటచే తాను రాజసతీమణి గొట్టించిన దెబ్బలకు పాలు గావలసివచ్చెనని మిక్కిలి గోపించి యీ గోవును బరిమార్ప నెంచెను. తన గండ్ర గొడ్డలిపై జేయివైచెను. గండ్రగొడ్డలిని చేయెత్తున బైకెత్తి యొక్కపెట్టున ఆవుమెడపై గొట్ట నుద్యమించెను.

కాని మహాభక్తుల యాపదలను బరమేశ్వరుడు సహింపనోపడు. నిత్యము తులసీదళముతోనైనను బరమేశ్వరుని బూజించునాతని యాపదలను సయితము పరమేశ్వరుడు సహింపజాలడు. ఈ యావు నిత్యము తనకు క్షీరధారలచే నభిషేకమును గావించుచుండెను. ఇట్టి యావు మృతిని బరమేశ్వరు డెట్టులోర్చును? వల్మీక గర్భమునుండి వేంకటేశ్వరుడు చివ్వున బైకిలేచెను. గోపాలుడు విసరిన గండ్రగొడ్డలి శ్రీవేంకటేశ్వరుని తలపై బడెను. ఆ గొడ్డలిపెట్టుకు శ్రీ వేంకటేశ్వరుని తల పగిలి సప్తతాళ ప్రమాణమున రక్తము ప్రవహింపసాగెను. ఇట్టి భయోత్పాతమును గాంచిన గోపాలుడు వెంటనే నేలబడి మృతిజెందెను.

## గోపాలుని జూచుటకు చోళరాజు వేంకటాచలమునకు వచ్చుట

అంతట నీ యావు వేంకటాచలమును దిగి రాజ సంస్థానమునకు బోయెను. రాజునెదుట దూడలేని యావువలె విలపింపసాగెను. ఈ వింతనుజూచి రాజు యీ యావు మందను తప్పిపోయెనని తలచి సేవకుని బిలచి యీ యావును వేంకటాచలమున మేతకై పోయిన మందలో గలుపనాజ్ఞాపించెను. ఆ సేవకుడీ యావుతో వేంకటాచలమునకు బోవ నీ యావు స్వామిపుష్కరిణీ తీరమందలి చింతచెట్టునీడలోగల వల్మీకమునొద్దకు బోయెను. అచ్చోట నీ సేవకుడు గోపాలుని మృతకళేబరమును, సప్తతాళ ప్రమాణముతో బ్రవహించిన ఘోరమగు రక్తవర్షమును దిలకించి

సంభ్రమాశ్చర్యము లుప్పొంగ నొక్కుమ్మడి రాజునొద్దకుబోయి తాను చూచిన విచిత్రమును దెలిపెను. చోళరాజు రక్తపాతమనుమాటను విని ఆశ్చర్యచకితుడై పల్లకినెక్కి వేంకటాచలమునకు బోయెను. స్వామి పుష్కరిణికి దక్షిణపుదెసనుండు చింతచెట్టు నీడలోగల వల్మీక ప్రాంతమును బరికించి యిట్టి ఘోరకృత్యమునుగావించిన మహాపాపి యెవ్వడై యుండునని బిగ్గరగ ననెను.

## శ్రీ వేంకటేశ్వరుడు చోళరాజును శపించుట

చోళరాజు పలుకు లాలించి వల్మీక గర్భమునుండి శ్రీ వేంకటేశ్వరుడు పైకి లేచెను. ఇతని కన్నులు కన్నీటితోడను, రక్తముతోడను నిండియుండెను. ఇట్టి వేంకటేశ్వరుడు చోళరాజునుజూచి డగ్గుత్తికతో నిట్లనెను. ఓ దురాచారా! ఓపాపీ! ఓ రాజ్యమదోద్రిక్తుడా! నేను అనాథుడను, దరిద్రుడను, భక్తహీనుడను, నిలువ నీడలేనివాడను, తలిదండ్రులు లేనివాడను, భార్యా బంధు వివర్జితుడను, అన్నదమ్ములు లేనివాడను. ఇట్టి నన్ను గండ్రగొడ్డలితో గొట్టింతువా? నీ గోపాలుని గొడ్డలిపెట్టుచే నాకు జెప్పరాని దుఃఖము, బాధయు గలిగెను. తల పగిలెను. నీ గోపాలుడు కఠోరుడు. సేవకులు, దారాపుత్త్రాదులుచేయు తప్పిదములను చక్కదిద్దని యజమానుడు ఆ పాపఫలితములను తాననుభవించును. ఓ దుర్బుద్ధీ! నాకిట్టి కష్టమును దెచ్చిపెట్టుటచే నీవు పిశాచరూపమును బొందుము అని వేంకటేశ్వరుడు చోళరాజును శపించెను. ఈ శాపమును విని రాజు మూర్ఛిల్లి కొంత తడవునకు మూర్ఛదేఱి జగదీశ్వరుడగు శ్రీ వేంకటేశ్వరునితో నిట్లనెను. ఓ దేవా! నే నిసుమంతయు గోపాలుడు నిన్ను గొట్టబూనుట నెఱుగను. నేను చేసిన మంచిచెడ్డలను విమర్శింపక నిరపరాధినగు నన్ను శపింపనేల? ఇట్టి మహాకష్టమును నాకేల దెచ్చిపెట్టితివి? అని పలుకుచు చోళరాజు కనికరముపుట్టురీతి శ్రీ వేంకటేశ్వరుని బ్రతిమాలెను. చోళరాజు పలుకులు విని వేంకటేశ్వరుడు మిక్కిలి దుఃఖించి శాపగ్రస్తుడగు చోళరాజుతో నిట్లనెను. నేను దుఃఖాక్రాంతుడనై శపించితిని. ఎట్లయ్యును నా శాపము వ్యర్థము కాజాలదు. భక్తుడవగు నిన్ను శపించుటచే కలియుగాంత పర్యంతము నేనును దుఃఖాక్రాంతుడనై

యుందును. మన మిరువురము యిట్లు దుఃఖాక్రాంతులమైయుండ ముందు ముందు చోళవంశమున నీవు ఆకాశరాజు అను పేర బుట్టెదవు. అప్పట్టున నీవు నీ పద్మావతియను కన్నియను నాకిచ్చి పాణిగ్రహణము జేయింతువు. కన్యాదాన సమయములో వజ్రములను, రత్నములను బొదిగిన మిక్కిలి యమూల్యమగు కిరీటమును నాకు వరకట్నముగ నిచ్చెదవు. అద్దానిని నేను శుక్రవారమునాటి సాయంకాలమున ధరింతును. అప్పట్టున కన్నీటితో నా కన్నులు నిండియుండును. అప్పట్టున నాఘడియలుమాత్రము నీవు పిశాచరూపమును వీడియుందువు; పొమ్ము. అని శ్రీ వేంకటేశ్వరుడు అంతర్ధానము నొందెను.

ఇవ్విధమున శ్రీ వేంకటేశ్వరుడు చోళరాజునుబంపి గొడ్డలిపెట్టుచే గలిగిన వ్రణమును మాన్పదగు యౌషధమును దెలియగోరి సురగురువును మనసులో దలపోసెను. అంతలో సురగురువు శ్రీ వేంకటేశ్వరునెదుట బ్రత్యక్షమై జిల్లేడుప్రత్తిని మేడిపాలతో దడిపి వ్రణముపై బట్టువేయుమని చెప్పి యంతర్ధానము నొందెను.

## పద్మావతీ పరిణయోపోద్ఘాతము

శ్రీ వేంకటేశ్వరుడు గురువుచెప్పిన చొప్పున దినదినమును జిల్లేడు ప్రత్తిని మేడిపాలతో దడిపి వ్రణముపై బట్టువేయుచుండెను. ఒక్కనాటి యరుణోదయకాలమున శ్రీ వేంకటేశ్వరుడు తన పుట్టలోనుండి పైకివచ్చి మేడిపాలకై బయలుదేఱెను. అప్పట్టున వేంకటాచల నివాసియగు వరాహస్వామి వేంకటాచలమున వేటాడి మరలివచ్చుచు పుట్టనుండి పైకిరాబోవు వేంకటేశ్వరుని జూచెను. ఆదివరాహమూర్తి తన నివాసమగు వేంకటాచలమున తన యెఱుకలేక పుట్టలో నివసించునాతని పుట్టుపూర్వోత్తరముల నరయగోరి పుట్టచెంతకేతెంచెను. అంతలో నాది వరాహమూర్తిని వెంబడించియున్న సూకరములు ఎవ్వడవు? నీ వెవ్వడవు? అని గర్జించుచు పుట్టను జుట్టుముట్టెను. ఈ కల్లోలమునుజూచి వేంకటేశ్వరుడు పుట్టనుండి పైకివచ్చుటకు వెఱచి పుట్టలో లీనుడై యుండెను. అంతట నాదివరాహమూర్తి పుట్టనున్న దేవుని వైకుంఠమునుండి వచ్చిన శ్రీమన్నారాయణు

నిగా నెఱిగి పుట్టదరిజేరి పలుకరించెను. పుట్టలోనుండు శ్రీవేంకటేశ్వరుడు తన్ను బలుకరించునాతని నాదివరాహమూర్తిగా గ్రహించి పుట్ట నుండి పైకివచ్చెను. వీరిరువురును బరస్పరము గుశలముల నడుగ జొచ్చిరి.

# వరాహస్వామి వేంకటేశ్వరునకు నివేశనము నిచ్చుట

వైకుంఠమును వీడి భూమండలమునకు రాగతంబేమని వరాహస్వామి శ్రీ వేంకటేశ్వరు నడిగెను. అంతట శ్రీ వేంకటేశ్వరుడు తన వృత్తాంతము నిట్లు వరాహస్వామికి జెప్పదొడగెను. ఓ వరాహమూర్తీ! భృగుమహాముని నా వక్షమున దన్నుటచే గోపించి లక్ష్మీదేవి నన్నువీడి కొల్హాపురమునకు జనెను. ఆడుదిలేనియింట మగవాని కాపురము చెప్ప రాని ముప్పునకు జేటుకదా! ఆముప్పును భరింపనేరక నేను వైకుంఠమును వీడి యీ వేంకటాచలమునకు వచ్చితిని. ఈ చింతచెట్టునీడలో గల యీ పుట్టలో నొరులకంటబడకుండ నివసించుచుంటిని. ఇట్టులుండ నన్నొక గొల్లవాడు గండ్రగొడ్డలితో తలపై గొట్టెను. వ్రణముపై బట్టువేయుటకై నేను ఔషధము గొనిరాబోవుచుంటిని. దైవవశమున నేను నీ కంట బడితిని. కలియుగాంతపర్యంతము నేనిందు నివసింపదలచితిని. కావున నాకీ వేంకటాచలమున నివసింపదగిన నివేశనము నిప్పింప బ్రార్థింతు ననెను. ఆ పలుకులు విని వరాహస్వామి శ్రీ వేంకటేశ్వరునకు నివేశనమును ఉచితముగ నీయజాలననెను. క్రయమునిచ్చి గైకొమ్మ అనెను. అంత వేంకటేశ్వరుడు వరాహమూర్తినిజూచి యిట్లనెను. ఓ వరాహమూర్తీ! నేనిపుడు లక్ష్మీవిరహితుడను. కావున నిరుపేదను. నన్ననుగ్రహింపుము. నేను వేంకటాచలముపై నివసించుచున్నను నీకు ప్రథమ దర్శనమును, నైవేద్యమును జేయింపగలను. పిమ్మటనే నేను దర్శన నివేదనాదుల నందుకొందును. దీనినే ద్రవ్యముగదలచి నాకు నివేశనము నిప్పింపుము. ఓ కరుణానిధీ! లక్ష్మి నన్ను వీడినదాది నేను నిర్ధనుడనైతిని. కావున నన్ననుగ్రహించి నిలువనీడ నిప్పింపుమని పలువిధముల బ్రతిమాలెను. ఇవ్విధమున బ్రతిమాలు వేంకటేశ్వరునిపై నాది వరాహ

మూర్తి కనికరమునుజూపి నూఱు అడుగుల నివేశనమును శ్రీ వేంకటే శ్వరున కిచ్చెను. ఆనాటినుండియు వీరిరువురు మిత్రభావముతో వేంకటా చలమున మెలగుచుండిరి. ఇంతియకాక నాటినుండియు వరాహస్వామి తనకు వంటచేయు వకుళాదేవిని సయితము వేంకటేశ్వరుని సేవలకై నియమించి పంపెను. ప్రతినిత్యము శ్యామాకాన్నమును తేనెను శ్రీ వేంకటేశ్వరునకు బంపుచుండెను. ఈ వకుళాదేవి వేంకటేశ్వరునకు నిత్యము ఆహారమును వడ్డించుట, పాదములనొత్తుట మున్నగు సకల శుశ్రూషలను సలుపుచుండెను. వ్రణమునుమాన్పు నౌషధములతో వ్రణ చికిత్సను జేయుచుండెను. సకల శుశ్రూషలను సలుపుచు వేంకటేశ్వరుని భక్తితో గొలుచుచుండెను.

# ఆకాశరాజ, తొండమానుల చరితము

పూర్వము ద్వాపరాంతమున బాండవులు మహాభారత సంగ్రామ మున మడిసినపిమ్మట కలియుగ ప్రారంభమాయెను. ఇక్కాలమున విక్ర మార్కుడు మున్నగు చక్రవర్తులు భూమండలమును స్వర్గమునుబోలె బాలించి కాలానుగుణముగ దివంగతు లయిరి. ఇత్తెఱగున వేలాది సంవ త్సరములు కాలచక్రము నిలుకడలేక సాగిపోవుచుండెను. అప్పట్టున చంద్రవంశమునబుట్టిన సువీరుడనురాజు రాజ్యమును బాలింప నారం భించెను. సువీరునకు సుధర్ముడను పుత్త్రుడు కలిగెను. సుధర్మునకు ఆకాశ తొండమానులను నిరువురు పుత్త్రులు కలిగిరి.

పూర్వము చోళరాజులు దక్షిణాపథమున భరతఖండము నేలు చుండిరి. ఇట్టి చోళరాజులలో సుధర్ముడనునాతడు సతీసమేతుడై మిక్కిలి యశోవంతుడై యుండెను. ఇటులుండ గొంతకాలమునకు సుధర్ముని సతీమణి గర్భమునుదాల్చి పదియవమాసమున రాజలక్షణ లక్షితుడగు పుత్త్రరత్నమును బ్రసవించెను. ఈ బాలుడు పుట్టినదాది శుక్లపక్ష చంద్రుని వలె దినదినప్రవర్ధమాను డగుచు, జననీ జనకులను ఆనంద తరంగముల నోలలాడించుచుండెను. ఇట్టి తరుణములో నొక్కనాడు సుధర్ముడు మృగయాభిలాషతో వేటకాండ్రను వెంటబెట్టుకొని వనముల కేగెను. అర ణ్యములలో దిరిగితిరిగి వన్యమృగముల నెందుగానక వేంకటాచల

మందలి యరణ్యములకు బోయెను. ఈ యరణ్యములు గజ సింహ శరభ శార్దూలాదులతో నిండియుండెను. సుధర్ముడు యీ యరణ్యమున తనివిదీర వేటాడుచు నిజపరివారముతో గొన్నిదినము లందే నివసించెను. ఒకనాడు యథేచ్ఛముగా వేటాడి యలసి దప్పిగొని నీటికై వెదక నారంభించెను. వెదకివెదకి వేసారి తుదకు తిరుపతికొండకు దిగువనగల కపిల తీర్థముచెంత జేరెను. సుధర్ముడు కపిలతీర్థమందలి జలమును తనివిదీర త్రావి సేదదీర్చుకొనుచుండెను. అప్పట్టున కపిలతీర్థమునకు బశ్చిమదెస యందలి బిలముఖమునుండి కనులు మిఱుమిట్లుగొలుపు దివ్యకాంతితో నొప్పు కన్యారత్న మొకర్తు వెలువడివచ్చి కపిలతీర్థములో జలకమాడ జొచ్చెను. ఆమె సౌందర్యమునుజూచి సుధర్ముడు మోహపరవశుడై యామె దరిజేరి తన మనోభీష్టమును వెల్లడించెను. అందుల కామె తాను ధనంజయుడను నాగరాజుయొక్క పుత్రిననియు, ధనంజయుడు తన్ను విద్యాగుణసౌందర్యాదులతోనొప్పు నొకరాజునకీయదలచెననియు జెప్పెను. అందులకు సుధర్ముడు మిక్కిలి సంతసించి తాను సుధర్ముడను రాజునని యామెకు వెల్లడించెను. కాని నాగకన్నియమాత్రము అంతమాత్రమున తృప్తిజెందక తన గర్భమునబుట్టునాతనికి రాజ్యాధికారమొసగినచో నంగీకరింతుననెను. సుధర్ముడు పరమానందభరితుడై తనచేతివ్రేలి యుంగరమునుదీసి యానవాలుగ నాగకన్నియ వ్రేలికమర్చి నాగకన్నియకు బుట్టు పుత్త్రునకు రాజ్యమునీయగలనని ప్రతినజేసి గాంధర్వ విధి నామెను జేపట్టెను. సుధర్ముడు యివ్విధమున నాగకన్నియను గాంధర్వ విధానమున జేపట్టి మృగయా వినోదములను బూర్తిగావించి నిజనగరమునకు బోయెను.

నాగకన్నియ కపిలతీర్థమున జలకమాడి నిజలోకమునకుబోయెను. నాగరాజు తనపుత్రి చరితము నాలకించి మిక్కిలి సంతసించెను. కాలక్రమమున పదిమాసములునిండ నాగకన్నియ చక్రవర్తి లక్షణములతోగూడిన బాలుని గనెను. ఇట్టి తరుణమున దేవత లాకసమునుండి పూలను గురిపించిరి. నాగలోకవాసులు ఈ బాలుని దివ్యకళల కచ్చెరువొందిరి. నాగరాజు సయితము పరమానంద భరితుడై సుధర్మునకు శుభవార్త నంపెను. సుధర్ముడు యీ శుభవార్తకు మిక్కిలి సంతసించి నిజపరివారముతో నాగలోకమునకు జనెను. పరివార సమేతు డగు సుధర్ముని నాగరాజు బహు

మర్యాదలతో నాదరించెను. సుధర్ముడు ముద్దుబిడ్డను ముదమారజూచి శిరము మూర్కొనుచు చేతనెత్తి పలుతెరగుల ముద్దులాడెను. ఇప్పట్టున నాగకన్నియ సుధర్ముడు తనకు గావించిన వాగ్దానమును జ్ఞప్తికి దెచ్చెను. అంతలో సుధర్ముడు తనకు బెద్దకుమారుడుండుటచే నీతడు రాజుకాజాలడని ప్రత్యుత్తరమిచ్చెను. నాగకన్నియ చింతాక్రాంతురాలాయెను. నాగరాజు సయితము దుర్భర దుఃఖముతో క్రుంగిపోయెను. వీరిరువురును ముద్దు బిడ్డకు రాజ్యాధికారము నొసగుమని సుధర్ముని వేనోళ్ల వేడిరి. కాని సుధర్ముడు నిరాకరించెను. ఈ బిడ్డడు రాజగుట మిక్కిలి దుస్సాధ్య మనెను. సముద్రమునబడినవాడు సముద్రమునుదాటి దరిజేరునంతటి దుస్సాధ్యమనెను. ఈ పలుకులు ములుకులవలె నాగకన్నియకును, నాగ రాజునకును దోచెను. సుధర్మునిపలుకులాలించిన నాగలోకవాసులెల్లరు నిశ్చేష్టులయిరి. నాగకన్నియ నాగరాజులిరువురు మిక్కిలి చింతించి బిడ్డను సముద్రములో బడవేయుమని సుధర్మునితో జెప్పిరి. అంతట సుధర్ముడు పట్టణమును బాలింపరానివాడెందుండిన నేమియని పలుకుచు అందందు చెట్లపైప్రాకు ఆదొండతీగెను బిడ్డకు గుఱుతుగజుట్టి సముద్ర ములో బడవేయ భటుల నాజ్ఞాపించెను. రాజ్యార్హుడై సముద్రగర్భము నుండి బ్రతికి బయటబడిన నర్ధరాజ్యమిత్తుననెను. భటులు చేయునదిలేక రాజునాజ్ఞ శిరసావహించి మూడుమాసముల పసికూనకు ఆదొండతీగెను గుఱుతుగజుట్టి సముద్రమధ్యమున విడిచిరి.

పాపము! మూడుమాసముల ప్రాయముగల పసికూన సముద్ర గర్భమున మడియునేకాని మడియక బ్రతికి బయటబడుటెట్లు? ఈ వృత్తాంతమును కని వినినవారలలో ముద్దుబిడ్డని యాయువు దీరెనని నమ్మి కంట తడిపెట్టనివారులేరు. ముద్దుబిడ్డడు సముద్రములో బడెను. నాగ కన్నియ నాగరాజు లిరువురు దుఃఖసముద్రములో బడిరి. సుధర్ముడు చింతాక్రాంతుడయ్యును నిజనగరమునకుబోయి రాజ్య పరిపాలనా సముద్ర ములో బడెను. ఏయొక్కరు నీబిడ్డగతిని జింతింపరైరి. ఈ బిడ్డడు తొలి జన్మమునజేసిన పుణ్యములెట్టివో? పూర్వజన్మమున దేవుని వేవిధముల బూజించియుండును. అట్టి పరమేశ్వరుడొక్కడు కటాక్షించుచుండ బరులు కటాక్షింపనేల? పరమేశ్వరుడు కటాక్షింపకున్న బరులు కటాక్షించియు

ప్రయోజనమేమి? ఈ ముద్దుబిడ్డపై బరమేశ్వర కటాక్షము పరిపూర్ణముగ బ్రసరించియుండును. కాకున్న మహాప్రళయ సముద్రములో వటపత్రమున దేలు శ్రీమన్నారాయణునిబోలె నీ ముద్దుబిడ్డడు మహాసముద్ర తరంగములలో నిట్టటు దేలియాడుటెట్లు? పరమేశ్వర కటాక్షమును చూఱగొనునాతనికి పరులు సయితము సహాయపడుట సమంజసము. కావున వాయుదేవుడు సయితము యీ పసికూన దరిజేరుతెఱగున వీచుచుండెను. కావున ముద్దుబిడ్డడు త్వరలో సముద్రపుటొడ్డుజేరెను. ఈ పసికూన మరుసటి నాడు చేపలవేటకై సముద్రతీరమునకుబోయిన పల్లెవారలకంటబడెను. పల్లెవారలు ఆదొండతీగెతో జుట్టిన పసిబిడ్డను రాజపుత్త్రునిగ గుర్తించి నాగరాజునకును, సుధర్మునకును ఈ వార్తను దెలియజేసిరి. ఇట్టివార్త నేయొక్కరు నమ్మజాలకుండిరి. సుధర్ముడు పల్లకినెక్కి పరివారముతో సముద్రపుటొడ్డునకు బయలుదేరెను. ఇట్లే నాగకన్నియ నాగరాజులు సయితమేతెంచిరి. సముద్రపుటొడ్డున ఆదొండతీగె జుట్టిన బిడ్డను జూచిరి. శోకానందములొక్కుమ్మడి జుట్టుముట్ట నాగకన్నియసుధర్ములా బిడ్డనెత్తి ముద్దులాడిరి. బిడ్డడు పెరిగి పెద్దవాడై తనచెంతకువచ్చిన నర్ధరాజ్యమునిత్తునని నాగకన్నియతోజెప్పి సుధర్ముడు తన పట్టణమున కరిగెను. ఆదొండతీగెను గురుతుగాజుట్టుటచే నీ బాలునకు ఆదొండవానుడని పేరిడిరి. ఈ బాలుడు నాగలోకములో దినదినప్రవర్ధమానుడై శుక్లపక్ష చంద్రునివలె బెరుగుచుండెను. కాలక్రమమున నితడు పెరిగి పెద్దవాడై యొకప్పుడు తన జనకుండెవ్వరని తల్లి నడిగెను. తల్లి ఆదొండవానునకు సుధర్మరాజ చరితమును వెల్లడించెను. సుధర్ముడు తనకు పూర్వము గుఱుతుగా నొసగిన యుంగరమును ఆదొండవానునకిచ్చి సుధర్మునికడ కేగుమని దీవించి పంపెను. ఆదొండవానుడు పయనమైపోయి సుధర్మునిచెంతకేగి నిజనామధేయము నెఱింగించి యుంగరమును జూపెను. సుధర్ముడు మిక్కిలి సంతసించి తన రాజ్యమును రెండుగ జీల్చి జ్యేష్ఠ పుత్త్రుడగు నాకాశరాజున కొకభాగము నిచ్చి రెండవ భాగమును ఆదొండవానునకిచ్చెను. ఈ భాగమునకు తొండమండలమని పేరు. ఇట్టి తొండమండలమును బాలించుటచే నితడు తొండవానుడను పేరు బడసెననియు గొందఱందరు. సుధర్ముడు ఇవ్విధమున తనరాజ్యమును రెండుగజేసి యిరువురు సుతులకు బంచియిచ్చి తొండవానునకు కోట నొక్కదానిని

క్రొత్తగ గట్టించి యిచ్చెను. ఇద్దానిని యిపుడు పుదుక్కోటయందురనియు గొందఱి ఆశయము. పుదుక్కోటయనగ క్రొత్తకోట యని యర్థము.

## ఆకాశరాజు సంతతికై విలపించుట

ఆకాశ తొండమాను లిరువురు దమతమ సింహాసనముల నధిష్ఠించి తమతమ రాజ్యములను న్యాయ సమ్మతముగ బాలించుచుండిరి. ఆకాశ రాజు రాజ్యమును బాలించుచుండ గోవులు బహుక్షీరములయి యుండెను. కేదారములు సస్యశ్యామలములయి యుండెను. వేయేల; భూమండలము స్వర్గతుల్యమయి యుండెను. ఆకాశరాజున కేచింతయు లేదు. కాని సుతులులేరను చింతమాత్రము రాజును క్షణక్షణము బీడింపసాగెను. ఒకప్పుడు ఆకాశరాజు సంతతికై వగచివగచి చింతాక్రాంతుడై గురువును రావించి యిట్లనెను. ఓ గురూత్తమా: హస్త్యశ్వరథపదాతి సంకులమగు రాజ్యమును చిరకాల మనుభవించితిని. నానా దానములను గావించితిని. తీర్థయాత్రలను సలిపితిని. పితృదేవతల ఋణమునుండి విముక్తి నొందింప జాలు పుత్త్రుని బడయనైతిని. నేనెట్టి పాపముల నాచరించితిని? పూర్వ మెవ్వని పుత్త్రుని జంపితిని? ఎట్టిపాపముచే నాకు పుత్త్రోదయము కలుగ దాయెను? పుత్త్రుని ముఖపద్మమును కన్నులార జూడనైతిని. చెవుల కింపుగ పుత్త్రుని రోదనమును విననైతిని. ఓ మహాత్మా! పుత్త్రుని గన కున్న నా పితృదేవతలకు దుర్గతులు సంభవింపగలవు. వేదవేత్తలు అపుత్త్రునకు గతులు లేవని యందురు. బంగారు పాత్రలో బుత్త్రునితో పాయసాదుల నారగింపలేదు. జన్మాంతర పాపములచే బుత్త్రుని లాలింపలేదు. ప్రేమతో భూషణములను జేయించి పుత్త్రునలంకరింపలేదు. పుత్త్రులులేని నన్ను యమకింకరులు పాశములతోగట్టి యమసదనమునకు గొంపోవుదురు. నాకు పుత్త్రులులేరని వ్రాసిన చిత్రగుప్తుని వ్రాతలను నా పుత్త్రుడెన్నడు తుడిచిపెట్టును. ఓరీ! పుత్త్రహీనుడా! యను యముని మాటలు వినుచుండ నాకు సుఖమెట్లు గలుగును. నేను నా పితృదేవతల కును నాకును నరకమును సంపాదింపబుట్టిన మహాపాపిని. సుతులులేని కులమును, నీరులేని బావిని, భర్తలేని స్త్రీని సత్పురుషులు నిందింతురు. ఓ భూసురోత్తమా! నేనెందుబోవుదును? నాకేమిగతి? ఏ దేవుని శరణు

వేడి సంసార సాగరమును తరింతును ? బాలభావముచే నేడ్చు పుత్త్రుని ప్రేమతో లాలించు భాగ్యమెట్లు గలుగును ? చిఱుగంటలను బొమ్మలను బంతులను పండ్లను యిచ్చి నన్ను ఏనుగుమూపున గూర్చుండబెట్టి నాయనా! మేళతాళములతో గ్రామప్రదక్షిణమునుజేయించుచు నన్ను సభా స్థలికిగొంపొమ్మని మిక్కిలి యుత్సాహముతో ముద్దులొలుకు పలుకులతో నన్నుగోరు పుత్త్రుని కోరికలనెన్నడు వినిమన్నింపగలను ? అని పలుకుచు విలపించి విలపించి యాకాశరాజు స్పృహతప్పి మూర్ఛవోయెను. కొంత తడవునకు దెలివినొంది మరల గ్రిందివిధమున విలపింపదొడగెను.

సుతునకు నేను కవచమునెన్నడు చేయింతును? రత్నములుపొదిగిన కిరీటమును పుత్త్రుని శిరమున నేనెన్నడు అలంకరింతును ? ముద్దుల బిడ్డను తొడపై గూర్చుండబెట్టి యెప్పుడానందింతును ? ఓ భూసురోత్తమా! నేను సుతునిముఖమును గనలేదు. జాత కర్మమును జేయలేదు. సుతునకు విద్య గఱప నారంభింపలేదు. పెండ్లిజేయ సమకట్టలేదు. పుత్త్రుడు రాజ్యము నేలుచుండ సుఖింపలేదు. సుతునిపై రాజ్యభారమునిడి కులమర్యాదలను బాటించి తపోవనముల కేగలేదు. ఓ మహానుభావా ! పుత్త్రహీనుడనగు నాకు ఎట్టిగతి కలుగును ? నిష్ప్రయోజనమగు నా జన్మము పావనమగు సుధర్ముని కులమున వ్యర్థముగదా! పుణ్యశాలురుకానిమానవులకు బుత్త్రులు కలుగనేరరు. బహుపుణ్యములచే మానవులు పుత్త్రులను బడయుదురు. మహాపాపినగు నాకు బుత్రియు గలుగదాయెను. ఓ వరదా ! ఓ రంగేశా ! ఓ జగన్నాథా ! ఓ జగద్గురో! ఓ సుబ్రహ్మణ్యా! ఓ సురాధీశా! ఓరామ కృష్ణా ! నమోనమః. ఓ వేంకటేశా ! ఓ రమాకాంతా ! ఓ వరాహవదనా! ఓ అచ్యుతా ! ఓ నారాయణా ! ఓ కృపానిధే ! యనుగ్రహింపుము.

శ్లో॥ సుపుత్త్రవంతః ఖలుభాగ్యవంతోఽ
హ్యపుత్త్రవంతో భువిదుఃఖవంతః ।
సంసారసింధో స్తరణేఽస్మ్యశక్తః
కామేగతిః కర్మఫలాను భోగినః ॥

లోకములో సుపుత్త్రులుగలవారలు భాగ్యశాలురు; ధన్యులు; పుత్త్రులు లేనివారు మిక్కిలి దుఃఖవంతులు. పుత్త్రులులేని సంసారులు పున్నామ

నరకమున బడుదురు. నేనీ సంసారమును దాటజాలను. పూర్వజన్మ ములో జేసిన కర్మఫలముల ననుభవించు నాకేమిగతికానున్నదో! యని విలపించు నాకాశరాజు నోదార్చి గురువు సుతుని బడయుటకై యజ్ఞమును జేయుమనెను. భూసురోత్తముని పలుకులాలించి యాకాశ మహారాజు యజ్ఞము నాచరింప సమకట్టెను. ద్విజమంత్రిగణములతోనేగి యొక్క శుభముహూర్తమున బంగారు నాగళ్ళతో యజ్ఞభూమిని దున్నింప నారం భించెను. యజ్ఞభూమిని దున్నించుచుండ నాకాశరాజు సహస్ర పత్రమగు నొక్క కమలమును నాగటిచాలులో గాంచెను. ఇదియేమి చిత్రమనిచూడ నా కమలపత్రములలో శుభలక్షణములతోనొప్పుచు లక్ష్మీదేవినిబోలు నొక చక్కని చుక్క గన్పట్టెను. అక్కన్యనుగాంచి యాకాశరాజు పరమా నందభరితుడై శుభలక్షణములతో రమాదేవినిబోలు నీ కన్యను నాకు బర మేశ్వరుడు ప్రసాదించెను. దైవమాయ యేరికిగాని దురత్యయము గదా! ఈ బిడ్డ యెవ్వరై యుండునో! యనిచూచుచుండ నాకాశవాణి "ఈమె బహు పుణ్యాత్మురాలు, నీవు యీమెను సంరక్షింపుము" అనెను. ఆ పలు కులు విని యాకాశరాజు పరమానందమున మునిగితేలుచు నా కన్యారత్న మును తోడ్కొని చని నిజాంతఃపురమునకుబోయి ధరణీదేవితో నిట్లనెను. ప్రేయసీ! ఈ శుభలక్షణములతోనొప్పు ముద్దులొలుకు బిడ్డను జూడుము. దైవమీ బిడ్డను మనకు ప్రసాదించెను. కడుపార గన్నబిడ్డనుబోలె నీ బిడ్డను గాపాడుమని కన్యాలాభోదంతమును తెలియజెప్పెను. అర్థులకు సకలదానముల నొసగెను.

ఇక్కన్యారత్న మేతెంచుట శుభసూచకమోయన నాకాశరాజుభార్య గర్భమును దాల్చెను. క్రమక్రమముగ తొమ్మిది మాసములు నిండి పది యవ మాసము రానంత నొక్క శుభలగ్నమున రాచఠీవితోనొప్పు బాలుని గనెను. ఆకాశరాజు సతీసమేతుడై పరమానందము నొందెను. భూసురు లకు సకల దానములను జేసెను. పుత్రునకు వసుదాతయని పేరిడెను. పద్మగర్భమున దొఱికిన కన్యారత్నము పద్మముఖియై యుండుటచేతను, పద్మములో దొఱకుటచేతను, శుభలక్షణములతో లక్ష్మీదేవినిబోలియుండుట చేతను ఆ కన్నియకు బద్మావతియని పేరిడెను. ఈ బాలబాలిక లిరువురు

శుక్లపక్ష చంద్రుని పగిది దినదిన ప్రవర్ధమానులగుచుండిరి. బిడ్డలులేకున్న గావలెనను చింతయు, బిడ్డలు కలిగి పెరిగి పెద్దలుకానంత వారికి దగిన వరులుగావలెనను చింతయు లోకులకు సహజము. కావున పద్మావతి పెరిగి యుక్తవయస్కురాలుకానంత నామెకు తగిన వరుని జూడవలయునను చింతయు నాకాశరాజు నావరించెను.

ఇట్టులుండ బద్మావతి యొక్కనాడు సఖురాండ్రతోగూడి యుద్యాన వనమునకు బోయెను. అప్పట్టున నారదుడు వృద్ధతాపస వేసముతో నట కేతెంచెను. ఉద్యానవనమునకేతెంచు వృద్ధతాపసుని గనుపెట్టి యాత డెవ్వడై యుండునో కనుగొనుమని పద్మావతి తన సఖురాండ్రను బంపెను. అంతలో నారదుడు తాను చంద్రవంశపు రాజుల కులగురువుననియు లజ్జింప బనిలేదనియు బలికి పద్మావతీదేవిని సమీపించి కరకమలమునుజూపిన భావి శుభములను దెలుపుదుననెను. అంత బద్మావతీదేవి చేయిజాచి చూపుచు భావి శుభములను నిజముగ దెలుపమనెను. నారదు డామె పాణితలమును బరికించి పద్మావతితో నిట్లనెను. తల్లీ ! నీ పాణితలములు పద్మరేఖలతో నొప్పుచున్నవి. నీ ముఖము చంద్రునిబోలియున్నది. నీనేత్ర ములుకమలములనుబోలియున్నవి. ముక్కుతిలపుష్పమునుబోలియున్నది. నీ చెక్కిళ్లు అద్దములనుబోలియున్నవి. నీ కనుబొమలు ధనురాకారమును బోలియున్నవి. దంతములు దాడిమగింజలను బోలును. నీ యధరము ఎఱ్ఱదామరనుబోలియున్నది. నీ వేణియు వక్రములగు నల్లని ముంగురులచే విరాజిల్లుచున్నది. నీ ఫాలము రత్నపీఠమునుబోలియున్నది. నీ చెవులు చక్కిలములనుబోలియున్నవి. శరీరము నిరుపమానమగు మన్మథ మంది రమునుబోలియున్నది. నీ కంఠములో నీడ జూడనగును. వక్షోజముల సొంపు జెప్పనేల? నీ యుదరము అరటాకునుబోలియున్నది. నాభి నిమ్న మయి యున్నది. నీ నడుము సింహేంద్రమధ్యమును బోలియున్నది. నీ తొడ లరటికంబములనుబోలియున్నవి. నీ జఘనము వేదివలె నున్నది. నీ గమనము గజేంద్ర గమనమునుబోలియున్నది. నీవెట్టి సుకృతముల నాచరించియుంటివో ! తల్లీ ! నిన్ను ముల్లోకనాధుడు చేబట్టునని ముద్దు ఘొలుక బలికి నారదుడు అంతర్ధానము నొందెను.

# వకుళాదేవి పూర్వజన్మవృత్తాంతము

వకుళాదేవి పూర్వజన్మమున యశోదాదేవిగానుండి నిరామయు డగు గోవిందుని భజించెను. గోవిందుని తన తనివిదీర బెంచి పెద్దవానిని జేసెను. గోవిందుడు పదునాఱువేల నూటయెనమండ్రుగుర గోపికలను జేపట్టెను. అష్టపట్టమహిషులను పరిణయమాడెను. బిడ్డలను గనెను. మనుమల నెత్తెను. కాని యశోదాదేవి ముచ్చటదీర గోవిందుని పెండ్లి మాటలలో జోక్యమును గలుగజేసుకొనలేదు. గోవిందుడు యెందఱినో పెండ్లాడినను యశోదాదేవి గోవిందుని యే పెండ్లికి నేగలేదు. ఏ లాంఛనములను మర్యాదలను బడయలేదు. ఈ కొఱత మాత్రము యశోదను చిరకాలము బీడింపజొచ్చెను. ఒకప్పుడు యశోద తన కోరి కను శ్రీకృష్ణునితో వెల్లడించెను. అంత శ్రీకృష్ణుడు ఆమె కోరికను కలియుగములో వేంకటేశ్వరావతారమున సఫలము గావింతు ననెను. ఆ యశోదాదేవి నేడు వకుళా రూపమున వేంకటాచలమున నివసించు వేంకటేశ్వరుని తనివిదీర సేవించుచుండెను. శ్రీవేంకటరమణుడు ఆమెతో తృప్తిగలుగు విధమున వేంకటాచలమందు ప్రాకృత పురుషుడట్లు సంచ రించుచుండెను.

శ్లో॥ కలౌకలుషచిత్తానాం పాపాచార రతాత్మనామ్ ।
రక్షణార్థం రమాకాంతో రమతే ప్రాకృతోయథా ॥
దైత్యానాం మోహనార్థాయ సురాణాం మోదనాయచ ।
క్రీడతే బాలకైర్బాలో జగత్పాలక బాలకః ॥
జగన్మోహన సౌందర్య లీలామానుష విగ్రహః ॥

పరమేశ్వరుని లీలావతారములకు శిష్టులగు భక్తులపాలనమే ప్రధాన లక్ష్యము. దుష్టశిక్షణము సయితము లీలావతారములకు మఱియొండు ప్రయోజనము కలదు. అట్టి లీలామానుషావతారముకల శ్రీ వేంకటా చలము దివ్యక్షేత్రము. మానవులకు బహుజన్మ సంచిత పుణ్యములచే నీ క్షేత్ర దర్శనభాగ్యము లభింపగలదు. దేవతలు సయితము యీ క్షేత్ర దర్శనమునుజేయ నువ్విళ్లూరుచుందురు; మానవులమాట చెప్పనేల?

# శ్రీ వేంకటేశ్వరుడు వేటకు బోవుట

ఇవ్విధమున వేంకటాచమందు లీలావతారుడై విహరించు శ్రీ వేంకటేశ్వరుం డొక్కనాటి ప్రొద్దుటలేచి కాలకృత్యములను దీర్చికొనెను. కడువేడుకతో వకుళాదేవి సన్నద్ధముచేయ బాలభోగము నారగించెను. ముద్దులొల్కు పసిడి చల్లడమునుదాల్చెను. కొనలందు ముత్యాలకుచ్చులు వ్రేలాడు కాశికోకను తన నడుమున బిగించెను. శిరోజములను తైలముతో సంస్కరించి పూలతో కొండె జుట్టెను. పిమ్మట మేలైన చందుకావి రుమాలును తలపై జుట్టెను. స్వర్ణయజ్ఞోపవీతమును చూపరులకు గనబడు చందమున సరిగంచు సన్నని వలువను వల్లెవాటుగ మేనదాల్చెను. నిలువుటద్దముచెంత నిలచి ఫాలమున ముద్దులొలుకు తిలకమును దిద్దెను. కంఠాభరణములను దాల్చెను. భుజములకు కంకణములను బెట్టెను. పూలమాలలను ధరించెను. పోకలు కవట తమలపాకులు పచ్చకర్పూరము లవంగములు యాలకులు జాజికాయ జాపత్రి మున్నగు తాంబూల ద్రవ్యములను రత్నములను బొదిగిన తాంబూల కరండికలోబెట్టి బంగారు సున్నపు భరిణెనుంచి చేతబట్టెను. ధనుర్బాణములను దాల్చెను. రత్నములను పొదిగిన బంగారు పాదుకలను దొడిగెను. ఇట్లు జగన్మోహనాకారమునుదాల్చి వేటకుపోవనెంచి యశ్వమును మనసులో దలపెట్టెను. అంతలో బదునైదుయడుగుల యెత్తగు యశ్వమొక్కటి వేంకటేశ్వరుని యెదుట నిలబడెను. ఈ యశ్వమునకు ఫాలమున సువర్ణ తిలకము మెఱయుచుండెను. మూపున విలువగల జీను మున్నగు పరికరములు అమరియుండెను. అశ్వము వాయువేగ మనోవేగములతో నొప్పుచుండెను. శ్రీ వేంకటేశ్వరుడు ఆ గుఱ్ఱముపైనెక్కి వేంకటాచలమును దిగి పలు మృగములను వేటాడ మొదలిడెను. సింహ శరభ శార్దూల మాతంగాదులను చిరకాలము వేటాడెను. అంతలో నొక మదపుటేనుగును గాంచి దానిని వేటాడనెంచి వెంటాడెను. ఆ మదపుటేనుగు తన ప్రాణములను గాపాడుకొనుటకై పరువిడసాగెను. శ్రీ వేంకటేశ్వరుడు ఆమదపుటేనుగు వెన్నంటి సార్థయోజన పర్యంతము బోయెను. అంత నా మదపుటేనుగు ఆకాశరాజు నుద్యానవనప్రాంతమున వెనుదిరిగి తొండము సాచి గర్జించి శ్రీ వేంకటేశ్వరునకు సాష్టాంగముగ సాగిలబడి తనిదారిని తాబోయెను.

శ్రీ వేంకటేశ్వరుడు యిదియేమి చోద్యమోయని చూచుచుండు నంతలో నా మదపుటేనుగు వేంకటేశ్వరుని దృష్టిపథము దప్పెను. శ్రీ వేంకటేశ్వరుడట్లుచూచుచుండ నొక చక్కని రాచకన్నియ సఖీపరివృతురాలై యుద్యానవనమున దిరుగుచు వేంకటేశ్వరుని కంటబడెను.

# పద్మావతీ వేంకటేశ్వరుల తొలి సమావేశము

పద్మావతీదేవి పూదోటలో సఖురాండ్రతోఁగలసి విహరించుచు మదపుటేనుగుచేయు ఘీంకారమునకు వెఱగొంది కొంత తడవునకు సేదదీఱెను. పద్మావతి తన సఖురాండ్రతో నొక చెట్టుప్రక్కన డాగియుండెను. ఇంతలో శ్రీవేంకటేశ్వరుడు వీరిజాడల నరసి వీరిచెంత కేగుచుండెను. అప్పట్టున బద్మావతియు సఖురాండ్రును వేటకానివేసముతోనొప్పు వేంకటేశ్వరుని జూచి యితడెవ్వరై యుండునోయని గుసగుసలుపోవ నారంభించిరి.అంతలో బద్మావతి యా వేటకాని కులశీలగోత్ర నామధేయములను, తల్లిదండ్రులను నివాస దేశమును, వృత్తిని, బందుగులను దెలియగోరి తన చెలికత్తెల నంపెను. ఇంతలో తురగారూఢుడైన వేంకటేశ్వరుడు పద్మావతీ సఖురాండ్రను సమీపించెను. పద్మావతీ సఖురాండ్రాతనిజూచి యిట్లనిరి. నీవెవ్వరవు? ఎందుల కేతెంచితివి? నీకిచట నేమి కావలయును? ఇందు బురుషులు లేరు. పొమ్ము! పో పొమ్ము!! అనిరి. అంతట తురగారూఢుడైన వేంకటేశ్వరుడు రాజపుత్రితో తనకు గార్యముకలదనెను. అంత నా సఖురాండ్రు వేటకానినిజూచి యిట్లనిరి. నీకు రాజపుత్రితో గల కార్యమేమి? నీ దేశమేది? నీ పేరేమి? నీ తలితండ్రులెవ్వరు? అన్నదమ్ము లెవ్వరు? అప్పచెల్లెండ్రెవరు? నీ కులమేమి? గోత్రమెద్ది? అనుచు నా సఖురాండ్రు వేటకానిపై ప్రశ్నల వర్షమును గురిపించిరి. శ్రీ వేంకటేశ్వరుడు పద్మావతీ సఖురాండ్ర ప్రశ్నలవర్షమునకు సంగ్రహముగ తడబడక తనకు కన్యాపేక్ష కలదని బదులుచెప్పి పద్మావతీదేవి చెంతకేగి యిట్లు చెప్పదొడగెను.

మా పెద్దలు మమ్ములను చంద్ర వంశమున బుట్టితిమందురు. నా తండ్రి వసుదేవుడు. నా తల్లి దేవకీదేవి. నా యన్న బలరాముడు. నా చెల్లెలు సుభద్ర. అర్జునుడు నాకు మిత్రుడు. పాండవులు నాకు బంధువులు.

నేను కృష్ణపక్షమున బుట్టితిని. నా దేహకాంతి నల్లనిది. కావున నన్ను కృష్ణుడందురు. నా పుట్టుపూర్వోత్తరములను జెప్పితిని అనుచు వేంకటేశ్వరుడు పద్మావతిని తన పుట్టుపూర్వోత్తరములను దెలుపమనెను. అంత పద్మావతి వేంకటేశ్వరునితో నిట్లు జెప్పదొడగెను. ఓ కిరాతాధిపా! నేను ఆకాశరాజ తనయను. నా పేరు పద్మావతి. మా వంశము చంద్రవంశము. మా గోత్రము అత్రి గోత్రము, ఓ కిరాతాధిపా! నీ విటనుండి వెంటనే వెడలిపొమ్ము! అనెను. అంత నా పద్మావతినిజూచి వేంకటేశ్వరుడిట్లనెను. ఓ పద్మావతీ!కఠోరముగ బలుకనేల? ఆదరముజూపి మాటలాడుము.అన్నాతురుడై యొక్క డరుగుదెంచును. ఆతనికి అన్నముబెట్టు నాతడు పున్నెము నొందును. నీరములనిచ్చియు బున్నెము నొందును. అన్నోదకముల నీయకున్నను ఆదరముజూపి మాటలాడియు బున్నెము నొందును. కసరికొట్టునాతడు అన్నమునుబెట్టియు బున్నెమునొందజాలడు.నన్ను కసరికొట్టకుము. నేను కామాతురుడనై యేతెంచితిని. నా కోరికను సఫలముజేసిన యిహ పర సుఖములను బడయుదువు. కసరికొట్టనేల? నన్ను జేపట్టుమనెను. ఆ కిరాతునిమాట లాలకించి క్రోధముచే గన్నులెఱ్ఱబాఱ పద్మావతి యిట్టులనెను. ఓరీ మూఢా! నీవు నోటికివచ్చినట్లు వదరుచుంటివి. నీకు బ్రతుక నాశలు చెల్లెనా? అనెను. ఆకాశరాజునకీ వృత్తాంతము తెలియ నిన్ను తుదముట్టించును. పో పొమ్ము!! అనెను. అంత పద్మావతిని జూచి వేంకటేశ్వరుడు యిట్లనెను. నా యభిలాష సఫలముకానంత మరణము సయితము నాకు సుఖకరము కాగలదు. నా కోరికలు తీరకున్న నాకు మరణ మెట్లు సంభవింపగలదు? నీ జనకుడు సయితము నన్నేల జంప నుంకించును? నే నాడిన మాటలలో దప్పిదమేమి యున్నది? నేను కన్యాకాముడను. నీవు కన్యవు. నా మాట నంగీకరింపుమనెను. అంత పద్మావతి మిక్కిలికుపిద్ధురాలై కిరాతునితో నిట్లనెను.

ఓరీమూఢా! మూర్ఖభావముచే నీకు గలుగబోవు విపత్తు నెఱుగజాలకున్నావు. ఈ వృత్తాంతమునఱసినచో నాతండ్రి నిన్ను బందీకృతుని జేయగలడు. కాలహరణమేల? ఇటనుండి తొలగిపొమ్ము! అనెను. వేంకటేశ్వరుడు తన యభిలాషను మరల్పజాలక పద్మావతితో మరల నిట్లనెను. ఓ పద్మావతీ! నాకు మరణముకలదని తెలియును. తెలిసియు నిన్ను

జేపట్ట నెంచితిని. పుట్టినవారలు గిట్టుట తథ్యమేకదా! ఆకాశరాజుమాత్రము నిరపరాధినగు నన్నేల జంపును? అని పల్కుచు గుఱ్ఱమును పద్మావతీదేవి చెంతకు బోనీయసాగెను. అంత పద్మావతి కిరాతునితో నిట్లనెను. ఓరీ కిరాతా! నీ తల్లిదండ్రులను బరిత్యజించితివి. అన్నదమ్ములను గోల్పోయితివి. వనములలోదిరుగుచు అనాథుడవై చావనేల? అనుచు గుఱ్ఱముపై రాలనురువ్వ నారంభించెను. అవ్విధమున పద్మావతియు, పద్మావతీ సఖురాండ్రును వేంకటేశ్వరుని గుఱ్ఱముపై రాలను రువ్వ నా యశ్వము నేల బడి ప్రాణములను బాసెను. శ్రీ వేంకటేశ్వరుడు మృతాశ్వమును దిగులొంది చూచుచుండ పద్మావతీదేవి తన సఖురాండ్రతో నింటికేగెను. వేంకటేశ్వరుడు ప్రాకృత పురుషునివలె గొంతతడవు వగచి ఉత్తరాభిముఖుడై చని కొండనెక్కి తనయింట బ్రవేశించెను. పరమానందభరితుడయ్యును బ్రాకృతునివలె జింతాక్రాంతుడయ్యెను.

## వకుళాదేవి వేంకటేశ్వరుని ఊరడించుట

ఇవ్విధమున వేంకటేశ్వరుడు తన పర్యంకమున జింతాక్రాంతుడై పరుండియున్న అవసరమున వకుళాదేవి నవకాయ పిండివంటలతో షడ్రసోపేతాన్నమును గొనివచ్చి శ్రీ వేంకటేశ్వరుడు పుట్టలో దన పర్యంకమున బరుండియుండుటను గాంచెను. శ్రీవేంకటేశ్వరుడు కేవలము అటుబరుండియుండక వేడి నిట్టూర్పులను బుచ్చుచుండెను. కన్నీటి ధారలను గార్చుచుండెను. నిత్యము షడ్రసోపేతాన్నమునుగొనివచ్చువేళ తన్ను బలుకరించునాతడు నేడేలకో తన్ను బలుకరింపడాయెను. ఇట్టి రమాకాంతునిజూచి వకుళాదేవి యిట్లు బలుకరించెను. ఓ గోవిందా! లే లెమ్ము. పరుండెదవేల? ఓహరీ! పగటివేళలందు మున్నెన్నడు నిదురించినవాడవుకావు. మున్నెన్నడును దుఃఖించినవాడవుకావు. నీవు దుఃఖించునట్లు దోచుచున్నది. నీవిపుడు దుఃఖింపనేల? నీ మనసులోని యంశమును దెలుపుము. షడ్రసోపేతాన్నమును దెచ్చితిని, లే లెమ్ము. ఆరగింపుము. అనుచు వకుళాదేవి వేవిధముల బుజ్జగింప నారంభించెను. అయ్యును శ్రీహరి పలుకడాయెను. వకుళాదేవికి కడుపుతీపు మఱింతకాజొచ్చెను. అంత వకుళాదేవి శ్రీహరితో మరల నిట్లు పలుక నారంభించెను. ఓ గోవిందా! నీవు వనములలో నేమిచూచితివి.

నీకింత దుఃఖమేల? నీవు దుఃఖములేనివాడవయ్యును దుఃఖితునివలె గనబడనేల? నీ మనసులోని యభిలాషను దెలుపుము. తెచ్చిన యన్నమును నీవు తినకున్న నాకు దుఃఖము పొంగిపొంగి వచ్చుచున్నది. సకల లోకార్తినిబోగొట్టు ఓ పుణ్యమూర్తీ! నీకు నమస్కారము. ఓహరీ! అరణ్యములలో నీవు ఎట్టి గంధర్వ కన్యను జూచితివి? ఎద్దానిపొందు నభిలషించి నీకిపుడీ చిత్తవైకల్యము? ఓ జగద్గురో! కామార్తురాలగు నే కన్నియ భక్త పరవశుడగు శ్రీహరిని మోహింపజేసెను? ఓ గోవిందా! నీ యభిలాషను దెలుపుము. నీ యభిలాషను క్షణములో నెరవేర్తును. అరణ్యములో క్రూర మృగములనుజూచి భయపడితివో? భయంకరులగు చోరులనుగాంచి భీతిల్లితవో! భూతప్రేత పిశాచాదులనుజూచి బెదరితివో తెలుపుము. ఆ దోషములువాయ మంత్రింపజేయుదును. యంత్రములను గట్టింతును. మూలికలను గట్టింతును. ఔషధముల నిప్పింతును. నీకుగల సకలబాధలను దొలగింతును. లే లెమ్ము. చెప్పుము అన్నను వేంకటరమణుడు పలుకడాయెను. అంతట వకుళాదేవి తానుతెచ్చిన షడ్రసోపేతాన్నము నటబెట్టి గోవిందునిచెంత గూర్చుండి గోవిందునితనువుపై జేయిపై చిదేహమంతయు నిమురుచు పలుతెఱగుల గోవిందు నోదార్ప నారంభించెను. తన యభిలాషను దెలుపుమని గోవిందుని మెల్లమెల్లన వేనోళ్ల బ్రతిమాలజొచ్చెను. వేంకటేశ్వరుడు తుదకు వేడి నిట్టూర్పులను బుచ్చుచు కడుదుఃఖముతో మెల్ల మెల్లన తన మనోగతము నివ్విధమున వకుళాదేవికిజెప్ప మొదలిడెను.

## శ్రీ వేంకటేశ్వరుడు వకుళాదేవితో దుఃఖహేతువును వివరించుట

ఓ తల్లీ! నన్ను గంధర్వ కన్య మోహింపజేయలేదు. నన్ను యే మునికన్నియయు మోహింపజేయలేదు. భూతప్రేత పిశాచాదులు నన్ను బెదరింపనేరవు. శరభ శార్దూలాది వన్యమృగములకు నేను భీతిల్లువాడను గాను. నేను మృత్యుదేవతకు సయితము మృత్యుదేవతనై సంచరింతును. నా పేరు దలపెట్టినంత శరభ శార్దూలాది వన్యమృగములు, భూత ప్రేత పిశాచాదులును దిక్కులుదోచక పాఱిపోవును. ఓ తల్లీ! నేనొక్క సుందరాంగిని జూచితిని. ఆమె ముఖము పూర్ణచంద్రుని ధిక్కరించుచుండెను.

ఆమె నల్లని ముంగురులు తుమ్మెదలవలె నుండెను. కనుబొమలు ధనురాకారమునుబోలియున్నవి. వేయేల? నామె శరీరమున ముద్దులొలుకుచున్నవి. ఆమె నామధేయము పద్మావతి. ఆమె తండ్రి యాకాశరాజు. ఈ పద్మావతి లక్ష్మీదేవివలె నున్నది. నా పున్నెము లామెను దిలకించుటచే ఫలవంతములాయెను. ఆమెను జేపట్టనిచో భూమండలమున నా జన్మము నిరర్థకము. అందులకు వలయు ప్రయత్నములను సలిపి నా యభిలాషను దీర్పుము. లేనిచో నేను జీవింపజాలనని తెలియుము అనెను. అంత వకుళాదేవి శ్రీ వేంకటేశ్వరునిమాటలాలించి శ్రీవేంకటేశ్వరునితో నిట్లనెను. ఓ వేంకటరమణా! నే నిందులకు వలయు సకల ప్రయత్నములను సలిపి నీ యభిలాషను క్షణములో సఫలము గావింతును. ఆ పద్మావతి నివసించు దేశమును నా కెఱిగింపుము. ఆ దేశమునకు బోవు మార్గమును జెప్పుము. ఓ గోవిందా! ఆమె పూర్వపు జననమునందు ఎవ్వరై యుండెను? ఇపుడెందులకు భూమండలమున బుట్టెను? అనెను.

## పద్మావతీదేవి పూర్వజన్మ వృత్తాంతము

అంతట శ్రీవేంకటేశ్వరుడు పద్మావతీ పూర్వజన్మ వృత్తాంతమును యీ క్రిందివిధమున వకుళాదేవికి జెప్ప నారంభించెను. ఓ తల్లీ! నేను త్రేతాయుగమునందు రామావతారమును బడసియుంటిని. అప్పట్టున పితృవాక్య పరిపాలనార్థమై నా యర్ధాంగియగు సీతాదేవితోడను, సోదరుడగు లక్ష్మణునితోడను దండకారణ్యములందు నివసింపబోయియుంటిని. భార్యతోడను, సోదరునితోడను దండకారణ్యములలో పర్ణశాలను నిర్మించుకొని నివసించుచుంటిని. ఒక్కనాడు అరణ్యములలో నేను వేటాడుటకై వెడలియుండ నా క్షేమమునరయుటకై సీతాదేవి లక్ష్మణుని యరణ్యములకు బంపెను. అప్పట్టున లోకకంటకుడగు రావణుడు నా యర్ధాంగియగు సీతాదేవి నపహరింపబూనెను. సీతాదేవి భయవిహ్వలురాలై హా రాఘవా! ఓ లక్ష్మణా! యని యెలుగెత్తి యేడువ నారంభించెను. ఆ రోదనమును విని అగ్నిహోత్రుడటకేతెంచి సీత నపహరింపబూనిన రావణునిజూచి యిట్లనెను. ఓ రావణా! ఈమె నిజమగు సీతకాదు. నీవు సీత నపహరింతువను వెఱపుచే శ్రీరాముడు తన సీతను నాచెంత దాచెను. నీవు నాక్షు

ప్రియుడవగుటచే నీ కీ వృత్తాంతమును దెలిపితిని. నిజమగు సీతను నీ కిత్తునని పలికి రావణు డపహరింపబూనిన నిజమగు సీతను తనవెంట దోడుకొని చని స్వాహాదేవికి నొప్పగించి భద్రముగ గాపాడుచుండుమని జెప్పెను. ఇట్లు నిజమగు సీతను భద్రపఱచి పూర్వము ఒకప్పుడు రావణుడు తన్ను అవమానపఱచుటచే రావణుని కులమును ద్రుంతునని శపథముబూని తనయింట నివసించుచున్న వేదవతి యను నామెను సీతరూపమున గొనివచ్చి యీమె నిజమగు సీతయని రావణుని నమ్మించి రావణున కిచ్చెను. రావణుడు ఆమెను నిజమగు సీతనుగా నమ్మి యామెను దోడ్కొని లంకకు జనెను. రాముడు సముద్రమునుదాటి లంకలో ప్రవేశించి రావణునిద్రుంచి లోకాపవాదమును బాయుటకై సీతాదేవి (వేదవతి) నగ్నిప్రవేశము గావింపుమనెను. సీతాదేవి (వేదవతి) యగ్నిలోబడు నంత నగ్నిహోత్రుడామెనుగాచి పూర్వము తాను స్వాహాదేవికి నొప్పగించిన నిజమగు సీతను గొనివచ్చి శ్రీరామునెదుట బెట్టెను. సీతా వేదవతులిరువురు నొక్కపోలికనుండుటచే శ్రీరాముడు తన యర్థాంగిని గుర్తుబట్టనేరక దిగ్భ్రాంతుడై యుండెను. అప్పట్టున నిజమగు సీతాదేవి శ్రీరామునకు వేదవతినిజూపి యట్లనెను. ఓ నాథా! ఈమె వేదవతి. పూర్వము రావణుడీమె నవమానింప నీమె యతని కులధ్వంసమును గావింతునని ప్రతినబూనెను. రావణుడు దండకారణ్యములలో నన్నపహరింపబూనినంత నీమె నా వేసమునుదాల్చి రావణుని లంకకేగి పడరానిపాట్లను బడెను. అనుగ్రహించి యీమెనుగూడ జేపట్టుము అనెను. అంతట శ్రీరాముడు తా నప్పట్టున నేకపత్నీవ్రతస్థుడగుటచే రాబోవు కలియుగమున వేంకటేశ్వరావతారములో నా యభిలాషను దీర్చెద ననెను. ఆ వేదవతీదేవి యిపుడు పద్మావతీదేవియై పుట్టెననుచు శ్రీవేంకటేశ్వరుడు పద్మావతీదేవి పూర్వజన్మ వృత్తాంతమును వకుళాదేవికి జెప్పెను. వకుళాదేవి వేంకటేశ్వరునిపలుకులాలించి మిక్కిలి ముదముజెందెను. అంత వకుళాదేవి నారాయణపురమునకుబోవనెంచి వేంకటేశ్వరునితో నిట్లనెను.

## వకుళాదేవి నారాయణపురమునకు బోవుట

ఓ వేంకటరమణా! నేను నారాయణపురమునకుబోయి నీ యభిలాషను సఫలముగ జేయుదుననెను. అంత వేంకటేశ్వరుడు పర

మానందభరితుడై దిగ్గున పర్యంకముపైనుండి లేచి వకుళాదేవి తెచ్చిన యన్నము నారగించెను. అంత వకుళాదేవి నారాయణపురమునకుబోవ సన్నద్ధురాలై మార్గమును దెలుపుమని శ్రీ వేంకటేశ్వరు నడిగెను. ఆమె మాటల నాలకించి వేంకటరమణుడు ఆమెతో నిట్లనెను. ఈ వేంకటాచలమును దిగి దక్షిణాభిముఖముగబోయిన కపిలతీర్థము కలదు. అందులో మునిగి వేంకటేశ్వరుని కోరిక లీడేరునట్లు కపిలేశ్వరునకు మ్రొక్కుము. అటనుండి పద్మసరోవరమునకు బొమ్ము. కార్యమును సఫలము గావించుకొని రమ్మ అనుచు శ్రీ వేంకటేశ్వరుడు వకుళాదేవిని బంపెను.

## వకుళాదేవికి పద్మావతిదేవియొక్క చెలికత్తెలు పద్మావతీ వృత్తాంతమును దెలుపుట

వకుళాదేవి వేంకటాచలమున బయలువెడలి శ్రీ వేంకటేశ్వరుడు చెప్పినచొప్పున బోవుచు శివాలయమునకు వచ్చునంత శివాలయములో గొందఱు కన్నియలుండిరి. వకుళాదేవి వారినిజూచి యిష్టాగోష్ఠి సలుపుచుండునంత నా కన్నియలు తమ వృత్తాంతమును వకుళాదేవితో నిట్లుజెప్ప మొదలిడిరి. ఆకాశరాజపుత్త్రియగు పద్మావతికి మేము చెలికత్తెలము. నిన్నటి దినమున పద్మావతీదేవి మమ్ములను వెంటబెట్టుకొని యుద్యానవనమునకుబోయి అందు విహరించుచుండెను. అప్పట్టున మన్మథరూపముతో నొప్పు నొక కిరాతుడు గుఱ్ఱముపైనెక్కి మాచెంతకేతెంచెను. మా పద్మావతీదేవిని జేపట్టుదునని పంతముపట్టెను. మా పద్మావతి యా కిరాతునిపై మిక్కిలి కోపించి యతనిగుఱ్ఱముపై రాలనురువ్వెంచెను. అంత నాగుఱ్ఱము నేలబడి యసువులను బాసెను. ఆ కిరాతుడు తన గుఱ్ఱమునకై కొంత తడవు విచారపడి మా యుద్యావనమునువీడి యుత్తరపుదెస బోయెను. అంతటనుండియు మా పద్మావతి జ్వరమూర్ఛితురాలై యుండెను. ఆమె జనకుడగు నాకాశరాజు యీ వృత్తాంతమరసి మిక్కిలి చింతించి పద్మావతీ తాపహేతువును దెలుప బృహస్పతిని పిలువనంపెను. అంత బృహస్పతి యేతెంచి పద్మావతి నిన్నటిదినమున పూదోటలో నొక పురుషునిజూచి భీతిజెందెననియు, తచ్ఛాంతికై శివున కభిషేకము గావింపుమనియు జెప్పెను.

అందులకై శివునకు అభిషేకముగావింప నిం దరుదెంచితిమని పలికి వకుళా దేవిని తన వృత్తాంతమును దమ కెఱింగింపుమనిరి.

## వకుళాదేవి పద్మావతిదేవి చెలికత్తెలకు తన వృత్తాంతమును దెలుపుట

అంత వకుళాదేవి తాను శ్రీ వేంకటరమణుని దాసురాలనని చెప్పి తనకు నాకాశరాజ సతీమణియగు ధరణీదేవితో మాటాడపనియున్నదనెను. రాజాంతఃపురమునం దొరులకు ప్రవేశము సులభలభ్యముగాదు కావున తన్ను రాజాంతఃపురమునకు గొనిపోవ నా చెలికత్తెలను ప్రార్థించెను. ఆ చెలికత్తెలు వకుళాదేవి ప్రార్థనలకు వల్లెయనిరి.

## శ్రీ వేంకటేశ్వరుడు ఎఱుకలసాని వేసముతో నారాయణపురమునకు బోవుట

ఇది యిట్టులుండ శ్రీ వేంకటేశ్వరుడు వకుళాదేవినిబంపియు స్వస్థ చిత్తుడు కాజాలడాయెను. లోకములో నేకపుత్త్రుడు అపుత్త్రుడుకదా! అట్లే ఒక కన్ను గలవాడు కండ్లులేనివానితో తుల్యుడు. స్త్రీలు యత్నించు పనులు సయితము అట్లే సఫలములుకాకపోవచ్చును. కావున శ్రీ వేంకటే శ్వరుడు వకుళాదేవిని బంపియు జింతాక్రాంతుడై లీలావతారుడగు తాను యాబది వత్సరముల వయసుగల ఎఱుకలసానివేసమును బూనెను. నార బట్టను గట్టెను. చినిగిన రవికెను దొడిగెను. బ్రహ్మను శిశువుగాజేసి పైట చెరగులో మూపున వ్రేలాడగట్టెను. మహేశ్వరుని చేతికి నూతగఱ్ఱగ బట్టెను. జుట్టు విరబోసికొని ధాన్యపుగంపను తలపైబెట్టెను. గురివింద గింజల పూసల దండలను మెడలోవైచెను. ఈమెరూపు లంబోదరము. లంబకర్ణము. చూపరులకు అచ్చు సోదెజెప్పుదానివలె నుండెను. ఈ తీరున వెంకటరమణుడు ఆకాశరాజునకు బ్రధానపట్టణమగు నారాయణపురమున బ్రవేశించి "సోదె అమ్మోయ్; సోదె" అని యఱచుచు బోవుచుండెను. అంత నా పురస్త్రీలు యీమెనుజూచి పద్మావతీదేవి యనారోగ్యమునకు

గారణమును ఈమె చక్కగ సోదె జెప్పగలదని ముచ్చటపడి యామె వృత్తాంతమును ధరణీదేవికి దెలిపిరి. అంత నా ధరణీదేవియు గొంత చింతబాయగలదని తలచి యెఱుకలసానిని తోడుకొనిరా పురస్త్రీలను బంపెను. అంత నా పురస్త్రీలు ఎఱుకలసానిచెంత కేతెంచి ఎఱుకలసానిని రాజమందిరమునకు రమ్మని పిలచిరి. ఎఱుకలసాని వారి మాటలను విని వారితో నిట్లనెను. నేను దరిద్రురాలను. నిర్భాగ్యురాలను. నన్ను బరిహసింప రాజమందిరమునకు దోడుకొనిపోవుదురా? నా గుడ్డలను దిలకింపుడు! శతచ్ఛిద్రములతో నిండియున్నవి. నా యలంకారములను జూడుడి! పూసలు మా యలంకారములు. నన్నును నా బిడ్డను జూడుడి! తిండిలేక చిక్కిశల్యములయి యున్నాము.మమ్ములను బరిహసించుటకై నన్ను రాజమందిరమునకు గొంపోవజూచుచున్నారు. నేను రాజమందిరమునకు రాను అనెను. పురస్త్రీలు ఎఱుకలసాని పల్కులను రాజమందిరములోని ధరణీదేవికి దెలిపిరి. అంత ధరణీదేవి తాను స్వయముగ నేతెంచి ఎఱుకలసానిని కడు మర్యాదతో నిట్టులాహ్వానించెను. ఓ ధర్మదేవతా! నీవు సకలము నెఱిగినదానవు. నాకు భావి శుభములనుదెలుప నేతెంచితివి. రమ్ము! రాజమందిరమునకు రమ్ము. నా మనోగతమును జెప్పుము అని పిలచెను. అంత నా యెఱుకలసాని ధరణీదేవితో నిట్లనెను. ఓ తల్లీ! నేను సోదెను జెప్పెదను. నా మాటలు అసత్యములుకావు. అసత్యములు పలికిన నా నాలుకను గోయించి పట్టణమునుండి వెడల గొట్టింపుము. నరనారాయణస్వామి నాకు బెనిమిటి. నా వీపుపైనుండు బిడ్డడు అతని కుమారుడు. వీడు బ్రహ్మదేవుడు. ఆ నరనారాయణుడు చెప్పగా నీ యింటికి వచ్చితిని. నేను భూత భవిష్యద్వర్తమానముల నెఱుగుదును అనెను. ధరణీదేవియు నెఱుకలసానిని తగువిధమున బుజ్జగించుచు మెల్లమెల్లన రాజమందిరమునకు దోడుకొనివచ్చెను. తోడుకొనివచ్చి చక్కని యుచితాసనమున గూర్చుండబెట్టెను. ఎఱుకలసాని యాసనమున గూరుచుండి ధరణీదేవిని స్నానమాచరించి శుచిర్భూతములగు వస్త్రములను, అలంకారములను దాల్చి రమ్మనెను. ధరణీదేవి స్నానమాచరించి శుచిర్భూతురాలై నూతన వస్త్రాలంకారములనుదాల్చి వచ్చెను. అంత నెఱుకలసాని ధరణీదేవిని జూచి తనకు వాయనము నిమ్మనెను. ధరణీదేవి ముత్తెములను బంగారుచేటలో బోసి ఎఱుకలసానియెదుటబెట్టి తన మనోగత దుఃఖము బాయువిధము

నెఱింగింపుమనెను. ధరణీదేవిమాటలాలించి యెఱుకలసాని తన కుమారునకు అన్నము బెట్టుమనెను. ఎఱుకలసాని మాటలకు ధరణీదేవి సంతసించి బంగారుగిన్నెతో క్షీరాన్నమును దెచ్చి యెఱుకలసాని యెదుటబెట్టెను. ఆ బిడ్డడు క్షీరాన్నమునుదినక యేడువ నారంభించెను. ఎఱుకలసాని తిండి తినక యేడువసాగిన బిడ్డను కసరుచు చావమోది బంగారు పాత్రలోని యన్నమును తాను కడుపార మెసగి ధరణీదేవినిజూచి తల్లీ! తాంబూలము నిమ్ము; నీకు సోదెచెప్పుదుననెను. అంత ధరణీదేవి లవంగములు యాలకులు పచ్చకర్పూరము వక్కలు దెచ్చి పన్డెడు తమలపాకులతో నెఱుకలసానికి నిచ్చెను. ఎఱుకలసాని యా తాంబూలమును చేతబట్టి తూర్పు ముఖముగ గూర్చుండి తొడపై బిడ్డను గూర్చుండబెట్టి సోదెజెప్ప నారంభించెను. ఈ ఎఱుకలసానిరూపముతోనున్న పరమేశ్వరునిజూడ నాకసమున దేవతలు విమానారూఢులై నిలబడిరి. లక్ష్మీ సహాయుడగు నారాయణునితో సల్లపించుటకు ధరణీదేవి పూర్వజన్మములలో నేమి పున్నెముల నాచరించెనోయని తమలోదాము గుసగుసలువోవ జొచ్చిరి.

# ఎఱుకలసాని చెప్పిన పద్మావతీ దేహశోషణ నివృత్త్యుపాయము

అంత నా యెఱుకలసాని కులదేవతలను దలచి తన యెదుట బంగారుచేటలో బోసిన ముత్తెములను మూడురాసులుగ జేసెను. అంత ధరణీదేవిచెంత నొక కఱ్ఱనుబెట్టి యా కఱ్ఱతో ధరణీదేవిని ముత్తెపు రాసులలో నొక్కదానిని స్పృశింపుమనెను. అంత ధరణీదేవి యెఱుకలసాని తనచేతబెట్టిన కర్రతో నా ముత్తెపురాసుల మూటిలో నొక్కదానిని స్పృశించెను. అంత నా యెఱుకలసాని సోదెజెప్ప నారంభించెను. ఓ తల్లీ! నీ మనసులో సంగతిని గనుగొంటిని. నీ బిడ్డ నిన్నటిదినము సఖురాండ్రతో పూదోటలో దిరుగుచు నొక్క పురుషుని జూచెను. అతడు గుఱ్ఱముపై నుండెను. అతనింజూచి నీ బిడ్డ యాతనిపై మనసు నిలిపెను. నీ బిడ్డ నాతనికిచ్చి పెండ్లిజేయుము. నీ బిడ్డ శరీరస్థితి చక్కబడును. తల్లీ! ఇది నిజము. నా గంపతోడు; నా బిడ్డతోడు; నాతోడు; నామాట నమ్ముము.

తల్లీ! నాకు తాంబూలము నిమ్మ అనెను. అంత ధరణీదేవి మిక్కిలి సంతసించి పట్టెడు తమలపాకులను వక్కలను దెచ్చి యెఱుకలసానికి యిచ్చెను. అంతలో నెఱుకలసాని మరల సోదెజెప్పదొడగెను. నిన్నటి దినము తురగారూఢుడై వచ్చిన మనుజుడు మిక్కిలి చక్కనివాడు. నీ బిడ్డ యతనిపై మనసుబెట్టెను. ఈ బిడ్డను అతనికిచ్చి బెండ్లిజేసిన సుఖింప గలదు. ఆదివ్యాధులు తీరుననెను. ఆమె పలుకుల నాలించి ధరణీదేవి యామెతో నిట్లనెను. ఓ ధర్మదేవతా! ఆ కిరాతుడెందుగలడు? అతని పేరేమి? చెప్పుము. నీకు బహుమానమునిచ్చెదననెను. అంత నా యెఱు కలసాని మరల ధరణీదేవితో నిట్లు చెప్పదొడగెను. వైకుంఠవాసియగు శ్రీమన్నారాయణుడు నేడు వేంకటాచలమున నివసించుచుండెను. అతడు ధనవంతుడు; బలవంతుడు; విద్యావంతుడు. అతని గుఱ్ఱమును నీ బిడ్డ రాలతోగొట్టి చంపించెను. పూదోట ద్వారముకడ నా గుఱ్ఱము గిజగిజలాడి నేలపైబడి ప్రాణములను బాసెను. నీ బిడ్డ చెలికత్తెలనడుగుము. నీ బిడ్డపై గల మక్కువచే నా కిరాతుడు నీ బిడ్డను క్షమించెను. నీ బిడ్డను కిరాతున కిచ్చి పెండ్లిజేసిన నీ బిడ్డ బ్రతుకును; సుఖపడును. లేకున్న మృతిజెందు ననెను. అంత నా యెఱుకలసాని పల్కులను విని ధరణీదేవి వెఱగంది దుర్భాషల నాడెదవని కోపించెను. అంత నా యెఱుకలసాని తనమాట లెన్నటికి నసత్యములుకాజాలవని ముమ్మాఱు నొక్కి వక్కాణించెను. ధరణీదేవియు నాలోచించి అయాచితముగ కన్నె నెటులీయగలననెను. అంత నాయెఱుకలసాని ధరణీదేవితో నిట్లనెను. ఓ తల్లీ! ఒక ఘడియ కాలములో నీ బిడ్డనీయగోరుటకై వృద్ధురాలొక్కతె నీ యింటికి రాగలదు. ఇంతలో నీవు ఆకాశరాజును తొండమానును బ్రోత్సహించి నీ బిడ్డను ఆ కిరాతునకిచ్చి పెండ్లిచేయువిధానము నాలోచించి సుఖింపుము. కిరాతునకు నీ బిడ్డనిచ్చెదనని నాచెంత నిపుడు సంకల్పమును జేయుమనెను. అంత నా ధరణీదేవి తన బిడ్డ బ్రతికినజాలునని తలచి తన బిడ్డను ఆ కిరాతు నకుగాక వేఱొక్కనికి నీయననెను. ఎఱుకలసాని ధరణీదేవి మాటల నాలించి అట్లేని నీ బిడ్డ బ్రతికిపోవుననెను. ధరణీదేవియు నెఱుకలసాని మాటలలోనినిజము నిలుకడమీద దెలియగలదనుచు లోనికిబోయెను. ఎఱు కలసానియు బిడ్డను చంకబెట్టి ముత్తెములు బంగారుచేటలోబోసి గంపలో బెట్టి గంప నెత్తినబెట్టి రాజద్వారములను దాటి తావచ్చిన త్రోవం జనెను.

## పద్మావతీ వేంకటేశ్వరునిపై దనకు గలిగిన మోహమును వెల్లడించుట

ఎఱుకలసానిచనిన ంతధరణీదేవి లోనప్రవేశించి చింతాక్రాంతురాలై పద్మావతీనిలయమునకుబోయి పద్మావతితో నిట్లనెను. తల్లీ! బిడ్డలకు దల్లుల కన్నసాప్తులులేరు. నీ మనోగతమును జెప్పుము. నీ మనోరథమును నెర వేర్చెదను. నీకీ చింతయేల? చెప్పుము నీ మనోగతమును. నీవు నీ మనో గతమును జెప్పకున్న నేను విషపానమును జేయుదును. తల్లీ! ఆలసింప కుము. చెప్పుము అనుచు దుఃఖింపసాగెను. పద్మావతి దుఃఖించు తల్లిని జూచి యిట్లు జెప్పసాగెను. ఓ తల్లీ! ఏమనిచెప్ప సాహసించెదను? నా మనసులోని దుఃఖము యితరులకు జెప్పదగినదికాదు. అయ్యును తల్లివి కావున జెప్పెదను ఆలకింపుము. నిన్నటిదినమున నీ యాజ్ఞనువడసి సఖు రాండ్రతో బూదోటలో విహరింపబోయితిని. అప్పట్టున నొక పురాణ పురుషుడు తురగారూఢుడై నాచెంత కేతెంచెను. అతడు నిజముగ బుండ రీకాక్షుడు. అజ్ఞానులతనిజాడల నరయజాలరు. అతని దర్శనమునకై నే నిట్లు శుష్కించుచుంటిని. ఇది సత్యము. నా మాటలను నమ్ముము. ఆ పురుషునిజూడక నేను జీవింపజాలననెను. ధరణీదేవి పద్మావతీదేవి పల్కులాలించి యెఱుకలసాని చెప్పిన సోదెను దలపోసి పరమానంద మునుబొంది యాకాశరాజ మందిరమునకు బోయెను. నిజనాథుడగు నాకాశరాజుతో నెఱుకలసానిచెప్పిన సోదెను బద్మావతీదేవి తెలిపిన యంశ ములను తేటతెల్లముగ జెప్పెను.

## వకుళాదేవి పద్మావతీ సఖురాండ్రతో ధరణీదేవిచెంత కేతెంచుట

అంతలో నీశ్వరునకు షోడశోపచార పూజలను సలిపి సంభారము లతో బద్మావతీ సఖురాండ్రు రాజమందిరమునకు మరలివచ్చిరి. పరమ శివు నర్చించివచ్చిన విప్రుల నాకాశరాజు విధిపూర్వకముగ సత్కరించి వారి దీవెనలనంది వారి యాజ్ఞనువడసి తాను భుజించెను. ఇప్పట్టున ధరణీ

దేవి పద్మావతీ సఖురాండ్రచెంతనుండు వృద్ధురాలినిజూచి పద్మావతీ సఖు రాండ్రతో నిట్లనెను. ఓ కన్యకలారా! ఈమె యెవ్వరు? ఎందునుండి యెందుల కేతెంచెను? ఈమెనుజూడ నాకేలనో యాదరముకలుగుచున్నది. ఈమె వృత్తాంతమును సవిస్తరముగ నాకెఱిగింపుడు అనెను. అంత నా కన్నియలు ధరణీదేవితో నా వృద్ధురాలి వృత్తాంతము నిట్లు జెప్పిరి. ఈమె నివాసము వేంకటాచలము. ఈమె వేంకటరమణుని దాసురాలు. ఈమె పేరు వకుళాదేవి. ఈమెకు ధరణీదేవితో గార్యముకలదనెను. కావున మేము ఆమె నిటకు దోడుకొనివచ్చితిమి. పిమ్మట మహారాజ్ఞి చిత్తము అని నిలువబడిరి. అంత నా ధరణీదేవి వచ్చిన వృద్ధురాలితో నిట్లనెను. ఓ పుణ్యాత్మురాల! ఆ రత్నపీఠము నలంకరింపుము అనెను. అంతట నా వృద్ధురాలు తనకై చూపిన రత్నపీఠమున సుఖాసీనురాలా యెను. తాను వచ్చిన కార్యము సఫలముకాగల సూచనలకు మిక్కిలి సంత సించెను. తన జన్మము సఫలమాయెననుకొనెను. ఇట్లు తలపోయు వృద్ధు రాలునిజూచి ధరణీదేవి యిట్లు పలుకజొచ్చెను. ఓ తల్లీ! సుఖముగ వచ్చి తివా? నీరాకచే నేను ధన్యురాలనయితిని. నా పూర్వపుణ్యములచే నీవిట కేతెంచితివి. నీవు వచ్చిన కార్యమును దెలుపుమనెను. అంత వకుళాదేవి ధరిణీదేవితో తాను వచ్చిన కార్యము నిట్లు వెల్లడించెను. ఓ తల్లీ! ఇతర కార్యము లెన్నియున్ననేమి? కన్నెను వెదకుట నా రాకలో ముఖ్య కార ణము అనెను. ధరణీదేవి వకుళాదేవి రాకకుగల కారణమును సంగ్రహ ముగ నెఱిగి మిక్కిలి సంతసించి వకుళాదేవితో నిట్లనెను. తల్లీ! మంచి మాట జెప్పితివి. మాకు వరుని వెదకు పనియుగలదు. నీవు చెప్పు వరుని దేశమెద్ది? ఆ వరుని గోత్రమెద్ది? ఆ వరుని జన్మ నక్షత్రమేమి? ఆ వరుని పేరేమి? ఆతని తల్లితండ్రులెవ్వరు? ఆ వరుని కులమెద్ది? ఆ వరుని వంశా చార మెద్ది? తెలుపుమనెను. అంత వకుళాదేవి ధరణీదేవితో నిట్లనెను. ఓ మహారాజ్ఞీ! ఆ వరుని కులగోత్ర నామధేయాదులను వర్ణించెద నాల కింపుము. ఆ వరుని జననీ జనకులు దేవకీ వసుదేవులు. వారివంశము చంద్రవంశము. వరునిపేరు కృష్ణుడు. వరుని గోత్రము వసిష్ఠగోత్రము. అతని నక్షత్రము శ్రవణము. ఆ వరుని నివాసస్థలము వేంకటాచలము. అతడు విద్యావంతుడు; ధనవంతుడు; బలవంతుడు. వారి కులమున మిక్కిలి యాచారము కలదు. వరుడు ఇరువదియైదు వత్సరముల

ప్రాయముగలవాడు. తల్లీ! పెండ్లిసమయములో నాతని రూపుజూచి మిక్కిలి ముచ్చటపడగలవు. నేను నోరువిప్పి చెప్పనేల? అనెను. ఈ మాటలకు ధరణీదేవి పరమానందమునొంది వకుళాదేవితో నిట్లనెను. ఓ తల్లీ! నీ మాటల నాలకింప నాకు సందియము వొడముచున్నది. ఏలనన, వరుడు ధనవంతుడనియు, మంచికులమున బుట్టెననియు, బుద్ధిమంతుడ నియు, బలవంతుడనియు, యుక్తవయసుగలవాడనియు జెప్పితివి. ఇట్టి వరునకింకను బెండ్లికాకుండుటకు గతమెద్ది? అనెను. అంతలో వకుళా దేవి తడబడక చింతించి ధరణీదేవితో ధైర్యముగ నిట్లనెను. ఓ మహా రాజ్ఞి! తొలుత నీ వరుడు ఒక్క కన్నెను బెండ్లియాడెను. కాని సంతతిని బడయనేరక మఱియొక కన్నెను జేపట్టనెంచెను. ఇతరదోసములేవియు నీ వరునిలో గానరావు. సంశయింపకుమనెను. అంత నా ధరణీదేవి తన సుతుడగు వసుదానునిబిలచి ఆకాశరాజును రావించెను.

## ధరణీదేవి మాటల నాలకించి ఆకాశరాజు పద్మావతిని ఊరడించుట

ఆకాశరాజుతో ధరణీదేవి యేకాంతమున గూర్చుండి యిట్లనెను. వకుళాదేవి వేంకటాచలమునుండి కన్యానిమిత్త మిటకేతెంచెను. వసుదా నుని బంపి పురోహితుని రప్పించి వేదపారగులగు బ్రాహ్మణులతో వధూ వరుల జననకాల గ్రహసంపత్తిని విమర్శింపుడు. వరుని కుల విద్యా బలా దులను విచారించి అనుకూల్యము కుదిరినచో వివాహ యత్నములను గావింపుడు. పద్మావతియు వేంకటాచలనివాసిని గోరుచున్నది. శుభమును శీఘ్రముగ జేయుమందురు. ఆలోచింపుడనెను. అంత నాకాశరాజు పర మానందభరితుడై ధరణీదేవితో నిట్లనెను. మన పూర్వపుణ్యములచే నీ శుభము చేకూరనైయున్నది. మన పితృదేవతలు కృతార్థులయిరి. వరుని జేపట్టు నా ముద్దుబిడ్డనుజూచి నేను పరమానందము నొందగలను. బంధు మధ్యమున పెనిమిటిచేయిబట్టు పద్మావతినిజూచు భాగ్యము నా కెన్నడు ప్రాప్తించుననుచు సతీసమేతుడై పద్మావతీ మందిరమునకుబోయి పద్మా వతీదేవి నిట్లు బలుకరించెను. ఓ తల్లీ! నీమనసులోని యభిలాషను దెలు

పుము. నేను నెరవేర్చెదననెను. జనకునితో తన యభిలాషను జెప్పజాలక పద్మావతీదేవి లజ్జతో మోము వాంచెను. అంత నాకాశరాజు పద్మావతీ యభిలాషను గనుపెట్టి యామెను వేంకటరమణునకిచ్చి పెండ్లిజేయుదు నని యూఅడించెను.

## ఆకాశరాజు బృహస్పతిని బిలువనంపుట

అంత నాకాశరాజు పద్మావతీ వివాహమును సూచించు పత్రికను వ్రాసి వసుదానునకిచ్చి బృహస్పతిని తోడుకొనిరమ్మని యింద్రలోకమునకు బంపెను. వసుదానుడు ఆ కమ్మను గైకొని వాయువేగముతో నింద్రలోక మునకుబోయి బృహస్పతినిజూచి నమస్కరించెను. బృహస్పతి రాజపుత్త్రు నాదరముతో గూర్చుండజేసి యాకాశరాజు పంపిన కమ్మను గైకొని చదివి వసుదానునితో బయలుదేఱి వెంటనే భూమండలమునకు దిగివచ్చి ఆకాశ రాజు నాస్థానమును జేరెను. ఆకాశరాజు వచ్చిన పురోహితుని యథా పూర్వకముగ సత్కరించి యిట్లనెను. ఓ మహాత్మా! నీ యానతిచే కుమా ర్తెకు బెండ్లిజేయనెంచితిని. వేంకటాచల నివాసియగు శ్రీ వేంకటేశ్వరు నకు పద్మావతీదేవి నీయగోరుచు నేడొక వృద్ధురాలేతెంచెను. శ్రీ వేంక టేశ్వరుని గోత్ర నామధేయములను దెలిపెను. ఆ సంబంధములోని మంచిచెడ్డలను మిమ్ములనడిగి ముహూర్త నిశ్చయమునుజేయనెంచితిని. ఓ గురూత్తమా! ఇందలి మంచిచెడ్డలను నా కెఱింగింపుము అనెను. ఇట్లు పల్కు నాకాశరాజునుజూచి బృహస్పతి యిట్లనెను. ఓ రాజా! లోకములో పండ్లుగల చెట్లనాశ్రయించి పలుప్రాణులు జీవించుచుండును. మేము నట్లే నీ యాశ్రయమున బ్రతుకువారలము. నేను భూమండలమున కరిదిగ వచ్చుచుందును. కావున శ్రీ వేంకటేశ్వరుని కులవృత్త శీలాదులను నేను చక్కగ నెఱుగజాలను. శ్రీ శుకముని భూలోకములో నివసించునాతడు కావున నాతడు శ్రీ వేంకటేశ్వరుని కుల వృత్త శీలాదులను చక్కగ నెఱిగియుండును. ఈ నారాయణపురమునకు ఉత్తరపుదెస నైదుక్రోశ ముల ప్రాంతమున శ్రీ శుకముని నివసించు నాశ్రమము గలదు. ఆ శ్రీ శుకుని నిటకు రావించిన నతడు త్రుటిలో సర్వము నెఱిగింపగలడు అనెను. అంతట నాకాశరాజు దృఢభక్తి సంపన్నుడు, సోదరుడునగు తొండ

మానుని శ్రీశుకుని తోడుకొనిరా బంపెను. అంతట తొండమానుడు దివ్యవర్చసముతోనొప్పు రథమునెక్కి శ్రీశుకునాశ్రమమునకు బోయెను. అప్పట్టున శ్రీశుకుడు ధ్యానయోగమునుండి మేల్కాంచెను. తొండమాను డతనింజూచి యిట్లనెను. ఓ మునిపుంగవా! మా సోదరుడగు నాకాశ రాజుయొక్క కుమార్తె పద్మావతీదేవి యుక్తవయస్కురాలాయెను. ఆకాశ రాజు పద్మావతిని శ్రీ వేంకటేశ్వరునకిచ్చి పెండ్లిజేయ దలచెను. పద్మావతీదేవిని శ్రీవేంకటేశ్వరునకిచ్చి పెండ్లిజేయుటలోగల మంచి చెడ్డలను దెలియగోరి బృహస్పతిని రావించెను. అందలి మంచిచెడ్డల నాలోచించి తెలుపుటకై మీ రాక నెదురుజూచుచు మిమ్ములను దోడుకొనిరా నన్ను బంపిరి అనెను, ఈ పలుకు లాలించి శ్రీశుకుడు పరమానందభరితుడై చిందులుద్రొక్క నారంభించెను.

శ్లో॥ సాధూదితం వాక్యముదార విక్రమ !
త్వయాహరేః వేంకటశైలవాసినః ।
కన్యాప్రదానం పురుషార్థ సాధనం
సమస్తలోకస్య పవిత్రతాకరమ్ ॥

శ్రీ వేంకటేశ్వరునకు బద్మావతీదేవినిచ్చి పెండ్లిచేయుట ముల్లోకములకు శుభప్రదమనుచు శ్రీశుకుడు పద్మసరోవరమున మునిగి మాధ్యాహ్నికములనుదీర్చి నారాయణపురమునకుబోవ సన్నద్ధుడాయెను. అంత తొండమానుడు ఆ యోగిపుంగవుని రథముపై గూర్చుండజేసి నారాయణ పురమునకు దోడ్కొనివచ్చెను. ఆకాశరాజు శ్రీశుకుడేతెంచువార్తను విని కుశమూలఫలాదులను చేతబూని బృహస్పతిని వెంటనిడుకొని శ్రీశుకుని సత్కరింప నెదురేగెను. శ్రీశుకునకు యథోచిత సత్కారములను గావించి గజవాహనముపై గూర్చుండజేసి రాజభవనమునకు దోడ్కొని వచ్చెను. యథావిధిగ శ్రీశుక బృహస్పతులను సత్కరించి వారితో నిట్లనెను.

## శ్రీ శుకుడు పద్మావతీ వేంకటేశ్వరుల వివాహమును గొనియాడుట

ఓ యోగిపుంగవ గురూత్తములార! శ్రీ వేంకటేశ్వరునకు బద్మావతీదేవినిచ్చి పెండ్లిజేయదలచితిని. ఇందలి మంచిచెడ్డలను నా కెఱింగిం

పుడు అనెను. అంత శ్రీశుకుడు ఆకాశరాజునుజూచి యిట్లనెను. ఓ మహా రాజా! పద్మావతీదేవిని వేంకటేశ్వరునకిచ్చుటచే నీవు ధన్యుడవైతివి. నీ కులము పావనమాయెను. నీ పితృదేవతలు స్వర్గలోకమునకు బోయిరి. నీవు పూర్వజన్మములలో జేసిన పున్నెము లింతలింతలని చెప్పనలవికాదు. శ్రీ వేంకటేశ్వరుడు ముల్లోక భర్త. అతనికన్న నుత్తమవరుడు బ్రహ్మాం డములో నెందును గానరాడు. అట్టి ముల్లోకభర్త నీ తనయను జేపట్టుట కన్న శ్రేయస్కరమగునది వేఱొండులేదు. సంశయింపకుము. శుభమును శీఘ్రముగ నెరవేర్పవలయునందురు. వెంటనే యీ వివాహమును కొన సాగింపుమనెను.

అంతట నాకాశరాజు శ్రీశుకుని పల్కులకు పరమానంద నిర్భరుడై బృహస్పతినిజూచి వధూవరుల జననకాల గ్రహసంపత్తిని దిలకించి తెలుపు మనెను. అంతట బృహస్పతి పద్మావతీ వేంకటేశ్వరుల జననకాల గ్రహ సంపత్తిని విమర్శించి మిక్కిలి చక్కగనున్నదనెను. ఆకాశరాజు బృహ స్పతి పల్కుల నాలకించి జ్ఞాతి బాంధవ సంబంధి సుహృన్మిత్ర జనులతో నొక సభ నేర్పాటుగావించి వివాహ విషయమును వారల కెఱింగించెను. సభాసదులెల్లరు నామోదించిరి. అంతట నాకాశరాజు సభాస్థలిలో నిలబడి శ్రీ వేంకటేశ్వరునకు పద్మావతీదేవినిచ్చి వివాహము గావించెదనని వెల్ల డించెను. అంత బృహస్పతినిజూచి కర్తవ్యమును దెలుపుమనెను.

## బృహస్పతిఆకాశరాజుచే శ్రీ వేంకటేశ్వరునకు శుభలేఖను వ్రాయించుట

అంత నాకాశరాజుపల్కులాలించి బృహస్పతి యాకాశరాజుతో నిట్లనెను. ఓ రాజా! శ్రీవేంకటేశ్వరునకు శుభలేఖన్వ్రాసి విప్రునిచేతి కిచ్చి పంపుమనెను. అంతట నాకాశరాజు బృహస్పతి పల్కుల కిట్లనెను. ఓ గురూత్తమా! అప్రాకృత దివ్యమంగళ స్వరూపునకు ప్రాకృతులమగు మనమువ్రాయు నంశము లెట్టులుండవలెనో తెలుపుమనెను. అంత బృహ స్పతి యీక్రిందివిధమున శ్రీవేంకటేశ్వరునకు శుభలేఖను వ్రాయించెను.

శ్రీరస్తు.

శు భ ప త్రి క.

శుభమస్తు. ఓ నిత్య శుద్ధ బుద్ధ ముక్త స్వభావా! ఓ సచ్చిదానందమూర్తీ! ఓ అద్వితీయా! ఓ అనంతస్వరూపా! ఓ భక్తప్రియా! ఓ దేవాధిదేవా! వేంకటాచలనివాసా! ఓ శ్రీవేంకటేశా! దీవనలు.

నీ యనుగ్రహవశమున బంధు మిత్ర పరివారముతో గుశలుడనై యున్నాను. మీ క్షేమోదంతములను దెలుపగోరెదను. నా కుమార్తెయగు చి॥ సౌ॥ పద్మావతీదేవిని నీకిచ్చి వివాహమును గావింపనెంచితిని. నా కోరికను నెరవేర్ప వేడెదను. శ్రీశుక బృహస్పతులు నా హృదయమును నెఱుంగుదురు. నీవు సంశయింపబనిలేదు. రాబోవు వైశాఖ శుద్ధ దశమీ శుక్రవారము సుముహూర్తమునుగావింప బెద్దలు నిశ్చయించిరి. కావున నాటికి బంధుమిత్ర పరివారముతో నేతెంచి నా మనోభీష్టమునుదీర్చి నేజేయు సత్కారములను గైకొన వేడెదను. ఓ పురుషోత్తమా! నేనింతకుమించి వ్రాయబనిలేదు. శ్రీశుకుడు సకలము నెఱింగింపగలడు.

శ్లో॥ ఇత్యాశిషఃసంతు మహానుభావ తే
సమస్త కల్యాణ గుణార్ణవప్రభో!
నిత్యాయ సత్యాయ సుఖస్వరూపిణే
సమస్తలోక ప్రభవే మహాత్మనే ॥

నారాయణపురమ్. ఇట్లు,
చైత్రశుద్ధ త్రయోదశి. ఆ కా శ రా జు.

ఇట్లు శుభలేఖనువ్రాసి శ్రీశుకునిచేతబెట్టి క్రోశపర్యంతము శ్రీశుకుని సాగనంపి శ్రీశుకునితో నిట్లనెను. ఓ మునిపుంగవా! ఎట్లయినను శ్రీవేంకటేశ్వరు నంగీకరింపజేయుము. శ్రీవేంకటేశ్వరునకు సకల మర్యాదలను గావింతును. లక్షలాది ద్రవ్యముల నొసగెదను. నా కోరికను చెల్లింపుమనుచు శ్రీశుకుని వేంకటాచలమునకు బంపెను. అంత శ్రీశుకుడు వకుళాదేవితో వేంకటాచలమునకు బోయెను.

ఇప్పట్లున శ్రీవేంకటేశ్వరుఁడు వకుళాదేవిరాకకై నిరీక్షించుచుండెను. దివాకరుడు గగనతలమధ్యమున వ్రేలాడుచుండెను. ఇట్టి యవసరమున శ్రీశుకుడు వకుళాదేవితో వేంకటాచలమునెక్కి వేంకటేశ్వర సన్నిధాన మును జేరెను. శ్రీ వేంకటేశ్వరుడు శ్రీశుకునిజూచి తనకార్యము ఫలించెనా? అనెను. శ్రీశుకుడద్దానికి నీ కార్యము సఫలమాయెననుచు శ్రీవేంకటేశ్వరునకు సాష్టాంగము నాచరించెను. అంత శ్రీ వేంకటేశ్వరుఁడు శ్రీశుకుని లేవనెత్తి యతనితో నిట్లనెను. లోకములో బెండ్లినిమిత్తము అసత్యములనాడియు బాపమును బొందరు. వైకుంఠమున సుఖింతురు. ఓ మునిపుంగవా! బ్రహ్మ నా నాభికమలములో బుట్టెను. లక్ష్మీదేవి నా భార్య. ఈ బ్రహ్మాండములోని జీవకోటులన్నియు నేను పాలింపదగినవి. ఇట్టి నా వివాహవిషయములో నసత్యములను బలికినను దోసములేదని చెప్ప నేల? నీవు చేసిన యుపకారమునకు బ్రత్యుపకారము జేయదగినదెద్దియు నాయొద్దలేదు. కావున నిన్ను గౌగలింతును. ఇంతకుమించిన బహుమానము నీకు వేఱొండులేదనుచు శ్రీశుకుని గౌగలించెను. ఓ మునిపుంగవా! నీవు బహు పుణ్యాత్ముడవు. నీ పుణ్యములకు మితిలేదు. పూర్వము నాకు సీతావృత్తాంతము నందజేసి వాయుసూనుడగు నాంజనేయులు మహోపకారమును గావించెను. అందులకు నేను మిక్కిలి సంతసించి హనుమంతునకు నా పంక్తిని గుడువబెట్టితిని. అట్టి హనుమంతునికన్నను నీవు నాకు మిక్కిలి ప్రియుడవు అనెను. ఇవ్విధమున బ్రియములబలుకుచు శ్రీవేంకటేశ్వరుడు శ్రీశుకునియొద్దనుండు శుభలేఖను గైకొని కండ్లనద్దుకొనెను. ఆకాశరాజుయొక్క యోగక్షేమములనుగూర్చి మధురమధురముగ శ్రీశుకునితో గొంతతడవు ముచ్చటించి శుభలేఖను జదువుకొనెను. శ్రీ వేంకటేశ్వరుడు శుభలేఖను జదువుకొని మిక్కిలి పరమానందభరితుడై ఆకాశరాజునకు తాను ప్రతిపత్రమును వ్రాయబూని యీక్రింది తెలుగున స్వయముగ బ్రత్యుత్తరమును వ్రాసెను.

శ్రీరస్తు.

శుభమస్తు. రాజాధిరాజపూజ్యుడు సుధర్మసుతుడునగు నాకాశరాజునకు శ్రీ వేంకటేశ్వరుడు భక్తిపూర్వకముగ నమోవాక్యముల నర్పించి వ్రాయు విన్నపములు.

రాజాధిరాజుల కిరీటములచే మెఱయు పాదుకలుగల ఓ మహా రాజా! ఓ సకలగుణపూర్ణా! ఓ సుధర్మతనయా! నమోనమః. బాలుడనగు నా విజ్ఞప్తి నందుకొనుడు. తాముపంపిన శుభలేఖనుజూచి మిక్కిలి సంత సించితిని. రాబోవు వైశాఖ శుద్ధ దశమీ శుక్రవారమున తాము నా కొన రింపబూనిన కన్యాదానమునంగీకరించి మీ కన్నెను జేపట్టగలను. పూర్వము సముద్రుడు తన కుమార్తెను నాకిచ్చి కీర్తినిబడసినరీతి తాము దశదిశ లందును గీర్తినిబడయగలరు. మీరు పెద్దలు. నేనింతకుమించి మీకు వ్రాయబనిలేదు. ఈ శ్రీశుకుడు సకలము నెఱుగును.

ఇట్లు

వేంకటాచలము. ప్రణామపూర్వకముగ విన్నవించు,

వేంకటేశ్వరుడు.

ఇవ్విధమున శుభలేఖనువ్రాసి శ్రీశుకునిచేతబెట్టి స్వర్గపట్టణమును ధిక్కరింపజాలు నారాయణపురమున నివసించు నాకాశరాజునకు బంపనెంచి శ్రీవేంకటేశ్వరుడు శ్రీశుకునితో నిట్లనెను. ఓ మునిపుంగవా! నా కుల గోత్రములను నివాసదేశము నెఱుగక నాకు కన్నెనీయ నాకాశరాజు సమ కట్టునా? అనెను. ఇందులకు శ్రీశుకుడు శ్రీవేంకటేశ్వరునితో నిట్లనెను. ఓ హరీ! నీకు కులములేదు. గోత్రములేదు. నీకు జనన జరా మరణ ములు లేవు. నీకు వృద్ధిహ్రాసములులేవు. నీకు నివసింప నెలవులేదు. ఓ పురుషోత్తమా! జగన్నాథుడవగు నీకిదియంతయు నొక విడంబ నముమాత్రము. ఆకాశరాజు నీకు తప్పక తన కన్నె నీయగలడు. సంశ యింపకుము అనుచు శ్రీశుకుడు హరిదర్శనముచే బరమానందభరితుడై హరియనుజ్ఞనువడసి నారాయణపురమునకు జనెను. అంతట శ్రీవేంక టేశ్వరుడు మార్గాయాసముచే నలసిన వృద్ధమాత వకుళాదేవిని జూచి యిట్లనెను.

## వకుళాదేవి శ్రీ వేంకటేశ్వరునకు జెప్పిన పద్మావతీ పరిణయోదంతము

ఓ తల్లీ! ఇంత యాలసింపనేల? నారాయణపురమందలి వార్తను విశదముగ నాకెఱింగింపుమనెను. అంత వకుళాదేవి వేంకటేశ్వరునితో

నిట్లు చెప్పదొడగెను. ఓ పురుషోత్తమా! బహుప్రయత్నములను గావించి కన్నెను సాధించితిమి. ఈ కార్యములో దైవయత్నముకాని మానుష యత్నముకాదు. దైవవశమున నొక యెఱుకలసాని నారాయణపురమునకు వచ్చెను. ఆ యెఱుకలసాని రాకుమార్తెయగు పద్మావతిని నీకిమ్మని చెప్పెను. ఆ కన్నెయు నిన్నుగాక మఱియొకని జేబట్టనని పట్టుబట్టెను. వారి పల్కులకు విస్మయానందములనొంది నాకాశరాజు తన కుమార్తెను నీకిచ్చి పెండ్లిజేయుదునని సభామధ్యమున బలికెను. ఇదియంతయు నీకు దెలిసియేయుండును. నీకన్న దైవము వేఱొండుగలదే! అనెను. శ్రీవేంకటేశ్వరుడు తల్లిమాటలాలకించి చిఱునగవుతో తల్లిని పరమానందమున ముంచితేల్చుచు మరల నిట్లనెను.

## శ్రీ వేంకటేశ్వరుడు బ్రహ్మాదులను రావించుట

ఓ తల్లీ! ఈ వివాహ ప్రయత్నముల నేలకో నా యంతఃకరణము నంగీకరింపకున్నది. ఏలనన, బంధువిహీనునకు బంధువర్గముగలవారల తోడి సంబంధమును లోకులు ప్రశంసింపరు. కులమర్యాదలు ధనధాన్యాది సంపదలు దుల్యముగగలవారలకు వివాదముకాని, మైత్రికాని శోభించును. వియ్యము కయ్యము నట్లే తుల్యులకు రాణించును. నేను ఒంటరి కాడను. ఆకాశరాజు బంధుసంపదచే విరాజిల్లుచుండెను. బంధుసంపదలేని నాకు బంధుసంపదచే విరాజిల్లు నాకాశరాజుతో సంబంధమెట్లు పొసగును? ఏదో నొకవిధమున బొసగినను నాకు మనస్కరించుటలేదు. ఇదియును గాక బంధువిహీనుడనగు నాకు ఆకాశరాజు తనపుత్రినీయ సమ్మతించునా? అనెను. అంత వకుళాదేవి వేంకటరమణునితో నిట్లనెను. ఇట్టి సంబంధమును మునిపుంగవులెల్లరు దప్పక ప్రశంసింతురు. శ్రీ శుకబృహస్పతులిరువురు నీ వివాహమునుగావింప బద్ధకంకణులై యుండిరి. ఆకాశరాజు తప్పక నీకు బిల్లనిచ్చును; సంశయింపకుము. అతని యాశను నిరాశను జేయకుము. ఓ గోవిందా! బ్రహ్మరుద్రాదులగు నీ బంధువర్గమును పుత్ర మిత్ర కళత్రాదులతో రావింపుము. ఆకాశరాజు సయితము నీ బంధువర్గమునుజూచి పరమానందభరితుడు కాగలడు అనెను. శ్రీ వేంకటేశ్వరుడు తల్లిమాటల నాలకించి ఆదిశేష గరుడులను మనసులో దలపోసెను.

అంతట నా యిరువురు శేషాచల వల్లభునిచెంత నావిర్భవించిరి. శ్రీ వేంకటేశ్వరుడు శుభలేఖలను వారిచేతబెట్టి బ్రహ్మనుబిలువ గరుడుని సత్యలోకమునకును, రుద్రునిబిలువ నాదిశేషుని గైలాసమునకును బంపెను. అంత గరుడుడు వాయువేగముతో సత్యలోకమునకుబోయి దివ్యతేజముతో భాసిల్లు చతుర్ముఖునకు నమస్కరించి శుభలేఖ నందజేసెను. అంత చతుర్ముఖుడు శ్రీ వేంకటేశ్వరుని కుశలములనుగూర్చి ముచ్చటించుచు శుభలేఖ నీ క్రిందివిధమున జదివెను.

శుభమస్తు.

శ్రీరస్తు. నాభికమలములో బుట్టిన పుత్త్రుడు చిరంజీవియు నగు బ్రహ్మను వేంకటరమణుడు సకల మంగళములతో దీవించివ్రాయు శుభలేఖార్థములు.

కలియుగములో నాకాశరాజు తనకుమార్తెయగు పద్మావతిని నాకిచ్చి పెండ్లిజేయ సమకట్టెను. ఈ శుభలేఖనుజూచిన వెంటనే పుత్త్ర మిత్ర కళత్రాదులతోడను గంధర్వలోకపాలాది సకల పరివారముతోడను విచ్చేసి యీ కార్యమును జయప్రదముగావింప గోరెదను.

ఇట్లు

వేంకటాచలము. వేంకటరమణుడు.

చతుర్ముఖుడు శుభలేఖను జదివి పరమానందభరితుడై ద్వారపాలకులను బిలచి యిట్లనెను. ఓ ద్వారపాలకులారా! భరతఖండములో దక్షిణ దిగ్భాగమున వేంకటాచలము కలదు. అందు నా జనకుడు శ్రీవేంకటేశ్వరుడు నివసించుచుండెను. చంద్రవంశమున బుట్టిన యాకాశరాజు దక్షిణాపథమున నారాయణపురమును తన రాజధానిగ జేసుకొని రాజ్యమును బాలించుచుండెను. ఆకాశరాజు తన కుమార్తెయగు పద్మావతిని శ్రీవేంకటేశ్వరునకిచ్చి కలియుగములో బెండ్లిజేయ సమకట్టెను. కావున సకల సన్నాహములను గావింపుడు. దేవదుందుభులను మ్రోయింపుడు. సేనానాయకులు తమతమ సైన్యములను భరతఖండాభిముఖముగ సాగబెట్టు డురుగాక అని యానతిచ్చి తావంతఃపురమునకు బోయెను.

బ్రహ్మ అంతఃపురమునకుబోయి సకలాభరణభూషితుడై భార్యా పుత్త్రాదులను వెంటబెట్టుకొని బయలువెడలెను. అంతఃపురస్త్రీలు విమానముల నధిష్ఠించిరి. ఒక్కొక్కరును తమతమ యానముల నధిష్ఠించిరి. చతుర్ముఖుడు హంసవాహనము నలంకరించెను. సకల సైన్యముల నాయత్తపఱచి సేనాధిపతులు వెంటరాజొచ్చిరి. కిన్నరులు నృత్యములను జేయ దొడగిరి. గంధర్వులు పాడసాగిరి. భేరీ మృదంగ పణవ గోముఖ మురజ ఢక్కా డిండిమములను పలువిధ వాద్యములను మ్రోయింప నారంభించిరి. చతుర్ముఖుడు యిట్లు భూమండలమునకు బయలువెడలి క్రమ క్రమమున సత్యలోక తపోలోక జనలోక మహర్లోక సువర్లోకాదులను దాటి సాగిపోవుచుండెను. అందందు ఆయాలోకములోనివారలు సయితము పెండ్లివారలతోగలసి వేంకటాచలమునకు బయలుదేరుచుండిరి.

## చారులు శ్రీ వేంకటేశ్వరునకు బ్రహ్మరాక నెఱింగించుట

ఇట్లుండ శ్రీవేంకటేశ్వరుడు పెండ్లిపిలుపునకై సత్యలోకమునకు బోయిన గరుడుడు రాకుండుటకు గతమెద్దియని విచారించునంత నొక్కచారుడేతెంచి యిట్లనెను. చతుర్ముఖుడు పెండ్లికై సత్యలోకమున బంధు మిత్ర పరివారముతో బయలువెడలి గంగానదినిదాటి వచ్చుచుండెననెను. అంతలో మఱియొకచారుడేతెంచి వేంకటేశ్వరునితో చతుర్ముఖుడు గోదావరీనదిని దాటెనని విన్నవించెను. ఇంతలో గరుడుడేతెంచి శ్రీవేంకటేశ్వరునితో నిట్లనెను. ఓ మహాప్రభూ! మీ పుత్త్రుడగు చతుర్ముఖుడు కృష్ణానదినిదాటి శ్రీశైలమునకు వచ్చెను. అటనుండి యహోబిలమును జేరెననెను. ఇంతలో విష్వక్సేనుడేతెంచి శ్రీవేంకటేశ్వరునితో నిట్లుచెప్పెను. ఓ మహాప్రభూ! నీ పుత్త్రుడగు చతుర్ముఖుడు తుంబురు తీర్థమున విడిసియుండెను. అందు స్నానమాచరించి నిత్య కృత్యములనుదీర్చి యిపుడిందురాగలడనెను. శ్రీవేంకటేశ్వరుడాతని పల్కుల నాలకించి పరమానందముతో దిగ్గునలేచి గరుడారూఢుడై పుత్త్రునిజూడ నుత్తరపుదెసనుండు తుంబురు తీర్థాభిముఖుడై బయలువెడలెను. ఇంతలో విష్వక్సేనుడు శ్రీ వేంకటేశ్వరుని రాకను చతుర్ముఖునకు దెలిపెను. అంత చతు

ర్ముఖుడు నిత్యకృత్యములనుదీర్చి పాదచారియై శ్రీవేంకటేశ్వరునిచెంత కేతెంచెను.

## శ్రీ వేంకటేశ్వర చతుర్ముఖు లొండొరులతో ముచ్చటించుట

చతుర్ముఖుడు శ్రీవేంకటేశ్వరునిచెంతకేతెంచి సాష్టాంగము నాచరించెను. శ్రీవేంకటేశ్వరుడు గరుడునిదిగి పుత్త్రు నాలింగనముచేసి లేవదీసి గుశలముల నడుగజొచ్చెను. ఒండొరులు గుశలములను ముచ్చటించుచుండ నానందబాష్పములతో శ్రీవేంకటేశ చతుర్ముఖుల కన్నులు కన్నీటితో నిండియుండెను. ఇట్టి పితృపుత్త్రులనుజూచి సత్యలోకవాసులు పరమానందమును బొందిరి. పిమ్మట శ్రీవేంకటేశ్వరుడు సపరివారుడగు చతుర్ముఖునితో స్వామిపుష్కరిణీ తీరమందలి చింతచెట్టు నీడలోగల తన నివాసమగు పుట్టకడ కేతెంచెను. ఒండొరులు గుశలములను ముచ్చటించుచుండిరి. అంత చతుర్ముఖునితో శ్రీవేంకటేశ్వరుడు తన క్షేమోదంతమును ఇట్లు చెప్పదొడగెను. ఓ నాయనా! ద్వాపరాంతమునందొకప్పుడు నేను వైకుంఠమున లక్ష్మీదేవితో విలాసముగ శేషశయనమున బరుండియుంటిని. అప్పట్టున భృగువు నాచెంత కేతెంచెను. నేను అతనిరాకను గమనింపనందులకై గోపించి నా వక్షమున దన్నెను. ఇట్టి పరాభవమునకు నీ జనని లక్ష్మీదేవి కోపించి వైకుంఠమునువీడి కొల్హాపురమునకు బోయెను. నేనప్పట్టున వైకుంఠమున నివసింపజాలక భూలోకమునకేతెంచి ఈ వేంకటాచలమున నివసింపనెంచితిని. కాని నాకీ వేంకటాచలమున నిలువ నీడలేకపోయెను. కావున నేనీ పుట్టలో నివసింప నారంభించితిని. ఈతరుణమున చోళరాజు గోవులనుమేపు గొల్లవాడొక్కడు నన్ను గండ్రగొడ్డలితో గొట్టెను. బృహస్పతి నా వ్రణమునుమాన్పు మందునుజెప్పి పుణ్యమును గట్టుకొనెను. నాకు ఈ వేంకటాచల నివాసియగు వరాహమూర్తి నివాసము నొసగెను. ఈ వకుళాదేవి వరాహమూర్తి దాసురాలు. ఈమె పూర్వము యశోదాదేవి. ఇట్టులుండ ఆకాశరాజు తన కుమార్తెయగు పద్మావతీదేవిని నాకిచ్చి పెండ్లిచేయుదునని వర్తమానము నంపెను.

ఈ కార్యమును కొనసాగింప నిన్ను రావించితినని పలుకుచుండునంతలో గగనతలమున దుందుభులు మ్రోయు ధ్వనులు వినబడెను.

# రుద్రుడు వేంకటాచలమునకు వచ్చుట

ఈ దేవదుందుభులు యెవ్వరిరాకకై యుండునోయని శ్రీవేంకటేశ్వరుడు తలపోయునంతలో మహాదేవుడు పార్వతీసమేతుడై ప్రమధాది గణములు సేవింప నేతెంచి శ్రీవేంకటేశ చతుర్ముఖులకు మ్రొక్కి నిలచెను. శ్రీ వేంకటేశ్వరుడు శంకరుని గౌగిలించి యాదరముజూపి సల్లపింపదొడగెను. అంతలో నరవాహనుడగు కుబేరుడు పుత్త్ర మిత్ర భార్యా బంధు పరివృతుడై యేతెంచెను. శ్రీ వేంకటేశ్వరుడు కుబేరునిజూచి సకలైశ్వర్యములు వృద్ధిజెందుగాక అని దీవించునంతలో స్వధాస్వాహాదేవులతో మేషవాహనుడగు అగ్నిదేవుడేతెంచెను. శ్రీవేంకటేశ్వరుడు అగ్నిదేవు నాదరించి కూర్చుండబెట్టునంతలో యముడు చిత్రగుప్తుడు వరుణుడు ఇంద్రుడు వాయువు మున్నగు దేవతలొక్కరొక్కరు దమతమ వాహనములతో నేతెంచుచుండిరి. శ్రీవేంకటేశ్వరుడు వచ్చినవారిని యధోచితముగ బలుకరించి యాదరించుచుండెను. ఇంతలో కశ్యపుడు, అత్రి, భరద్వాజుడు, వామదేవుడు, గౌతముడు, విశ్వామిత్రుడు, వసిష్ఠుడు, వాల్మీకి, జమదగ్ని మున్నగు మునులు తమ తమ భార్యాపుత్త్రమిత్ర శిష్యవర్గములతో నేతెంచిరి. రాజాధిరాజులేతెంచిరి.

ఈ వచ్చినవారలను శ్రీ వేంకటరమణుడు యధోచితముగ నాదరించునంతలో విశ్వకర్మయు నేతెంచెను. శ్రీవేంకటరమణుడు దేవేంద్రుని బిలచి విశ్వకర్మచే దివ్యభవనములనుగట్టింప నాజ్ఞాపించెను. అంత దేవేంద్రుడు విశ్వకర్మచే చూడముచ్చటగొలుపు మిక్కిలి విశాలమగు మందిరములను వేంకటాచలముపై గట్టించెను. మఱియు నింద్రుడు విశ్వకర్మను నారాయణపురమునకు దోడ్కొనిపోయి కల్యాణమంటపము మున్నగు వానిని గట్టింప సమకట్టెను. విశ్వకర్మ నారాయణపురములో దివ్యమందిరములను గట్టదగినవిధమున ధరాతలమును చక్కజేయించి గోశాల

లను నిర్మించెను; గజశాలలను నిర్మించెను; అశ్వశాలలను నిర్మించెను; ఇతర వాహనమంటపములను నిర్మించెను; నూతులను ద్రవ్వించెను; చూడ ముచ్చటగొలుపు కల్యాణమంటపమును గట్టించెను; పెండ్లిపందిరిని గట్టించెను; వీధివీధులందును రత్నతోరణములను గట్టించెను. నారాయణపుర మెందుజూచినను ముద్దులొలుకుచుండెను.

ఇది యిట్లుండ వేంకటాచలమున శ్రీవేంకటరమణుడు వచ్చిన దేవతలనుజూచి యిట్లనెను. ఓ దేవతలారా! ఆకాశరాజు తన కుమార్తెను నాకిచ్చి పెండ్లిజేయ సమకట్టెను. నాకు ఆమెను జేబట్టు తలంపుకలదు. మీరలంగీకరించిన నేనామెను జేపట్టెదననెను. అందులకు సకల దేవతలు నంగీకరించిరి. చతుర్ముఖ మహాదేవులు సమ్మతించిరి.

## శ్రీ వేంకటేశ్వరుడు వచ్చినవారిని పెండ్లిపనులలో నియమించుట

అంతట శ్రీవేంకటరమణుడు వసిష్ఠునిబిలచి పౌరోహిత్యమున నియమించెను. వచ్చిన దేవతలను, ఋషులను సత్కరింప మహాదేవుని నియమించెను. దేవతల నాహ్వానింప కుమారస్వామిని నియమించెను. వచ్చిన దేవతలకు తాంబూలాది సత్కారములనొసగ మన్మథుని నియమించెను. శాకపాకాది కార్యములలో నగ్నిదేవుని నియమించెను. మంచి నీటి సదుపాయమునకు వరుణుని నియమించెను. దుష్టశిక్షణము, శిష్టరక్షణముగావింప యముని నియమించెను. వచ్చినవారలకు సుగంధ ద్రవ్యములనొసగ వాయువును, నూతన వస్త్రాద్యలంకారములనొసగ కుబేరుని నియమించెను. దీపకాంతులకై చంద్రుని నియమించెను. ఇట్లు వచ్చిన వారల నయ్యయికార్యములందు నియోగించునంత చతుర్ముఖుడు వేంకటేశ్వరునిజూచి మంగళస్నానము నాచరింపుమనియు సాంగోపాంగముగ కులదేవతలను బూజింపుమనియు జెప్పెను.

# శ్రీ వేంకటేశ్వరుడు కొల్హాపురమునుండి లక్ష్మీదేవిని రప్పించుట

శ్రీ వేంకటరమణుడు చతుర్ముఖుని మాటలాలకించి ప్రాకృతునివలె నిజసతీమణియగు లక్ష్మీదేవిని తలచి చతుర్ముఖునితోజెప్పి విచారింప సాగెను. ఓ చతుర్ముఖా! లక్ష్మీదేవిలేనిచో శోభలేదు. ఇంద్రాది సకల దేవతలున్నను, చంద్రుడులేని నక్షత్రములపగిది సభారంగము శోభిల్ల నేరదు; చెట్లులేని యరణ్యమువలె రాణింపదు; ఱెక్కలులేని పక్షులవలె నుండును; ఫలములులేని చెట్లు పగిది దోచును. లక్ష్మీదేవిలేక నాకీ వివాహము సంతసమునుగూర్పజాలదనెను. అంత వేంకటేశ్వరుని పలుకులను విని శంకరు డిట్లనెను. ఓ తాతా! నీవు అప్రమేయుడవు; అసంగుడవు. ప్రాకృతునివలె నీవు విచారింపనేల? అనెను. శ్రీ వేంకటేశ్వరుడు పౌత్రుని యూఱడింపుల నాలకించి అతనితో నిట్లనెను. నాయనా! బాల్యవశమున నీ వెఱుగజాలకున్నావు. చతుర్ముఖునకు పగటికాలముతీఱునంత ప్రపంచమంతయు ప్రళయసాగరమున మునుగును. అప్పట్టున సయితము లక్ష్మీదేవి నాకు శయ్యాసఖురాలై నా హితమునుగోరి నన్నువీడక నాతో గ్రీడించుచుండును. అట్టి రమాదేవిలేక నేనెట్లు సంతసింపగలను? అనెను. చతుర్ముఖ మహాదేవులు వేంకటేశ్వరుని మాటల నాలకించి రమాదేవిని రప్పింప నెవ్వరినైన బంపుదుమనిరి. అంత వేంకటేశ్వరుడు సూర్యుని బిలచి కొల్హాపురమునకుబోయి లక్ష్మీదేవిని తోడుకొని రమ్మనెను. భాస్కరుడు వేంకటేశ్వరుని యానతి నాలకించి యిట్లనెను. ఓ ప్రభూ! రమాదేవి నన్నెట్లు విశ్వసించును? ఆమెను నేనేవిధమున దోడుకొని రావలయును? అనెను. అంత వేంకటేశ్వరుడు భాస్కరునితో నిట్లనెను. ఓ భాస్కరా! నీవు కొల్హాపురమునకుబోయి లక్ష్మీదేవిని జూడుము. నోరు మెదపక నిలచి కంట నీరుగార్చుచుండుము. లక్ష్మీదేవి నిన్నుజూచి నీ యధికారమున సంభవించిన కష్టసుఖములనుగూర్చి ముచ్చటింప మొదలిడును. నిన్ను ఊఱడింపబోవును. అంత నామెతో నీవు మెల్లమెల్లన వేంకటేశ్వరుడు వ్యాధిగ్రస్తుడై ప్రాణాపాయపరిస్థితిలోనుండెనని చెప్పుము.

ఆమె సర్వజ్ఞురాలయ్యును నా మాయచే మోహితురాలై యథార్థము నెఱుగ జాలక నీ మాటలను విశ్వసించును; వెంటనే బయలుదేఱి నీవెంట నిటకు రాగలదు; పో! పొమ్ము!! అనెను. అంత భాస్కరుడు శ్రీవేంకటేశ్వరుడు చెప్పిన చొప్పున కొల్హాపురమునకుబోయి లక్ష్మీదేవితో వేంకటేశ్వరుడు మిక్కిలి ప్రాణాపాయ పరిస్థితిలోనుండెనని చెప్పెను. లక్ష్మీదేవి భాస్కరుని పలుకు లాలకించి మిక్కిలి ఖేదముతో బయలువెడలి వేంకటాచలమునకు వచ్చెను. శ్రీ వేంకటేశ్వరుడు లక్ష్మీదేవిరాకనెఱిగి వ్యాధిగ్రస్తునివలె చతుర్ముఖ రుద్రుల భుజములపై చేతుల నూతగజేసికొని లక్ష్మీదేవిని జూడ నెదురేగెను. ఇట్టి వేంకటేశ్వరునిజూచి లక్ష్మీదేవి రథమునుదిగి వచ్చి వేంకటేశ్వరుని పదపంకజములను పూలతో బూజించి కడుభక్తితో గౌగలించెను. అంత శ్రీవేంకటేశ్వరుడు మిక్కిలి సంతసించి రమాదేవితో కుశలములనాడజొచ్చెను. రమయు శ్రీ వేంకటేశ్వరుని యోగక్షేమములను ముచ్చటింప నారంభించెను. ఇట్టి తరుణములో శ్రీ వేంకటేశ్వరుడు లక్ష్మీదేవికి తాను పూర్వము వేదవతీదేవికి గావించిన ప్రతిజ్ఞను జ్ఞప్తికిదెచ్చి తాను వేదవతినిజేపట్టుకాలము ఆసన్నమాయెననెను. రమాదేవియు వేదవతిని జేపట్టుమని వేంకటేశుని బ్రతిమాలెను.

## రమాదేవి వేంకటేశునకు మంగళస్నానమును జేయించుట

ఇట్టి తరుణమున చతుర్ముఖుడు గరుడ వరుణులను శ్రీ వేంకటేశ్వరునకు మంగళస్నానపు టేర్పాటులను గావింప నియమించెను. గరుడుడు సువర్ణ భాండములను దెప్పించెను. వరుణుడు ఆ సువర్ణ భాండములను ఘుమఘుమలాడు దివ్యతోయములతో నింపెను. అంతట లక్ష్మీదేవి వకుళా పార్వతీదేవులను వెంటనిడుకొని అరుంధతీదేవిని ముందుబెట్టుకొని వేంకటేశ్వరునకు మంగళస్నానపు టేర్పాటును సిద్ధము జేయ నారంభించెను. నలుదిక్కులందును కలశములను బెట్టెను. ఆ కలశములమధ్య రత్నపీఠము నలంకరించెను. పిమ్మట వేంకటరమణుని మంగళస్నానమునకు రమ్మని బిలచెను. ఇప్పట్టున వేంకటేశ్వరుడు కన్నీరుగార్చుచు చతుర్ముఖునితో నిట్లనెను. ఓ నాయనా! నాకు తల్లిలేదు.

తండ్రియు లేడు, అక్కచెల్లెండ్రులేరు, అన్నదమ్ములు లేరు, మేన మామలు లేరు, మేనల్లుళ్ళు లేరు. ఇట్టివాని జన్మము వ్యర్థము. శుభాశుభ ములలో నిట్టివానికి సాహాయ్యములేదు. నన్నిపుడు దీవించి మాడపై తైలమును బెట్టువారెవరు? తల్లితండ్రులులేనివానిగతి యిట్లులుండును. తల్లితో తుల్యమగు మిత్రము వేఱొండులేదు. తండ్రివలె సుఖింపజేయు వాడు లేడు. భార్యతో తుల్యమగు భాగ్యములేదు. పుత్త్రునితో తుల్యమగు గతియులేదు. అన్నదమ్ములతో తుల్యుడగు బంధువులేడు. ఏమి చేయు దును? అనుచు లీలామానుషుడగు వేంకటేశ్వరుడు వెక్కివెక్కి యేడ్వ నారంభించెను. అంత చతుర్ముఖుడు వేంకటరమణుని ఇవ్విధమున నూఱడింపజొచ్చెను. ఓ జనకా! నీకు నేను పుత్త్రుడను. శంకరుడు నీ పౌత్రుడు. మన్మథుడు నీకు మఱియొక పుత్త్రుడు. కుమారస్వామి నీకు మునిమనుమడు. సరస్వతీదేవి నీ కోడలు. ఓ పురుషోత్తమా! నీవు లీలా మాత్రముగ విడంబనము జేయుచుంటివి; కాని వేఱొండుగాదు. లే! లెమ్ము!! అనుచు మంగళస్నానముగావింపుమని లక్ష్మీదేవికి సైగజేసెను. అంతట లక్ష్మీదేవి వేంకటేశ్వరునితో నిట్లనెను. ఓ జగన్నాథా! నీ హృద యమును గనుగొంటిని; లెమ్ము! దుఃఖమును విడువుము; రా! రమ్ము! రత్నపీఠము నలంకరింపుము; మంగళస్నానమును జేయింతుననెను. అంతట వేంకటేశ్వరుడు లోకవిడంబనముజేయుచు వసిష్ఠునకు మ్రొక్కి మంగళస్నానమునుగావింప ననుజ్ఞనిమ్మనెను. అంత వసిష్ఠు డనుమతింప వేంకటరమణుడు మంగళస్నానమునాచరింప రత్నపీఠము నలంకరించెను.

సువాసినులు పాటలుపాడజొచ్చిరి. మునిపుంగవులు వేదపారాయ ణము నారంభించిరి. మంగళవాద్యములు మ్రోయదొడగెను. ఇట్టి సమ యములో లక్ష్మీదేవి సుగంధద్రవ్యములతో బరిమళించు తైలమును సువర్ణపాత్రముతో చేతబట్టి రత్నపీఠముపై ప్రాచీనాభిముఖముగ శ్రీ వేంక టేశ్వరుని గూర్చుండబెట్టి కేశబంధమును విప్పి కేశములను విరజిమ్మి దీవింపదొడగెను. ఓ గోవిందా! దీర్ఘాయువుతో వర్ధిల్లుము, బహు సంతాన వంతుడవుకమ్ము, ఏకఛత్రాధిపత్యముతో బదునాలుగులోకముల నేలుము. అనుచు తైలమును మాడపైబెట్టి శిరమును మర్దించెను. పిమ్మట సుగంధ తైలముతో దేహమును మర్దించి పునుగు కస్తూరి మున్నగువానితో నలుగు

బెట్టెను. సువర్ణకుంభములతో దెచ్చిన దివ్యజలములతో నభిషేకము జేయించెను. అటుపిమ్మట సువాసినులు స్వయముగదెచ్చిన మౌక్తిక తోయములతో శ్రీవేంకటేశ్వరునకు దీవనలతో జలకమాడించెను. సావిత్రీదేవి తెచ్చియిచ్చిన శుభ్రవస్త్రములతో లక్ష్మీదేవి శ్రీవేంకటేశ్వరుని శరీరమును తుడిచెను. పార్వతీదేవి తెచ్చియిచ్చిన సుగంధద్రవ్యముల ధూపముతో కేశబంధము నార్చెను. రతీ శచీదేవులు శ్రీ వేంకటేశ్వరునకు వింజామరలను వేసిరి. భారతీదేవి ఛత్రమునుబట్టెను. గంగాదేవి పాదుకలను దెచ్చియిచ్చెను. శ్రీ వేంకటరమణుడు పాదుకలనుదొడగి మెల్లమెల్లన స్వామిపుష్కరిణీ తీరమునకు వచ్చెను. స్వామిపుష్కరిణీ తీరమునందు అమర్పబడియున్న ఉత్తమాసనము నలంకరించెను. అప్పట్టున శ్రీవేంకటరమణుని బ్రహ్మాది దేవతలును, ఇంద్రాది దిక్పాలకులును, కశ్యపాది మునిపుంగవులును సేవించుచుండిరి. రంభాదులు నృత్యము సలుపుచుండిరి. తుంబురుడు మున్నగువారలు గానము సలుపుచుండిరి. ఇప్పట్టున శ్రీవేంకటరమణుడు అష్టమినాటి చంద్రునిబోలు లలాటమున ఊర్ధ్వపుండ్రమును ధరించెను. అంతలో వకుళాదేవి లక్ష్మీదేవినిబిలచి శ్రీ వేంకటరమణుని లలాటమున తిలకముబెట్టుమనెను. అంతట లక్ష్మీదేవి శ్రీ వేంకటరమణుని లలాటమున కస్తూరితో తిలకమునుబెట్టెను. పిమ్మట లక్ష్మీదేవి కుబేరునడిగి పీతాంబరాది సకలాలంకారములనుదెచ్చి శ్రీ వేంకటరమణు నలంకరించెను. శ్రీ వేంకటరమణునకు అమూల్యమగు బంగారు మొలత్రాడును గట్టెను. సకలాలంకారముల నలంకరించెను. ఇవ్విధమున శ్రీ వేంకటరమణుడు సకలాభరణభూషితుడై బ్రహ్మాది దేవతలచే నిత్యము నమస్కరింపదగినవాడయ్యెను గశ్యపాత్రి భరద్వాజ వసిష్ఠాది మునిపుంగవులకు నమస్కరించి సంధ్యాది నిత్యకృత్యములను దీర్చికొనెను. పిమ్మట శ్రీ వేంకటరమణుడు వసిష్ఠునిజూచి తదనంతర కార్యములను జరిగింపుమనెను. అంత వసిష్ఠుడు ముత్తైములతో చతురస్రమగు వేదికను నిర్మించి శాస్త్రోక్త విధానముగ శ్రీ వేంకటేశ్వరుని బ్రతిష్ఠజేసి పుణ్యాహవాచనమును జేయించెను. పిమ్మట వసిష్ఠుడు శ్రీ వేంకటరమణుని కులదైవమగు శమీవృక్ష ప్రతిష్ఠను జేయించెను. అంతట శ్రీ వేంకటరమణుడు భోజనములకు బూర్వమే నారాయణపురమునకు తరలిపోవ నిశ్చయించి చతుర్ముఖునితో నిట్లనెను. ఓ చతుర్ముఖా! నారాయణపురాభిముఖముగ

చతురంగ సేనను సాగబెట్టుము. కడుదూరము పయనము సేయవలయును. కాలయాపనము తగదు. మునిపుంగవులతోబాటు సకల బంధువులను పయనముకమ్మని త్వరపెట్టుము అనెను. చతుర్ముఖుడు శ్రీ వేంకటేశ్వరుని పలుకులాలించి యిట్లనెను. ఓ పురుషోత్తమా! ఓ వేంకటాచలపతీ! పుణ్యాహవాచనము జేయించినపిమ్మట కులదేవతా ప్రతిష్ఠాపనముగావించి ఉపవాసములతో పయనము జేయరాదు. ముని వృద్ధ బాలురు ఆకొనియున్నారు అనెను. ఆ పలుకులు విని శ్రీవేంకటరమణుడు చతుర్ముఖునితో నిట్లనెను. ఓ నాయనా! నీ మాటలు అమూల్యములు. సందియములేదు. కాని నీవు ముందువెనుకల నాలోచింపకున్నావు. బాలునివలె దేశకాల పరిస్థితుల నెఱుగక పలుకుచున్నావు. ఇప్పట్టున చేత డబ్బులేదు. డబ్బులేక సంతర్పణలెట్లు సాగుననెను. జనకునిమాటలాలకించి చతుర్ముఖుడు నోరు మెదపక ఊరకుండెను. అంతలో నీలకంఠుడు శ్రీ వేంకటరమణునితో నిట్లనెను. ఓ తాతా! బాలుడనగు నా పలుకు లాలింపవలెను. పెండ్లి జేయుట యిల్లుకట్టుట మున్నగు కార్యములలో తుదిపర్యంతము యత్నము సేయువారలే ధన్యులు, కీర్తివంతులు. ఇట్టి కార్యములలో పుష్కలముగ సకల సంభారములను సంపాదింపవలయును. ద్రవ్యముచాలనిచో ఋణము జేసియైనను గార్యమును గొనసాగింపవలయును అనెను. అంతట శ్రీ వేంకటేశ్వరుడు శంకరునితో నిట్లనెను. ఓ నాయనా! సభామధ్యమున పౌరుషమును జూపుచుంటివి. ఈ వివాహ కార్యమును కొనసాగింపదగిన ధనమును ఋణమునిచ్చువారెవరు? పురుషుడు పౌరుషముతో యత్నము సేయదగును. కాని మాటలతో బనిలేదు. అని పలికి పురుషోత్తముడగు శ్రీ వేంకటరమణుడు కుబేరుని సభాస్థలినుండి వెలుపలికిబిలచి యిటనెను. ఓ కుబేరా! ఇప్పట్టున నా వివాహమునకువలయు ధనసాహాయ్యమునుజేసి పుణ్యముగట్టుకొమ్మనెను. అందులకు కుబేరుడు శ్రీ వేంకటేశ్వరునితో నిట్లనెను. ఓ దేవదేవా! ఈ సకల భువనములు నీ యధీనములు. నేను ధనాధిపుడనుకాను. నీ యాజ్ఞను శిరసావహించి నీ ధనమును గాపాడుచున్నాను. ఓ గరుడధ్వజా! నీ ధనమును నీకిచ్చుటలో నేమి యధికారము కలదు? నీవు సర్వస్వతంత్రుడవు అనెను. ఈమాట లాలించి శ్రీ వేంకటరమణుడు కుబేరునిలో నిట్లనెను. ఓ కుబేరా! చతుర్ముఖునకు బగటికాలముతీరునంతలో నాకు దశావతారములు కాగలవు. అట్టి నాయవ

తారములలో నేను నాయింటిసొత్తును భూమండలమునకు గొనిరాను. భూమండలమునందలి సొత్తును వైకుంఠమునకు గొనిపోవుటలేదు. నేను యుగయుగములలో దేశ కాలానుసారముగ లక్ష్మీదేవితో క్రీడించుచుందును. ఓ కుబేరా! నీవు నాకిపుడు ధనమొసగుటయు నిమిత్తమాత్రము కాని వేఱొండుగాదు. దేశ కాలములననుసరించి నీవు నాకీ సాహాయ్యమును జేయుమనెను. అంతట కుబేరుడు శ్రీవేంకటేశ్వరునితో నిట్లనెను. ఓ వేంకటరమణా! లోకములో నిర్ధనుడు ధనవంతునకు పత్రమును వ్రాసి యిచ్చువిధమున నీవు నాకు ఋణపత్రమును వ్రాసియిచ్చిన ధనమునిచ్చెదననెను. శ్రీవేంకటరమణుడుకుబేరునిపల్కులువిని ఋణపత్రమునువ్రాయు విధానమును దెలుపుమని చతుర్ముఖు నడిగెను. అంత చతుర్ముఖుడు ఈ క్రిందివిధమున శ్రీ వేంకటరమణునిచే ఋణపత్రమును వ్రాయించెను.

ఋ ణ ప త్ర ము.

ఈనాడు అనగా విళంబినామ సంవత్సర వైశాఖ శుద్ధ సప్తమినాడు వేంకటాచల నివాసియగు శ్రీ వేంకటేశ్వరుడు అలకాపురాధీశుడగు కుబేరునకు వ్రాసియిచ్చిన ఋణపత్రము యేమనగా:—

ఈనాడు నా అవసరనిమిత్తము అనగా ఈ కలియుగములో జరుగబోవు నా వివాహము నిమిత్తము మీవద్ద బదులుపుచ్చుకొన్న రొక్కము పదునాలుగు లక్షల సువర్ణ రామముద్రికలు. ఈ సొమ్ముకు యింతటనుండియు నెల 1 కి నూటికి ఒక్కసువర్ణరామముద్రికతో అయిన అసలీ ఫాయిదాలను మీకుగాని, మీ అనుమతిపొందిన మఱియొకరికిగాని అడిగిన తక్షణం వసూలుయిచ్చి యీ ఋణపత్రముపై చెల్లువ్రాయించి పుచ్చుకొనగలవాడను. ఇందుల ప్రతిఫలం పైనవ్రాసినవిధముగ రొక్కము యిచ్చినారు కనుక ముట్టినది. ఇది నా సమ్మతిని వ్రాసియిచ్చిన ఋణపత్రము.

శ్రీ వేంకటాచల నివాసి,
శ్రీ వేంకటేశ్వరుడు.

ఇందుకు సాక్షులు.

1. చతుర్ముఖుడు.
2. శంకరుడు.
3. అశ్వత్థము.

ఇవ్విధమున శ్రీ వేంకటేశ్వరుడు ఋణముచేసి సకల సంభారములను సిద్ధముజేయ గుబేరునితో నిట్లనెను. ఓ కుబేరా! నీవు బియ్యమును, గోధుమలను, మినుములు, పెసలు, కందులు మున్నగువానిని దెప్పింపుము. మఱియు బెల్లము, తైలము, శర్కర, నెయ్యి, పెరుగు, పాలు, మున్నగు వానిని దెప్పింపుము. మఱియు ఆవాలు, మిరియాలు, యింగువ, జీలకఱ్ఱ మున్నగు సకల సంభారములను, పిమ్మట దేవతాస్త్రీలకు పట్టు చీరెలను, మునియువతులకు నూలుచీరెలను దెప్పింపుము. తమలపాకులు, వక్కలు, లవంగములు, యాలకులు, జాపత్రి, జాజికాయ, పచ్చకర్పూరము, కుంకుమ పూవు మున్నగువానిని దెప్పింపుము. వధువునకు మాంగల్యమును, కాలి వ్రేళ్ళకు చుట్లను జేయింపుము. నా వ్రేలికి ఉంగరమును జేయింపుమనెను. కుబేరుడు శ్రీ వేంకటరమణుని యాజ్ఞను శిరసావహించి సకల సంభారములను సిద్ధముచేయించి శ్రీ వేంకటరమణునితో చెప్పెను. మఱియు శాకపాకములను గావించుటకు అగ్నిహోత్రుని నియమింపుమనెను. అంతట వేంకటేశ్వరుడు అగ్నిహోత్రుని బిలిపించి వంటలు గావింపుమనెను. అగ్ని దేవుడు ఆ పల్కులాలించి పాత్రసామగ్రిలేక పాకములెట్లుగావింతుననెను. శ్రీ వేంకటరమణుడు తన వివాహమునకుగలుగు నంతరాయములను నుగ్గడించుచు కంట తడిపెట్టుకొని యగ్నిదేవునకీ క్రింది యుపాయమును జెప్పెను. ఓ యగ్నీ! స్వామి సరోవరమును అన్నపాత్రముగజేయుము. పాపవినాశమును సూపపాత్రముగజేయుము. ఆకాశగంగ పరమాన్న పాత్రము కాగలదు. దేవతీర్థము కూరగిన్నె. తుంబురుతీర్థము చిత్రాన్న పాత్రము. కుమారధారాతీర్థము బూరెలమూకుడు. పాండుతీర్థము చారు కళాయి. ఇతర తీర్థములన్నియు సకల వ్యంజన పాత్రములు కాగలవు. నీవు స్వాహా, స్వధా దేవులతో శాకపాకములను గావింపుమనెను. శ్రీవేంకటేశ్వరుడు లోకవిడంబనముజేయుచు గావించు నేర్పాటులను విని మహర్షులెల్లరు ప్రశంసించిరి. అంతట నగ్నిదేవుడు దధ్యోదనము, పరమాన్నము, గారెలు, బూరెలు, అరిసెలు మున్నగు పిండివంటలతో వంటలుగావించి శ్రీ వేంకటేశ్వరునితో సకల దేవతాబృందమును, మునిబృందమును, దేవతార్చనకు సిద్ధముకావచ్చుననెను. అంతట శ్రీవేంకటరమణుడు కుమారస్వామినిబంపి సకల దేవతలను, మునిపుంగవులను భోజనమునకు రావించెను. కశ్యపాది మునిపుంగవులును, ఇంద్రాది దేవతలును భోజనమునకు

సన్నద్ధులయిరి. వచ్చినవారిని తారతమ్యానుసారముగా పాండుతీర్థము మొదలు శ్రీశైలపర్యంతము పంక్తులుదీర్చి కూర్చుండబెట్టిరి. పాత్రాపాత్ర విచక్షణుడగు శంకరుడు విస్తళ్ళను వేసెను. చోష్య, పేయ భక్ష్యాది సమస్త పదార్థములను వడ్డించిరి. అప్పట్టున శ్రీ వేంకటరమణుడు చతుర్ముఖునిబిలచి అనివేదితాన్నము ఆరగింపరాదనెను. చతుర్ముఖుడు శ్రీ వేంకటరమణుని పల్కులాలించి యతనితో నిట్లనెను. ఓ పురుషోత్తమా! నీవు సర్వజ్ఞుడవు, సకల భోక్తవు, సకల లోకేశ్వరుడవు. ఓ గోవిందా! నీకు తుల్యుడుకాని, అధికుడుకాని లేడు. ఈ శాకపాకముల నెవరికి నివేదింపగలము అనెను. అంతట శ్రీ వేంకటరమణుడు సమస్త శాకపాకములను శ్రీ నృసింహస్వామికి నివేదింపుమనెను. చతుర్ముఖుడు శ్రీవేంకటరమణుడు చెప్పినచొప్పున సమస్త శాకపాకములను శ్రీనృసింహస్వామికి నివేదించి మునిపుంగవులకు గంధాక్షత ధూపదీపాది షోడశోపచారములను జరిపెను. సచ్చిదానందమూర్తియగు శ్రీ వేంకటరమణుడు లోకవిడంబనముజేయుచు కశ్యపాదిమునులకు నమస్కరించి కలిగినదానిని కడుపార నారగించి తృప్తిచెందుడని ప్రార్థించెను. అంతట కశ్యపాదులు ఈ భోజనము అమృతతుల్యమనియు, ముక్తిసాధనమనియు శ్రీ వేంకటేశ్వరు నభినందించి పరివేషణముచేసి పరమానందముతో నారగించిరి. పిమ్మట శ్రీ వేంకటరమణుడు మునులకు తగినవిధమున దక్షిణ తాంబూలములనొసగి తాను పుత్త్ర మిత్ర లోకపాల గరుడ కళత్రాదులతో భుజించెను. ఆనాటిరాత్రి సకల దేవతలును, మునులును వేంకటాచల మందలి గుహలయందును, వృక్షమూలములయందును, పొదలయందును విశ్రమించిరి.

## శ్రీ వేంకటేశ్వరుడు సపరివారముగ పెండ్లికి తరలిపోవుట

ప్రభాత సమయమున శ్రీ వేంకటేశ్వరుడు గరుడుని బిలచి నారాయణపురమునకు తరలిపోవదగు సకల సన్నాహములనుగావింప చతుర్ముఖునితో జెప్పుమనెను. అంత చతుర్ముఖుడు సకల సన్నాహములను

సిద్ధముజేయ శ్రీ వేంకటేశ్వరుడు గరుడు నధిష్ఠించెను. చతుర్ముఖుడు ముందుబోవుచుండెను. దక్షిణ పార్శ్వమున శంకరుడు బోవుచుండెను. వామపార్శ్వమున వాయువు బోవుచుండెను. వెనుకభాగమున కుమార స్వామి పోవుచుండెను. శేషుడు శ్వేతచ్ఛత్రమును బట్టెను. వాయువు వింజామరమును బట్టెను. రత్నదండముతో ముచ్చటగొలుపు వ్యజనమును విష్వక్సేనుడు బట్టెను. భేరీదుందుభులు దిక్కులు పిక్కటిల్లునట్లు మ్రోయజొచ్చెను. లక్ష్మీదేవి స్వర్ణరథము నధిష్ఠించెను. వకుళాదేవి సూర్యసంకాశమగు విమానము నధిష్ఠించెను. మునులు, దేవతలు, వైఖానసులు తమతమ పుత్త్ర మిత్ర కళత్రాదులతో బయలుదేరిరి. ఈ జన సమ్మర్దముతో వేంకటాచలము మొదలు నారాయణపురము పర్యంతము ఇసుకజల్లినను నేల రాలకుండెను. ఇట్లు బయలువెడలిపోవుచు సచ్చిదానందమూర్తియగు శ్రీ వేంకటరమణుడు పద్మసరోవరమును జేరెను.

ఇట్లు వచ్చిన శ్రీవేంకటరమణునిజూచి శ్రీశుకుడెదురేగి సాగిలబడి ఇట్లనెను. ఓ సచ్చిదానందమూర్తీ! నీవు బ్రహ్మరుద్రాదులకు నైతము అగోచరుడవు. కేవల వేదైకగోచరుడవు. అట్టిమహనీయుడవగు నీవిపుడు నా కంటబడితివి. నేను ధన్యుడనైతిని. నా తపములు పండినవి. ఓ పురుషోత్తమా! నా యాతిథ్యమును గైకొమ్ము అనెను. ఆ మాటలు విని శ్రీ వేంకటేశ్వరుడు శ్రీశుకునితో నిట్లనెను. ఓ మునిపుంగవా! నీవు నిష్కించనుడవు; విరక్తుడవు; బ్రహ్మచారివి. మేము గృహస్థులము; పదిమందితో నున్నవారము. నారాయణపురమునకుబోయి భుజింపనెంచితిమి. నీవు ప్రయాసపడకుము అనెను. అంతట శ్రీశుకుడు శ్రీ వేంకటరమణునితో నిట్లనెను. ఓ నిష్కించనజన ప్రియా! నేను నిష్కించనుడనే. ఓ గోవిందా! నీవు నా యాతిథ్యము నంగీకరించి ఆరగించినచో సకలలోకము నారగించినట్లు కాగలదు; సంశయింపకుము. నా యాతిథ్యము నంగీకరింపుము అనెను. అంతలో వకుళాదేవి శ్రీ వేంకటేశ్వరునితో నిట్లనెను. ఓ వేంకటరమణా! నీ వివాహ నిమిత్తము ఈ శ్రీశుకుడు మిక్కిలి ప్రయాసలు పడెను. అతని కోరికను మన్నింపుమనెను. శ్రీ వేంకటేశ్వరుడు వకుళాదేవిపల్కులాలించి శ్రీశుకునితో నిట్లనెను. ఓ మునిశార్దూలా! నీ యాదరమునకు మిక్కిలి సంతసించితిని; తృప్తిజెందితిని. అయ్యును

నీ యాతిథ్యమును స్వీకరింతునని పల్కుచు శ్రీశుకుని కుటీరములో ప్రవేశించెను. శ్రీశుకుడు పరమానందముతో శ్రీ వేంకటరమణుని దర్భాసనముపై గూర్చుండబెట్టి పద్మసరోవరమున మునిగి నిత్యకృత్యములను దీర్చుకొని మునులారగించు వంటను స్వయముగ జేసెను. శ్రీవేంకటరమణుని ముందు తామరాకునుబఱచి వడ్డించెను. శ్రీవేంకటేశ్వరుడు పరమానందముతో నారగించెను. శ్రీ వేంకటేశ్వరునియాజ్ఞచే లక్ష్మీదేవియు, వకుళమాలయు నారగించిరి. ఇంతలో సకల మునిపుంగవులు గోపించి శ్రీశుకుని శపింపబూనిరి. అంతట శ్రీ వేంకటేశ్వరుడు కుటీరమునుండి వెలుపలికి వచ్చి తేన్చెను. ఆ మునిపుంగవులెల్లరు ఆ తేన్పుతో తామారగించిన విధమున తృప్తిజెంది శ్రీశుకుని బొగడజొచ్చిరి. ఆనాటికి శ్రీ వేంకటరమణుడు పద్మసరోవరమున విడిసి మరుసటిదినమున ప్రభాత సమయమున కాలకృత్యములను దీర్చుకొని పయనముసాగింపజొచ్చెను.

# ఆకాశమహారాజు శ్రీ వేంకటేశ్వరునకు ఎదురుసన్నాహమును గావించుట

శ్రీ వేంకటేశ్వరుడు చతురంగబలముతో ముందుముందుకు సాగిపోవుచు నారాయణపురమును సమీపించెను. ఆకాశరాజు పెండ్లివారిరాకనెరిగి ఎదురు సన్నాహమునుగావింప సమకట్టెను. పద్మావతీదేవిని సుగంధద్రవ్యములతో జలకమాడించిరి. ఆమెను గజముపై గూర్చుండబెట్టిరి. వసుదాన తొండమానులిరువురు నాకాశరాజువెంట వచ్చుచుండిరి. చతురంగబలములు బయలుదేరెను. భేరీదుందుభులు మ్రోయుచుండెను. నటకసూత వందిమాగధులు వెంబడించుచుండిరి. చతురంగబలముల మధ్యమునందు ఆకాశరాజు ఆకసమున నక్షత్రమండల మధ్యమున చంద్రునిపగిది భాసించుచుండెను. ఇవ్విధమున ఆకాశరాజు శ్రీ వేంకటరమణు నెదుర్కొనెను. అంతట దేవేంద్రుడు ఆకాశరాజునకు శ్రీ వేంకటరమణుని పరిచయము గావించెను. ఆకాశరాజు శ్రీ వేంకటరమణునిజూచెను. శ్రీ వేంకటేశ్వరుడు గరుడారూఢుడై యుండెను. శ్వేతచ్ఛత్రముతో నొప్పుచుండెను. మిక్కిలి సుకుమారుడు, యువకుడు, సుందరుడు, వేయేల? సచ్చిదానంద

విగ్రహుండు. ఇట్టి యల్లునిజూచి ఆకాశరాజు రథముదిగి పద్మావతీదేవిని ముందునిడుకొని పురోహితుని వెంటనిడుకొని తాను ధన్యుడననియు, కృత కృత్యుడనయితినినియు పలుకుచుండెను. అప్పట్టున నారదుడు శ్రీవేంకట రమణునకు ఆకాశరాజును పరిచయముగావించెను. అంతట శ్రీ వేంకటే శ్వరుడు ఆకాశరాజ బాంధవ్యముతో తాను ధన్యుడనయితినినియు తన జన్మము సఫలమాయెననియు చెప్పుచుండెను. ఇప్పట్టున ఆకాశరాజు శ్రీ వేంకటరమణుని ద్వారతోరణముకడకు రావించి వస్త్రాభరణాదులతో నాద రించెను. అప్పట్టున పద్మావతీ శ్రీ వేంకటేశ్వరులు నొండొరులను జూచు కొనిరి. పట్టణమున ప్రవేశించునపుడు పద్మావతీ శ్రీ వేంకటేశ్వరులు నగర ద్వారముకడనుండు దుర్గాదేవిని దర్శించిరి. ఒండొరులకు పాణి గ్రహణము నిర్విఘ్నముగ జరుగునట్లు దుర్గాదేవి నొండొరులు ప్రార్థించిరి. పిమ్మట పద్మావతీదేవి గజము నధిష్ఠించెను. శ్రీవేంకటరమణుడు గరుడు నధిష్ఠించెను. వధూవరులు నగరమున బ్రవేశించుచుండిరి. నగరము నందంతటను వేలకొలది దీపములు వెలుగుచుండెను. నలుదిశలందును వధూవరులపై లాజ పుష్పాక్షతలను జల్లుచుండిరి. సూత వందిమాగ ధులు పొగడుచుండిరి. బ్రహ్మాది దేవతలును, శుకాది మునిపుంగవులును వేదఘోషతో నాశీర్వదించిరి. వీణా వేణు మృదంగ పణ వానక దుందు భులు మ్రోయుచుండెను. వేశ్యాగణములు నృత్యము సలుపుచుండిరి. గంధర్వులు గానము సలుపుచుండిరి. ఇట్టి మేళతాళములతో నాకాశరాజు వధూవరులను వీధివీధులందు నూరేగించుచు గొనిపోవుచుండెను. రంభా స్థంభములతోడను, ఇక్షుదండములతోడను, పోకచెట్లతోడను, పూర్ణకుంభ ములతోడను, వీధులను ముచ్చటగొలుపురీతి నలంకరించిరి. మామిడి తోరణములను గట్టిరి. ముత్తెపు సరులను వ్రేలాడదీసిరి. పద్మరాగ ములు, వజ్రములు, వైఢూర్యములు, ఇంద్రనీలములు, మరకతములు మున్నగు తోరణములు దివ్యశోభను గూర్చుచుండెను. నాలుగువీధుల మొగలలో పౌర నారీజనము వధూవరులకు నీరాజనముల నొసగుచుండెను. మూడువీధుల నతిక్రమించి ఆకాశరాజు శ్రీ వేంకటరమణుని విడిదెకు గొని పోయెను. పెండ్లివారిని విడిదెలో ప్రవేశపెట్టెను. అంతట ఆకాశరాజు తన భవనమున కేగెను. పిమ్మట శ్రీ వేంకటేశ్వరుడు తొండమానుని బిలచి ఇట్లనెను. ఓ మహారాజా! ఇప్పుడు రాత్రి అయిదుఘడిలాయెను.

నేను, లక్ష్మీదేవియు. నా పుత్రులును, తల్లియు, దేవతలు నుపవాసముతో నున్నాము. వైవాహికజనులెల్లరు నాకొనియున్నారు. మునిపుంగవులు, స్త్రీ బాల వృద్ధులు గలరు. కావున వెంటనే వంటలు జేయింపుము అనెను. తొండమానుడు శ్రీవేంకటరమణుని పల్కులాలించి ఈ రాజ్యము, ప్రజలు నీవారలనుచు నుపచారములను బలికి ఘడియలో షడ్రసోపేతముగ వంటలుజేయించెను. పెండ్లివారు మృష్టాన్నము నారగించిరి. శ్రీ వేంకట రమణుడు పుత్త్ర మిత్ర కళత్రాదులతో నారగించుటకు దగిన శాకపాకము లను తొండమానుడు విడిదెకు దెప్పించెను. శ్రీ వేంకటరమణుడు ఆర గించుపర్యంతము తొండమానుడు తాను విడిదెలోనుండెను. శ్రీ వేంకట రమణుని పుత్త్ర మిత్రకళత్రాదులతో వస్త్రాద్యలంకారభూషితునిజేసెను. శ్రీ వేంకటేశ్వరుని పరుండజేసి తాననుజ్ఞగొని నిజభవనమునకేగెను. శ్రీ వేంకటేశ్వరుడు సచ్చిదానందవిగ్రహుండయ్యును లోకవిడంబనముచేయుచు సుఖశయనము గావించెను.

మరుసటినాడు వైశాఖ శుద్ధ దశమి. శ్రీ వేంకటేశ్వరుడు ప్రభాత సమయమున మేల్కాంచెను. కాలకృత్యములను దీర్చికొని జలకమాడి ఆహ్నికములను దీర్చికొనెను. వసిష్ఠుని బిలిచి నాటి కర్తవ్యము నాజ్ఞా పించెను. ఓ వసిష్ఠా! నాయింట నేనును, లక్ష్మీదేవియు, మా తల్లి వకుళా దేవియు, చతుర్ముఖుడు, పురోహితుడును నేడు ఉపవాసవ్రతము నాచరింప వలయును. ఇట్లే ఆకాశరాజ మందిరమున ఆకాశరాజు, అతని సతీ మణియు, కుమార్తెయు, సోదరుడగు తొండమానుడును ఉపవాసవ్రతము నాచరింపవలయును. మఱియు రాత్రి సుముహూర్తముకానంత పదమూడు ఘడియల రాత్రి కాగలదు. అటుపిమ్మట వేదవేత్తలు భుజింపరు. కావున సుముహూర్తమునకు బూర్వము శాకపాకములనుగావించి బ్రాహ్మణులను భుజింపచేయుమనెను. శ్రీవేంకటేశ్వరుడు చెప్పినచొప్పున సర్వము సన్న ద్ధము జేయించిరి. రాత్రి పెందలకడ వేదవేదాంగవేత్తలగు విప్రుల భోజనములాయెను.

# ఆకాశరాజు శ్రీ వేంకటేశ్వరుని కల్యాణ మంటపమునకు గొనిపోవుట

ఈనాటి సాయంకాలము ఆకాశరాజు చతురంగబలముతో శ్రీవేంకటేశ్వరుని కాల్యాణ మంటపమునకు గొనిరా బయలుదేరెను. వసుదాన తొండమానులు వెంటవచ్చుచుండిరి. పురోహితుడు ముందు నడచుచుండెను. ఐరావతము నలంకరించి గొనిపోవుచుండిరి. ఇది ఇట్లుండ వేంకటేశ్వరుడు విశ్వకర్మ పదివేల స్థంభములతో నిర్మించిన దివ్య సభామంటపము నలంకరించియుండెను. బ్రహ్మాది సకల దేవతలు సభ నలంకరించిరి. విశ్వామిత్ర భరద్వాజ కశ్యపాదులు సభాసదులై యుండిరి. ఆకాశరాజు పురోహితుని ముందుబెట్టుకొని సభాద్వారముకడ కేతెంచెను. అంతలో వేంకటేశ్వరుడు నిజాసనమునుండి లేచి ఆకాశకాజున కెదురేగి కౌగలించి అతనితో నిట్లనెను. ఓ మహారాజా! మీరేల రావలయును? వసుదానుని బంపిన జాలదా! అను నుపచారములను బలుకుచుండెను. అంతలో నాకాశరాజు వసిష్ఠునితో గాలయాపనమేల? అనెను. అంతట వసిష్ఠుడు అరుంధతిని ముందుపెట్టుకొని వేంకటేశ్వరుని పూజింపుమని ధరణీదేవితో చెప్పెను. ధరణీదేవి సచ్చిదానంద విగ్రహుండగు వేంకటరమణునిజూచి పరమానందభరితురాలై తన జన్మము సఫలమాయెనని తలచెను. వెంటనుండు సుమంగలీ స్త్రీలు ధరణీదేవి పున్నెములను బొగడజొచ్చిరి. అప్పట్టున ధరణీదేవి వేంకటేశ్వరుని చందన తాంబూాదులతో నర్చించి వస్త్రాది నానావిధాలంకారముల నొసగెను. అంత వసిష్ఠు ననుమతిచే నాకాశరాజు పురుషోత్తముడగు శ్రీ వేంకటేశ్వరుని గజారూఢునిచేసెను. చతుర్ముఖ శంకర కుబేర గరుడ వాయు వరుణాదులు వెంటవచ్చుచుండిరి. కశ్యపాది మునులు దారాపుత్రాదులతో బయలుదేరిరి. ముత్తెములు, పద్మరాగములు మున్నగు దివ్యతోరణములతో ముచ్చటగొలుపు రాజమందిరమును చేరిరి. భేరీ దుందుభులు మ్రోయుచుండెను. వేలకొలది దీపములు దేదీప్యమానముగ బ్రకాశించుచుండెను. ఆకాశరాజు ద్వారతోరణముకడ చతురంగ బలమును నిలిపెను. ఇంతలో తొండమానుని సతీమణి వేంకటేశ్వరునకు నీరాజనమునిచ్చెను. అంతట నాకాశరాజు వేంకటరమణుని

రాజమందిరమున ప్రవేశపెట్టి నాలుగు స్తంభములతోగట్టిన రత్నవేదిక యందు సుఖాసీనునిచేసెను. సకల దేవతలును, బంధువర్గమును కనుల పండువోయనునట్లు జూచుచుండిరి.

# పద్మావతీ శ్రీ వేంకటేశ్వరుల కల్యాణ మహోత్సవము

అంతట నాకాశరాజు స్నానమాచరించి శుద్ధవస్త్రములను దాల్చెను. ధరణీదేవియు స్నానముజేసి నానాలంకారములను దాల్చి పట్టుబట్టలను గట్టెను. వేంకటేశ్వరుని పాదములను గడుగుటకు పవిత్రమగు స్వామి పుష్కరిణీ తీర్థమును దెప్పించిరి. ఆకాశరాజు శ్రీ వేంకటేశ్వరుని పాద ప్రక్షాళనమును శాస్త్రోక్తవిధానముగ సంకల్పించెను. ధరణీదేవి హేమకుంభ ముతో స్వామిపుష్కరిణీ తీర్థమును బోయుచుండెను. వసిష్ఠుడు "సహస్ర శీర్షా పురుషః" అను వేదమంత్రమును జదువుచుండెను. ఆకాశరాజు వేంకటేశ్వరుని పాదములను గడిగి పాదోదకమును శిరమున దాల్చెను. ధరణీదేవి శిరముపైజల్లెను; సోదరుని శిరముపైజల్లెను; పుత్త్రుని శిరముపై జల్లెను. కోశాగారమును, రథాగారమును, గజశాలలను, అశ్వశాలలను శ్రీవారి పవిత్ర పాదోదకముతో బ్రోక్షించెను. మఱియు నిపుడు తన జీవి తము సఫలమాయెననెను. తన పితృదేవతలు తరించిరి అనెను. ఇంతలో పద్మావతీదేవిని నానాలంకారములతో నలంకరించిరి. సుముహూర్తము సమీపించుచుండెను. కన్యాదాన సమయములో నాకాశరాజు వరునకు కోటి నిష్కములను దక్షిణగ నొసగెను. మఱియు నూఱుబారువులు బరువు గల సువర్ణకిరీటము నిచ్చెను. నూఱుబారువుల బరువుగల సువర్ణ కంఠ మాలల నిచ్చెను. అమూల్యములగు పతకముల నిచ్చెను. ముత్యాలహారము నిచ్చెను. భుజభూషణములనిచ్చెను. కర్ణభూషణములనిచ్చెను. వజ్రము, వైడూర్యము మున్నగునవి పొదిగిన ముప్పదిరెండు బారువుల బరువుగల సువర్ణకంకణముల నొసగెను. నాగభూషణముల నిచ్చెను. పదివ్రేళ్లకు నుంగరముల నిచ్చెను. వజ్రములు పొదిగిన బంగారు మొలత్రాడు నిచ్చెను. పదునొకండు బారువులు బరువుగల సువర్ణ రత్నఖచిత పాదుకల

నొసగెను. అరువది బారువులు బరువుగల భోజన పాత్రమును ఉప పాత్ర ముతో జలపాత్రము నొసగెను. రత్నకంబళముల నొసగెను. ఇట్టి తరుణములో బృహస్పతి కన్యాప్రవరను జెప్పనారంభించెను. ఓ గోవిందా! అత్రి గోత్రోద్భవురాలును సువీరమహారాజుయొక్క ప్రపౌత్రియు సుధర్మ మహారాజుయొక్క పౌత్రియు నాకాశరాజుయొక్క పుత్రియునగు పద్మావతీదేవి నంగీకరింపుమనెను. బృహస్పతి యిట్లు కన్యాప్రవరము జెప్పనంత నాకాశరాజు పరమానందముతో శ్రీ వేంకటేశ్వరునకు రత్నాంబరముల నొసగెను. అంతలో వసిష్ఠుడు వరుని ప్రవరను జెప్పదొడగెను. వసిష్ఠ గోత్రోద్భవుడును యయాతియొక్క ప్రపౌత్రుడును వసుదేవుని పుత్రుడునగు శ్రీ వేంకటేశ్వరుని నిమిత్తము అత్రి గోత్రోద్భవురాలగు పద్మావతీదేవిని గ్రహింతుమనెను. అప్పట్టున ఆకాశరాజు పరమానంద భరితుడై శ్రీ వేంకటేశ్వరునితో నిట్లనెను. ఓ పురుషోత్తమా! నా కన్య నిచ్చెదను అంగీకరింపుము; అనుచు నుపచారములను బలుకుచుండెను. ధరణీదేవి స్వర్ణ పాత్రముతో మంత్రపూతమగు స్వామి పుష్కరిణీ తీర్థమును బోయుచుండెను. ఆకాశరాజు జలధారతో పద్మావతీదేవిని శ్రీ వేంకటేశ్వరునిచేత బెట్టెను. చందన తాంబూల నూతన వస్త్రాదులతో శ్రీ వేంకటరమణుని సత్కరించెను. వధూవరులకు కంకణములనుగట్టిరి. సువాసినీ స్త్రీలు పాటలు పాడుచు వధూవరులను దీవింప దొడగిరి. వసిష్ఠుడు శ్రీ వేంకటేశ్వరునిచే పద్మావతీ కంఠమున మాంగల్యధారణమును జేయించెను. పిమ్మట వసిష్ఠుడు పద్మావతీదేవి సమర్పించు లాజములను శ్రీ వెంకటరమణునిచే హోమము జేయించెను. వసిష్ఠుడు వివాహ విధానమును పూర్తిగావించెను. వేదవేదాంగవిదులు నవరత్నాక్షలతో జగత్పూజ్యులగు దంపతులను దీవించిరి. నారాయణపురవాసులకు కనులపండువాయెను. ఆకాశరాజు విప్రులను దక్షిణ తాంబూలములతో సత్కరించెను. ఆకాశరాజు నాలుగురోజులు మృష్టాన్నముతో పెండ్లివారిని, బంధుగులను ఆదరించెను. అయిదవనాడు నాకబలిని జరిగించెను. పిమ్మట క్షీరధారతో పద్మావతీదేవిని శ్రీ వేంకటరమణునకు, వకుళాదేవికి, లక్ష్మీదేవికి నప్పగించెను. రత్న సింహాసనమున వధూవరులను గూర్చుండబెట్టి పూజించెను. వధూవరులను ఐరావతముపై గూర్చుండబెట్టి విడిదెకు బంపెను.

# ఆకాశరాజు పద్మావతీదేవిని సారెచీరెతో నత్తింటికి సాగనంపుట

పిమ్మట శ్రీ వేంకటేశ్వరుడు గరుడు నధిష్ఠించి రాజ మందిర మునకుబోయి పద్మావతీదేవితో వేంకటాచలమునకుబోవ నాకాశరాజు నను మతింప వేడెను. ఆకాశరాజు ఒకమాసము తనయింట నుండుమని వధూవరులను వేడుకొనెను. కాని శ్రీ వేంకటరమణుడు తనకు కార్యావసరము కలదనెను. ఆకాశరాజుయొక్క సమ్మతిపై శ్రీ వేంకటరమణుడు గరుడు నధిష్ఠించెను. పెండ్లివారు తమతమ వాహనముల నధిష్ఠించిరి. నగరములోని వారెల్లరు వ్యాకులముతో నుండిరి; గోపుర ప్రాకారములపై నెక్కి వధూవరులను జూచుచుండిరి. అప్పట్టున ఆకాశరాజు నూఱు గరిసెల ధాన్యమును, ముప్పది గరిసెల పెసలను, వందలాది చింతపండు కండ్లములను, వేలాది బెల్లపు బుట్టలను, పాల కడవలను, పెరుగు కడవలను, అయిదువందల నేతిడబ్బాలను, రెండువందల పంచదార మూటలను, విశేషముగ అవాలు, మిరపకాయలు, యింగువ మున్నగువానిని; మఱియు గుమ్మిడి, అరటి, వంకాయ, కంద, నిమ్మపండ్లు మొదలగు కూరగాయలను అరటాకులను యిచ్చెను. ఇంతియకాక పదివేల గుఱ్ఱములను, వేయి ఏనుగులను, అయిదువేల గోవులను, నూఱు గొఱ్ఱెలను సాగబెట్టెను. మఱియు రెండు వందల దాసీజనమును, మూడువందల దాసజనమును ఇచ్చెను. లెక్కకు మిక్కుటమగు బట్టలు పెట్టెను. రత్నఖచితమగు పర్యంకము నిచ్చెను. శ్రీ వేంకటరమణుడు ఈ సారెచీరతో సాగనంపు ఆకాశరాజునుజూచి యిట్లనెను. ఓ మహారాజా! కడుదూర మేతెంచితిరి. నేను మిక్కిలి సంతసించితిని. మీరు గృహాభిముఖులై మరలుడు. మీకు వలయుదానిని గోరిన ఇచ్చెదననెను. అంతట నాకాశరాజు శ్రీ వేంకటరమణునితో నిట్లనెను. ఓ పురుషోత్తమా! నీదయవలన నాకు సమస్తము గలదు. నా కుటుంబములోని వారలకెల్లరకు నీ పాదపద్మములయందు నిశ్చలమగు భక్తి నొసగుమనెను. అంతట శ్రీ వేంకటరమణుడు ఆకాశరాజునకు సాయుజ్యముక్తిని ప్రసాదించెను. వసుదానుని తన యంగవస్త్రముతో గౌరవించెను. ఆకాశరాజు పద్మావతి నోదార్చి ఆనంద బాష్ప

ములు కన్నులునిండ గద్గద కంఠముతో శ్రీ వేంకటేశ్వరు ననుమతివడసి వసుదాన తొండమానులతో రాజ మందిరమునకు మరలెను.

# శ్రీ వేంకటేశ్వరుడు పద్మావతీదేవితో నాఱుమాసము లగస్త్యాశ్రమమున నివాసము జేయుట

శ్రీ వేంకటేశ్వరుడు పద్మావతీదేవితోడను, సకల పరివారము తోడను సాగిపోవుచు సువర్ణముఖరీ నదీతీరమును జేరెను. వివాహ దీక్షితుడనగుటచే వేంకటాచలము నధిష్ఠింపరాదని సువర్ణముఖరీ నదీతీరమును జేరెను. అగస్త్యాశ్రమమున నివాసము నేర్పాటుజేసుకొనెను. తగినరీతి చందన తాంబూల వస్త్రాద్యలంకారములతో దేవతలను సత్కరించి తమ తమ నిలయములకు బంపెను. లక్ష్మీదేవి కొల్హాపురమునకు బోయెను. పిమ్మట వేంకటేశ్వరుడు పద్మావతీదేవితో సకలభోగముల ననుభవించుచు నగస్త్యాశ్రమమున సుఖాన నివసించుచుండెను. ఇట్లుండ నొకనాడు నారాయణపురమునుండి ఒక దూత అగస్త్యాశ్రమమునకేతెంచి కన్నీరు గార్చుచు పద్మావతీదేవితో నాకాశరాజునకు ప్రాణముమీదికి వచ్చెనని చెప్పెను. ఆ మాటలను విని పద్మావతీ శ్రీ వేంకటేశ్వరులు మిక్కిలి దుఃఖించిరి. శ్రీ వేంకటేశ్వరుడు పద్మావతీ వకుళాదేవులతో నారాయణపురమునకు బయనమాయెను. అగస్త్యుడును వారివెంట బయలుదేరెను. శ్రీ వేంకటరమణుడు సూర్యాస్తమయ సమయమునకు నారాయణపురము జేరెను. రాజద్వారముకడ రాజభటులను రాజక్షేమము నడిగెను. పద్మావతీ వకుళాదేవులతో నంతఃపురమున బ్రవేశించెను. వెనువెంట నగస్త్యుడు వచ్చుచుండెను. శ్రీ వేంకటరమణుడు సతీసమేతుడై ఆకాశరాజును సమీపించి అతనిని గౌగలించి మిక్కిలి దుఃఖించెను. ఆకాశరాజును పలుకరించెను. కాని ఆకాశరాజు మానవుల స్పృహతప్పి కొన ఊపిరితో నుండెను. అగస్త్యుడు అల్లునిరాకను ఆకాశరాజునకు తెలుపజూచెను. కాని ప్రయోజనములేకపోయెను. చూచువారలెల్లరు గన్నీరు గార్చుచుండిరి. ఇట్టి సమయమున నాకాశరాజు కడపార్శిణముతో నల్లుని

జూచి వసుదాన తొండమానులను గాపుమనుచు నల్లునకు అప్పగించి కనులు మూసెను. రాజబంధుగులెల్లరు మిక్కిలి దుఃఖించిరి. వసిష్ఠాత్రి భరద్వాజ గౌతములు రాజదేహము నంత్యసంస్కారమునకు గొనిపోయిరి. ధరణీదేవియు సహగమనమునకు సన్నద్ధురాలాయెను. వసుదానుడు శాస్త్రోక్తవిధానముగ పితృకార్యముల నాచరించెను. పదునాఅవనాడు తొలి మాసికమును బెట్టింప వేదపారగులగు కశ్యపుడు, అత్రి, భరద్వాజుడు, విశ్వామిత్రుడు, గౌతముడు, వామదేవుడు, పులస్త్యుడు, వాల్మీకి, జమదగ్ని, భృగువు, సనందుడు, పరాశరుడు, యాజ్ఞవల్క్యుడు, జాబాలి, శునశ్శేపుడు, కాహలుడు మున్నగు మునిపుంగవులను నిమంత్రించెను. కార్యకలాపమంతయు శాస్త్రోక్తముగ బరిసమాప్తి నొందెను.

## రాజ్యముకొఱకు వసుదాన తొండమానులు కలహించుట

పిమ్మట శ్రీ వేంకటరమణుడు పద్మావతీ వకుళాదేవులతో బయలుదేరి యగస్త్యాశ్రమమునకేతెంచి సుఖముగ నుండెను. ఇట్లుండ నారాయణపురములో తొండమాన వసుదానులు రాజ్యముకొఱకు గలహింప సాగిరి. జ్యేష్ఠసోదరునకు బిమ్మట పితృపరంపరాగతమగు రాజ్యమునకు కనిష్ఠ సోదరుడు అధికారియని తొండమానుడును, స్వార్జితమగు రాజ్యమునకు తండ్రివెనుక పుత్త్రుడు అధికారి అని వసుదానుడును వాదులాడ జొచ్చిరి. ఇరువురును రాజ్యముకొఱకు యుద్ధముజేయ నమకట్టి సైన్యములను సమగూర్చిరి. శ్రీ వేంకటరమణుని సాహాయ్యమునుగోరి తొండమాన వసుదానులిరువురు నగస్త్యాశ్రమమునకువచ్చి శ్రీ వేంకటరమణుని శరణుజొచ్చిరి. శ్రీ వేంకటరమణుడు తొండమాన వసుదానుల నిరువురను సబహుమానముగ నాదరించి వచ్చినకార్యము నడిగెను. తొండమాన వసుదాను లిరువురును వచ్చిన కార్యమును వెల్లడించి శ్రీ వేంకటరమణుని సాహాయ్యము నిరువురు గోరిరి. శ్రీ వేంకటరమణుడు తానొంటికాడగుటచే నిరువురకు సాహాయ్యమును జేయనేరక కర్తవ్యమును దెలుపుమని పద్మావతీదేవి నడిగెను. అంత పద్మావతీదేవి భర్తతో నిట్లనెను. ఓనాథా! జగన్నాథా! నీవు ధర్మము నెఱుగుదువు. వసుదానుడు తల్లితండ్రులులేని

వాడు కావున వసుదానునకే నీవు సాహాయ్యము నాచరింపవలయుననెను. ఆ పలుకులు విని శ్రీ వేంకటరమణుడు తన శంఖచక్రములను తొండమానునకు సాహాయ్యముగనిచ్చి తాను గుఱ్ఱముపైనెక్కి సాహాయ్యము నాచరింప వసుదానునివెంట బయలుదేఱెను. తొండమాన వసుదానులకు నారాయణపుర ప్రాంతమున కురు పాండవ యుద్ధమువలె భీకరమగు యుద్ధము జరిగెను. ఇట్లు తీవ్రమగు యుద్ధము జరుగుచుండునంత తొండమానుని పుత్త్రుడు శ్రీ వేంకటేశ్వరుని చక్రముతో గొట్టెను. అప్పట్టున శ్రీ వేంకటరమణుడు లోక విడంబనముజేయుచు మూర్ఛిల్లి నేలవ్రాలెను. ప్రాకారముపైనుండి యీ భయోత్పాతమును దిలకించుచున్న పద్మావతీదేవి మిక్కిలి శోకించి కర్తవ్యమును దెలుప నగస్త్యుని బ్రార్థించెను. అంతట నగస్త్యుడు పద్మావతీదేవితో నిట్లనెను. ఓ తల్లీ! దేశ కాలముల నతిక్రమించి యేకార్యము నాచరించినను ఫలితములేదు. రణ రంగములో నేయొక్కరు నిర్జీవునివంక జూడరు. వారి దృష్టి సజీవులపై నుండును. కావున నీభర్తను జూచువారులేరు. నీవు మహాపతివ్రతవు. నీ సోదరుడు జయమొందినను పినతండ్రి జయమొందినను నీకు బ్రయోజనము తుల్యమేకాని వేఱొండుగాదు. కావున నీవు సంధియత్నము జేయ దగునని నా యాశయము. నీవు రణరంగమునకేగి నీ భర్తను గాపాడు మనెను. అంతట పద్మావతీదేవి మిక్కిలి దుఃఖముతో రణరంగమునకేగి శ్రీ వేంకటరమణునికి శీతలోపచారములను గావించెను. అంతట శ్రీ వేంకటరమణుడు నిద్రనుండి మేల్కాంచురీతి మేల్కాంచెను. శ్రీ వేంకట రమణుడు రణరంగ మధ్యమున పద్మావతీదేవినిజూచి మిక్కిలి కోపించి అగస్త్యునితో నిట్లనెను. ఓ మునిపుంగవా! వనితలు రణరంగమునకేల రావలయును? మరలింపుమనెను. అంతట నగస్త్యుడు శ్రీ వేంకటేశ్వరునితో నిట్లనెను. ఓ పురుషోత్తమా! తొండమాన వసుదానులకు సంధిజేయ నిన్ను ప్రార్థింప యిటకేతెంచెను. ఆమె కోరికను మన్నింపుమనెను. అంతట శ్రీ వేంకటరమణుడు అగస్త్యునితో నిట్లనెను. ఓ మునిపుంగవా! నేను వసుదానునకు సాహాయ్యము నాచరింప వాగ్దానమును గావించితిని. ఇపుడు తొండమానుని పుత్త్రునిజంపి వసుదానునకు రాజ్యము నిప్పింపవల యును. లేక రణరంగమున మరణింపవలయుననెను. ఆ పల్కులాలించి పద్మావతీదేవి మిక్కిలి శోకించి శ్రీ వేంకటేశ్వరునకు సాగిలబడి యిట్ల

నెను. ఓ నాథా! ఓ అరవిందాక్షా! ఓ జగన్నాథా! ఓ కృపానిధే! దయ జూపుము. లోకవినాశహేతువగు యుద్ధమేల? తొండమాన వసుదానులిరువురును రాజ్యార్హులే. కోశరాజ్యములను విభజించి వారలకిచ్చి సంధిజేయుమని ప్రార్థించెను. అగస్త్యుడు పద్మావతీదేవి కోరికను మన్నింపుమని శ్రీ వేంకటేశ్వరుల బ్రతిమాలెను. అంతట శ్రీ వేంకటరమణుడు తొండమానుని బిలచి తొండమానుని యభిప్రాయము నడిగెను. తొండమానుడు తనకు శ్రీ వెంకటరమణుడే గతియనియు, తాను శ్రీ వేంకటరమణుడు చెప్పినచొప్పున నంగీకరింతుననియు జెప్పెను. అంతట శ్రీ వేంకటరమణుడు వసుదానుని బిలచి అతని యాశయము నడిగెను. వసుదానుడును శ్రీ వేంకటరమణుని యిష్టానుసారము చేయుదుననెను. అంతట శ్రీ వేంకటరమణుడు రాజ్య కోశ సైన్యములను సమముగ విభజించి యిరువురకు బంచియిచ్చెను. మఱియు శ్రీ వేంకటరమణుడు సంధిగావించిన హేతువుచే తనకుగాని పద్మావతీదేవికిగాని పదునాఱవవంతు నిమ్మని తొండమాన వసుదానులను గోరెను. తొండమాన వసుదానులు సంతసించి పద్మావతీ శ్రీ వేంకటేశ్వరులకు ముప్పదిరెండు గ్రామముల నొసగిరి. పిమ్మట శ్రీ వేంకటరమణుడు పద్మావతీ సమేతుడై వారల యిరువుర యింటను విందులగుడిచి అగస్త్యాశ్రమమునకు బోయెను.

## తొండమానుడు శ్రీ వేంకటేశ్వరుని జూడ నగస్త్యాశ్రమమునకు బోవుట

ఇట్లుండ నొకప్పుడు తొండమానుడు శ్రీ వేంకటరమణుని దర్శనముజేయ నగస్త్యాశ్రమమునకు వచ్చెను. శ్రీ వేంకటరమణుడతనిని జూచి గౌగలించి యాదరించి వచ్చిన కార్యమేమియని యడిగెను. అంత తొండమానుడు శ్రీ వేంకటరమణునితో నిట్లనెను. ఓ గోవిందా ! నీ దర్శనముకన్న వేఱొండుగార్యములేదు. ఓ శ్రీ హరీ! వేదవేదాంగ విదులగు మునిపుంగవులు నిన్ను పరమేశ్వరుడనియు, వేదవేద్యుడవనియు బల్కుదురు. కనుక నిన్నుజూడ వచ్చితిని. ఓ అచ్యుతా! ఓ గోవిందా! ఓ లీలామానుష విగ్రహా! ఓ పురాణపురుషా! నిన్ను జగదుత్పత్తి స్థితి లయ

కారణుడవని మనీషులు వర్ణింతురు. ఓమహానుభావా! ప్రళయకాలములో చతుర్దశ భువనములను జలమయముగావించి సకల జీవరాసులను జఠరమున ధరించి నీవు దివ్యమంగళ విగ్రహుడవై లక్ష్మీదేవితో క్రీడింతువు. నీవు సహస్ర శిరములు గలవాడవు; సహస్రాక్షుడవు; సహస్రపాదుడవు. నీ ముఖమండలమునుండి విప్రసంఘములు పుట్టును; బాహువులనుండి క్షత్రబృందము పుట్టును; ఊరువులనుండి వైశ్యగణము పుట్టును; పాదములనుండి శూద్రు లుదయింతురు; నీవు సకలలోక నాథుడవు; దేవతా బృందములకు అధిదేవుడవు; యోగిపుంగవుల హృదయ కమలములో గోచరింతువు. ఓ శ్రీ వేంకటేశా! నీకు నమస్కారము. ఓ లక్ష్మీపతీ! నీకు నమస్కారము. ఓ అప్రాకృత శరీరా! నమస్కారము. ఓ అనంతా! నమస్కారము. ఓశేషాచలనివాసా; ఓ పరబ్రహ్మమూర్తీ! నమోనమః అనుచు కరములు జోడించి నిలచెను. శ్రీ వేంకటరమణుడు అతని స్తోత్రమునకు మిక్కిలి సంతసించి అతనితో నిట్లనెను. ఓ రాజా! పరమపావనమగు నుతిని జేసితివి. ఈ స్తవముతో నన్నుగొలుచువారలు సాలోక్యమును బొందుదురు; సందియము లేదు. ఆకాశరాజు మిక్కిలి పుణ్యాత్ముడు; ధర్మాత్ముడు. అతని యల్లుడనై నేను భూలోకమున కీర్తిబడసితిని. ఆకాశరాజు నన్నుజూచి మిక్కిలి ముచ్చటపడెను. అతడులేక నాకు సుఖమెట్లు కలుగును? అనుచు విచారింపసాగెను. తొండమానుడు శ్రీ వేంకటరమణు నోదార్చుచు గతించిన వారలకై వగచి ప్రయోజనములేదనెను. శ్రీ వేంకటరమణున కిప్పట్టున గావలసినదానిని దెలుపుమనెను. అంతట శ్రీ వేంకటరమణుడు తొండమానునితో నిట్లనెను. ఓ రాజా! నీ సోదరుడు తన కుమార్తెను నాకు బరిణయముజేసి నన్నొకయింటివానినిజేసెను. కాని పద్మావతితో నివసింపదగు నివాసమునాకులేదు. ఓ రాజా! ఆకాశమహారాజుయొక్క అల్లుడు, గుమార్తె పొరుగింట నివసించుచున్నారను అపకీర్తి నాకు మిక్కిలి దుఃఖకరముగానున్నది. పొరుగింట కాపురము మిక్కిలి కష్టము. ఓ రాజకులావతంసా! నాకొక మందిరమును గట్టింపుము. నీవుకాక వేఱొకరు యిక్కార్యమును దలపెట్టువారులేరు; నీవు సమ్మతింపుమనెను. అందులకు తొండమానుడంగీకరించి శ్రీ వేంకటేశ్వరాలయము గట్టింతుననెను. శ్రీ వేంకటరమణుడు మిక్కిలి సంతసించి ఒక శుభముహూర్తమున పద్మావతీదేవి

తోడను, తొండమానునితోడను వేంకటాచలమునెక్కెను. వరాహస్వామి యసుమతిపై తన నివేశమును తొండమానునకుజూపి యిట్లనెను. ఓ రాజా! ఈ స్వామిపుష్కరిణికి దక్షిణతీరమున తూరుపు ముఖముగ నాలయమును గట్టింపుము. అలయమునకు రెండు గోపురములుండవలయును; మూడు ప్రాకారములుండవలయును; సప్తద్వారములుండవలయును; ధ్వజస్తంభమును నెలకొల్పవలయును. ఆలయములోపల నాస్థాన మండపమును గట్టింపుము, యాగమండపమును గట్టింపుము, గోశాలను గట్టింపుము, ధాన్యశాలను గట్టింపుము, వస్త్రగృహమును గట్టింపుము, తైలశాలను ఘృతశాలను నిర్మింపుము, భక్ష్యశాలను భూషణశాలను గట్టింపుము, కర్పూర కస్తూరికాది సుగంధ ద్రవ్యశాలను గట్టింపుము. ఆలయము సువర్ణతోరణములతోడ చూడముచ్చటగొలుపుచు నుండవలయును. పూర్వము నీవు నాకు పూలబావిని ద్రవ్వించి కీర్తిని వడసితివి. నేడు ఆలయమును గట్టించి కీర్తివడయుదువనెను.

## తొండమానుని పూర్వజన్మవృత్తాంతము

ఆ పల్కులాలించి తొండమానుడు తాను పూలబావిని ద్రవ్వించిన వృత్తాంతమును విపులముగజెప్పుమని వేడెను. అందులకు శ్రీ వేంకటేశ్వరుడు తొండమానునితో నిట్లు చెప్పదొడగెను. ఓ మహారాజా! పూర్వము చోళదేశములో నొక వైఖానసుడు కృష్ణావతారకథ నాలకించి కృష్ణరూపమును ప్రత్యక్షముగ జూడగోరి తపముజేయ నారంభించెను. దేవదేవుడు కృష్ణరూపమున ప్రత్యక్షమాయెను. వైఖానసుడు శ్రీకృష్ణరూపమునుగొలువ ననుగ్రహింపుమనెను. అంతట పరమేశ్వరుడు వైఖానసునితో నిట్లనెను. ఓ భక్తశిఖామణీ! నీవిపుడు కృష్ణరూపమును గొలువరాదు. వేంకటాచలమునకు బొమ్ము. మార్గమధ్యమున రంగదాసుడను శూద్రభక్తుడు నీకంటబడును. అతడు నీవెంట వేంకటాచలమునకు రాగలడు. ఆ వేంకటాచలముపై స్వామిపుష్కరిణికి దక్షిణపుదెస చింతచెట్టు నీడలో నొకపుట్టకలదు. ఆ పుట్టలో శ్రీ వేంకటేశ్వరుడు కలడు. ఆతనిని నీవు పూజింపుము. రంగదాసుడు నీకు పూజలో సాయపడునవెను.

అంతట వైఖానసుడు వేంకటాచలమునకు బయనమాయెను. మార్గమధ్యమున రంగదాసుని జూచెను. వీరిరువురు వేంకటాచలము నెక్కిరి. వైఖానసుడు పుట్టలో దేవుని పూజింప మొదలిడెను. రంగదాసుడు స్వామి కైంకర్యమున కొరకు పూదోటను బెంపదలచి పూదోటకు వలయు నీటి సదుపాయమునకై బావి నొకదానిని త్రవ్వించెను. దీనికి పూలబావియని పేరు. ఇట్లుండ నొకనాడు కుండలుడను గంధర్వుడు గంధర్వ స్త్రీలతో నేతెంచి స్వామి పుష్కరిణిలో జలక్రీడలు సలుప నారంభించెను. రంగదాసుడు పూదోటలో బూలనుగోయుచు గంధర్వులను జూచి చిత్తచాంచల్యమును బొందెను. వివశుడై జలక్రీడలు సలుపు గంధర్వులనుజూచి చిత్తము చలింప తన్మయుడై కాలగతిని సయితము గుర్తింపక స్వామి కైంకర్యమునకు యాలసించెను. గంధర్వులు జలక్రీడలను చాలించి విమానారూఢులై చనిన పిమ్మట మరల రంగదాసుడు స్నానముజేసి పూలనుగోసి తెచ్చి వైఖానసునకిచ్చెను. వైఖానసుడు కాలవిళంబమునకు గోపించి రంగదాసుని మందలించెను. రంగదాసుడు లజ్జతో తలవాల్చియుండెను. అప్పట్టున దేవదేవుడు ఆకాశవాణితో నిట్లనెను. ఓ రంగదాసా! లజ్జింపనేల! నీవు నా మాయచే మోహితుడవైతివి. నీవింకను కామమును జయింపలేదు. ముందు జన్మమున సుధర్ముని తనయుడవై పుట్టి స్వామి పుష్కరిణిలో జలక్రీడలు సలిపిన గంధర్వునివలె సకల భోగముల ననుభవించి సాలోక్యమును బొందగలవు; లజ్జింపకుమనెను. ఓ తొండమాను రాజా! నీవు పూర్వజన్మమున రంగదాసుడవు. పూర్వము కూపమును త్రవ్వించి కీర్తిని బొందినరీతి ఇపుడాలయమును గట్టించి కీర్తినందుమనెను.

అంతట తొండమానుడు తాను పూర్వము త్రవ్వించిన బావిని శోధించి చూచెను. శ్రీ వేంకటేశ్వరుడు చెప్పినచొప్పున దేవాలయమును గట్టించెను. వేంకటాచలమునకు వచ్చు భక్తుల సౌకర్యముకొఱకు మెట్లను గట్టించెను. చలివేందలను బెట్టించెను. పిమ్మట తొండమానుడు శ్రీ వేంకటేశ్వరునకు ఆలయ నిర్మాణము సిద్ధమాయెననియు మందిరమున ప్రవేశింపుమనియు జెప్పెను. అంతట బ్రహ్మాది సకల దేవతలు నేతెంచిరి. వైఖానసులు మునిపుంగవులు నేతెంచిరి. వేదవేదాంగ పారగులగు విప్రులు నేతెంచిరి. విప్రులు వేదపారాయణము గావించుచుండిరి. దేవదుందుభులు మ్రోయుచుండెను. ఇట్టి తరుణములో తొండమానుడు పద్మావతీ

సమేతముగ శ్రీ వేంకటేశ్వరస్వామిని భావించి దేవాలయమున ప్రతిష్ఠ జేయించెను.

శ్లో॥ ప్రవేశయామాసవరం సుమందిరం
శ్రీ శ్రీనివాసం పురుషం పురాణమ్ ।
పద్మావతీంచాపి ముదామహీపతి
స్సమస్తలోకై ర్మనిభిర్మహోత్సవైః ॥

ఈ గర్భాలయము పరమానందమును గొలుపును. కావున దీనిని ఆనందనిలయమందురు. శ్రీ వేంకటేశ్వరుడు పద్మావతిని తన వక్షమున ధరించెను. శంఖచక్ర విహీనుడయ్యును వామకరమును కటియందుంచు కొని దక్షిణహస్తముతో తనపాదము నాశ్రయించువారలకు సంసారసాగ రముకటిమాత్రదఘ్నమని తెలుపుచుండెను.

# బ్రహ్మాదీపారోపణమును, బ్రహ్మోత్సవమును జేయించుట

అంతట చతుర్ముఖుడు దీపారాధనమునుజేసి శ్రీ వేంకటేశ్వరునిట్లు ప్రార్థించెను. ఓ దేవాధిదేవా ! ఈ దీపారాధనము కలియుగాంత పర్యం తము వృద్ధిజెందుగాక. నీ యవతారము కలియుగాంత పర్యంతము వేంక టాచలమున నుండుగాక యనెను. శ్రీ వేంకటేశ్వరుడు చతుర్ముఖున కట్లు కానిమ్మని వరమునిచ్చి తనకు ధ్వజారోహణము మొదలు అవబృధాం తము నుత్సవమును జేయింపుమనెను. అంతట చతుర్ముఖుడు తొండమా నుని బిలచి విశ్వకర్మచే రథాది వాహనములను జేయింపుమనెను. నానా దేశ జనసంకీర్ణమగు నుత్సవము ప్రశస్తము కావున సకలదేశపు జనులను బిలువనంపుమనెను. అంతట తొండమానుడు చిత్రవిచిత్రములగు వాహన ములను రథగజ కల్పవృక్షాది వాహనములను, ఛత్ర చామరాదులను విశ్వ కర్మచే జేయించెను. అంగ వంగ కళింగ పౌగండ కాశీ కాంభోజ కేరళ విరాట కురు పాండ్యదేశములకు దూతలను బంపి ఆయా దేశాధీశులను, ప్రజలను బ్రహ్మోత్సవమునుదిలకింప రావించెను. అంతట చతుర్ముఖుడు శ్రీ వేంకటేశ్వరుని నరవాహనముపై నాలయ ప్రదక్షిణమును గావింపు

మనెను. శ్రీ వేంకటేశ్వరుడందులకు చతుర్ముఖునితో నిట్లనెను. ఓ చతుర్ముఖా! నీవు బాలభావముచే నిట్లుబలుకుచుంటివి. నాకు మూర్తి చతుష్టయమును నిర్మింపుము అనెను. అంత చతుర్ముఖుడు క్షణములో చతుర్వేదములతో నుత్సవ వేంకటేశ, ఉగ్ర వేంకటేశ, సర్వాధిప వేంకటేశ, లేఖక వేంకటేశులను నాలుగుమూర్తులను నిర్మించెను. ఉత్సవమూర్తికి చతుర్ముఖుడు ఉత్సవము జేయించెను. ఉత్సవ దినములలో చిత్ర విచిత్రములగు షడ్విధాన్నములను జేయించి స్వామికి నివేదించుచుండిరి.

ధ్వజారోహణమునకు తొలినాడు చతుర్ముఖుడు గరుడానంత విష్వక్సేనాదులను ముందుబెట్టుకొని ఊరివెలుపలికిబోయెను. వేదమంత్రములతో పుట్టమట్టిని ద్రవ్వించి గజముపైబెట్టించి మేళతాళములతో నాలయమునకు దెప్పించెను. అంతట నంకురార్పణమును గావించెను. మరుసటి నాడు ధ్వజారోహణమును గావించెను. ధ్వజారోహణమునాటిప్రొద్దుట స్వామిని పాలకిలో నూరేగించిరి. ఈనాటిరాత్రి స్వామిని శేషవాహనముపై నూరేగించిరి. రెండవనాటి ప్రొద్దుట స్వామిని మరల శేషవాహనముపై నూరేగించిరి. ఈనాటిరాత్రి స్వామిని హంసవాహనముపై నూరేగించిరి. మూడవనాటి ప్రొద్దుట స్వామిని సింహవాహనముపై నూరేగించిరి. నేటిరాత్రి స్వామిని ముత్తెపుపందిరిపై నూరేగించిరి. నాలవనాటి ప్రొద్దుట స్వామిని కల్పవృక్ష వాహనమందు నూరేగించిరి. ఈనాటిరేయి స్వామిని సర్వభూపాల వాహనముపై నూరేగించిరి. అయిదవనాటిప్రొద్దుట స్వామిని పాలకిలో నూరేగించిరి. ఈనాటిరేయి స్వామిని మోహినీ యవతార వేసముతో గరుడునిపై నూరేగించిరి. ఆఱవనాటిప్రొద్దుట స్వామిని హనుమద్వాహనముపై నూరేగించిరి. ఈనాటి సాయాహ్నమున స్వామి దేవితో వసంతోత్సవమునకు వసంతోత్సవ మంటపమునకు బోపును. ఇప్పట్టున స్వామికి మంగళగిరి వాహనము. ఈనాటిరేయి స్వామిని గజవాహనముపై నూరేగించిరి. ఏడవనాటిప్రొద్దుట స్వామిని సూర్యప్రభయను వాహనముపై నూరేగించిరి. ఈనాటి రెండవ వాహనము మంగళగిరి వాహనము. ఈనాడు స్వామి దేవేరులతో పూదోటకు వేంచేయును. అప్పట్టున స్వామికి చంద్రప్రభయను వాహనము. ఎనిమిదవనాటిప్రొద్దుట స్వామికి రథోత్సవమును గావించిరి. ఈనాటిరాత్రి స్వామిని గుఱ్ఱపు వాహనముపై నూరేగించిరి. తొమ్మిదియవనాటి ప్రొద్దుట స్వామిని పాలకిలో

నూరేగించిరి. ఈనాటి రెండవ వాహనము మంగళగిరి వాహనము. ఈ తొమ్మిదియవనాటి యుత్సవమునకు బిమ్మట స్వామి స్వామి పుష్కరిణీ తీర్థములో నవబృథమును గావించును. అటుపిమ్మట ధ్వజావరోహణోత్సవమును గావించిరి. ఆ మరుసటినాడు పుష్పయాగమును గావించిరి. పిమ్మట నుత్సవమునుజూడ నేతెంచిన నానాదేశాధీశులను స్వామి ప్రసాదమగు వస్త్రాదులతో నాదరించిరి. నానాదేశపు రాజులును, ప్రజలును తమ తమ దేశములకు జనిరి. చతుర్ముఖుడు స్వామి యనుమతితో తన నివాసమునకు బోయెను. సకల దేవతలు తమతమ నెలవులకు జనిరి. తొండమానుడు శ్రీ వేంకటరమణుని యాజ్ఞగొని తన నగరమునకుబోయి సత్యధర్మ నిరతుడై రాజ్యమును బాలించుచుండెను. నిత్యము బిలమార్గమున వేంకటాచలమునకువచ్చి శ్రీ వేంకటేశ్వరస్వామిని దర్శించుచుండెను.

## కూర్ముడను విప్రుని వృత్తాంతము

తొండమానుడు రాజ్యమును బాలించుచుండ దేశము సుభిక్షముగా నుండెను. ప్రజలు పరమానందముతో నుండిరి. ఇట్లుండ నొకప్పుడు కూర్ముడను విప్రుడొకడు భార్యాపుత్త్రులతో కాశీయాత్రకు బయలువెడలి మార్గమధ్యమున గర్భిణియగు భార్యతోడను, అయిదు వత్సరముల ప్రాయముగల బాలునితోడను డస్సి తొండమండలము జేరెను. అందు తొండమానుని కీర్తినాలకించి తొండమానునిజూడ రాజమందిరమునకు బోయెను. విద్వన్మండలముతో గొలువున్న రాజును జూచి దీవించెను. తొండమానుడతని నాదరించి సత్కరించి వచ్చినకార్యము నడిగెను. అంత కూర్ముడు తొండమానునితో నిట్లనెను. ఓ మహారాజా! నా జనకుని యస్థులను గంగలో గలుప నేను భార్యాపుత్త్రులతో కాశికిబోవ బయలుదేరితిని. నాభార్య గర్భవతి. బాలుడు అయిదు వత్సరముల ప్రాయమువాడు. వారిరువురతోడను గంగాయాత్రను సాగించుట దుష్కరమని తోచుచున్నది. కావున నేను గంగాయాత్రను గావించి తిరిగివచ్చుపర్యంతము నాభార్యాపుత్త్రులను నీయొద్ద నుంచెదను; వారిని గాపాడుచుండుము అనెను. అంతట తొండమానుడు వల్లెయని కూర్మునకు వలయునంత ధనమునిచ్చి సాగనంపెను. కూర్ముని భార్యను పుత్త్రుని సురక్షితముగ గాపాడు నుద్దేశ్య

ముతో ప్రత్యేకముగ నొక భవనము గట్టించి ఆఱుమాసముల పర్యంతము భోజనమునకు సరిపోవు రసవర్గమును ఆ యింటబెట్టించి విప్రుని భార్యను సుతుని ఆయింట ప్రవేశపెట్టించెను. వీరిరువురు ధూర్తుల కంటబడకుండు నట్లు యింటిచుట్టును ప్రాకారమును గట్టించెను. ప్రాకారమునకు క్రోశ దూరములో నింటిచుట్టును భటులను కాపుగడ పెట్టెను. పిమ్మట తొండ మానుడు తన రాజ్యకార్యములలో మునిగి తేలుచు వీరిమాటను మఱచెను.

పిమ్మట గొంతకాలమునకు కూర్ముడు కాశికిబోయి జనకుని యస్థులను గంగానదిలో గలిపి గయకుబోయి గయాశ్రాద్ధాదుల నాచరించి తిరిగి తొండమండలమునకువచ్చి తొండమానునిజూచి దీవించి తన భార్యాసుతుల వృత్తాంతము నడిగెను. అంతట తొండమానుడు విప్రుని భార్యను, పుత్త్రుని స్మృతికిదెచ్చుకొని నిశ్చేష్టుడాయెను. కూర్మదద్దానిని గ్రహించి రాజ మందిరములోని వారల క్షేమములను ముచ్చటించుచు తొండమానునితో నిట్లనెను. ఓ మహారాజా! నేను కాశికిబోవు సమయములో నా భార్య గర్భవతిగ నుండెనుగదా! ప్రసవించెనా? నా సుతుడు ఎల్లప్పుడును క్రీడా సక్తుడు. చుట్టుప్రక్కల తటాకములు గలవు. నా సుతుడు క్షేమముగ నుండెనా? నా భార్యా సుతులు కనబడరు. వారలెందుగలరు? అనెను. అంత తొండమానుడు కొంతతెప్పరిల్లి ధైర్యము నవలంబించి కూర్మనితో నిట్లనెను. ఓ భూసురోత్తమా! దిగులొంద పనిలేదు. నీ భార్య సుఖ ప్రసవమయినది; పుత్రిని గనెను. నీభార్య బాలబాలికలతో గుశలముగ నున్నది. నిన్నటిదినమున శుక్రవారమగుటచే శ్రీ వేంకటేశ్వరునకు అభి షేకోత్సవము జరిగెను. కావున రాజమందిరములోని స్త్రీజనముతో నీ భార్యయు బాలబాలికలతో వేంకటాచలమునకు బోయెను. నేడో రేపో రాగలదు. లే! లెమ్ము!! స్నానము జేయుమనిచెప్పి కూర్మనకు వంట సామగ్రి నిప్పించెను. పిమ్మట తొండమానుడు సుతుని బిలచి విప్రుని భార్యకు గట్టించిన యింటికేగి వారిక్షేమము నరసిరమ్మని పంపెను. అంతట తొండమానుని పుత్త్రుడు నూతన భవనముకేగి యింటి తాళమునుదీసి చూచెను. విప్రుని భార్యా పుత్త్రులు మరణించియుండిరి. వారి యస్థులు మాత్రము కనబడెను. అంత తొండమానుని సుతుడు మిక్కిలి దుఃఖించి యీ వార్తను తొండమానునకు దెలియజేసెను. తొండమానుడు మిక్కిలి చింతాక్రాంతుడై తన సుతుని వెంటబెట్టుకొని వేంకటాచలమునకుబోయి

శ్రీ వేంకటరమణుని పాదములపై బడి వెక్కి వెక్కి యేడ్వసాగెను. శ్రీ వేంకటరమణుడు తొండమానుని కుశలములనడుగుచు నూరడింపసాగెను. కాని తొండమానుడు కంట సంతతధారలను గార్చుచునోటమాటలేకుండెను. అంతట శ్రీ వేంకటరమణుడు తొండమానుని హృదయమును గనుగొని మరల నిట్లనెను. ఓ రాజా ! నీ హృదయమును గనుగొంటిని. నీవు అకృత్యము నాచరించితివి. నీ పాపమునకు ఏమిచేయగలను ? అయినను నా భక్తుల కష్టములను నేనోర్వజాలను. నీ సుతునిబంపి విప్రుని భార్యా సుతుల యస్థులను దెప్పింపుము. కలియుగమున శ్రీ వేంకటరమణుడు మహాపాపములను సయితము పోగొట్టునను కీర్తియు నాకు రాగలదు. ఆ యస్థులను నేను సజీవులుగ జేయుదుననెను. అంతట తొండమానుడు తన సుతుని బంపి విప్రుని భార్యాపుత్త్రుల యస్థులను దెప్పించెను. శ్రీ వేంకటరమణుడు ఆ యస్థులను తన యుత్తరీయములో మూటగట్టి స్వామిపుష్కరిణికి తూరుపు దెసనుండు పాండుతీర్థము చెంతనుండు తీర్థమునకు గొనిపోయెను. ఆ యస్థులను ఆ తీర్థ తీరమునందలి శిలపై బెట్టి తాను కంఠదఘ్నముగ తీర్థములో మునిగి పుడిసెలతో నస్థులపై నీరుజల్లెను. అంతట విప్రుని భార్యయు, సుతుడును, పుత్రియు నిద్రనుండి మేల్కాంచుపగిది లేచిరి. వారిని తోడ్కొనివచ్చి శ్రీ వేంకటరమణుడు తొండమానునితో నిట్లనెను. ఓ రాజా! విప్రుని భార్యాపుత్త్రులను, శిశువును విప్రున కప్పగింపుము. నేనిటుపై మౌనమును దాల్చెదను. దృఢభక్తితత్పరులకన్న నన్యులతో మాటాడననెను. అంతట తొండమానుడు నిజ నగరమునకు బోయి జరిగిన వృత్తాంతమునుజెప్పి కూర్మునకు భార్యాపుత్త్రులను శిశువు నప్పగించెను. రాజసమక్షమున కూర్ముడు జరిగిన వృత్తాంతమేమియని సతీసుతుల నడిగెను. అంతట విప్రపత్నియగు లక్ష్మిదేవి భర్తతో నిట్లనెను. ఓ నాథా! జరిగిన వృత్తాంతము నేను వర్ణింతును. జగన్నాథుడగు శ్రీ వేంకటరమణుని గర్భములో చతుర్దశ భువనములను జూచితిని అనెను. అంత విప్రకుమారుడగు రాఘవుడు తాను ప్రమథాది గణములను జూచితిననెను. శిశువు సప్తసాగరములను జూచితిననెను. కూర్ముడు వారి పల్కులాలకించి వారు ధన్యజీవులని సంతసించెను. పిమ్మట కూర్ముడు రాజునొద్ద ననుమతివడసి తన భార్యా సుతులను, శిశువును వెంటబెట్టుకొని తన దేశమునకు బోయెను.

అలసి మూర్ఛిల్లెన్ను. అంత కులాలుడు మూర్ఛితుడగు తొండమానునిజూచి విచారింపసాగెను. ఓ దేవదేవా! మహారాజు మూర్ఛిల్లెను. నా యపరాధ మిసుమంతయులేదు. నాకీ యాపదనేల తెచ్చిపెట్టితివి? అనుచు కులాలుడు విచారించుచుండ తొండమానుడు కొంత సేదదేరి ఇట్లు పలుకజొచ్చెను. భీముడను కులాలుడెందుగలడు? అతడు మహాభక్తుడు. అతని పాదములను నిత్యము నేను నమస్కరింపగలననుచు కులాలుని వేనోళ్ళ బొగడుచుండెను. అంతలో శ్రీ వేంకటేశ్వరుడు గరుడారూఢుడై కులాలునెదుట బ్రత్యక్షమాయెను. తొండమానుడాశ్చర్యముతో జూచుచుండెను. కులాలుడు శ్రీ వేంకటరమణుని బొగడదొడగెను. శ్రీ వేంకటేశ్వరుడు గరుడుని బంపి కులాలుని తనచెంతకు రావించెను. అంతలో కులాలుని భార్య తమాలినివచ్చి ఓ గోవిందా! మమ్మనుగ్రహించి మేనుబెట్టు యన్నమును నారగింపుమనెను. శ్రీ వేంకటరమణుడు వారిభక్తికి మెచ్చి పద్మావతీదేవితో కులాల దంపతుల విందు నారగించెను. ఈవింతను బ్రహ్మాదిదేవత లాకసమునుండిచూచి కులాలదంపతులనుబొగడి, పూలను గురిపించిరి. ఇట్టి సమయములో దివ్యవిమానమొకటిరాగా శ్రీ వేంకటేశ్వరుడు తన సకలాలంకారములను కులాలునకిచ్చెను. పద్మావతీదేవి తన యలంకారములను తమాలినికిచ్చెను. లక్ష్మీనారాయణుల యాదరమువడసి కులాలదంపతులు దివ్య విమానారూఢులై విష్ణులోకమునకుబోయి సాయుజ్యపదము నొందిరి. వారినిజూచి తొండమానుడు శ్రీవేంకటేశ్వరునితో నిట్లనెను. ఓ మహానుభావా! హీనకులమునబుట్టిన శూద్రునకు సద్గతినిచ్చితివి. నేను నీబంధుడను. నాకేమిగతి? యనెను. అంత శ్రీ వేంకటేశ్వరుడు తొండమానునితో నిట్లనెను. ఓ రాజా! ఈ దేహావసానమున వేఱొంక పవిత్ర దేహమునుబొంది నన్నారాధించి సారూప్యమునుబొందుమనెను. తొండమానుడు స్వామిపుష్కరిణిలో మునిగి శరీరమును త్యజించి యుత్తర జననమున స్వామి నారాధించి ముక్తినొందెను. పవిత్రమగు నీ వేంకటేశ్వరవైభవము వినువారలకు ఇహమున సకలాభీష్టములనొసగి, పరమున పరమపదమునుసమకూర్చును.

శ్లో॥ ఇత్యేవం కథితంరాజన్ మహాత్మ్యం వేంకటేశితుః ।
యఃశృణోతీదమాఖ్యానం మనోరథ ఫలప్రదమ్ ।
ఇహలోకే సుఖంభుక్త్వా సోఽథయాతి హరేఃపదమ్ ॥

---

Sri Gopalakrishna Press, Madras—21.